# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూన్ 1958




సంపుటము 35 : : సంచిక 6

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూన్ 1958

# ఉ షో దే వ త

## శ్రీ శి వ శం క ర స్వా మి

ఋగ్వేదము. మండలము 4 సూక్తము 52.
ఋషి. వామదేవుడు. ఛందస్సు గాయత్రి.

గోచరించిన దదిగో దివో దుహిత
సుందరాకృతి నిజసోదరి కవల,
ప్రసరింప జేయుచు ప్రభలు దిక్తటుల

తల్లి కికి, ఋతావరి: వింత
పాటలద్యుతి తటిద్భాతి నుషస్సు
అశ్వినీ దేవుల కయినది చెలియ

అశ్వినీ దేవుల కగుదువు చెలివి,
జనయిత్రి వగుదువు భవికి ఉషస్స!
పాలకురాలవు భవ్యసంపదకు

వైరముల్ తొలంగించి వరభావ మొసగు
సూనృతావరి! నీకు స్తుతుల నర్పింప
మేము ధ్యానముతోడ మేలుకొన్నాము

గోచరించిన వవే గోక్షీర మట్లు
శుక్లకాంతులతోడ శుభకిరణాలు
అఖిలావకాశంబు నలమెనుషస్సు

దిశల వ్యాపించి ఛేదించివేయుదువు
కాంతితో నీవంధకార ముషస్స!
రక్షింపు నీ ప్రకారమ్ముగా మమ్ము.

అలమెదు వ్యోమమ్ము నాత్మీయ రుచుల,
అతివిశాలంబైన యంతరిక్షంబు
తెలికాంతితొ నుషోదేవి! నింపెదవు!

ఋతావరి - యజ్ఞములు కలది : సత్యనిరత.

# ద్వితీయాలు

శ్రీ కందుకూరి లింగరాజు

భార్య మహాలక్ష్మి పోయిన మూడో నెల తిరగకుండానే, రామారావుకు విధురత్వంలోని బాధలు, కష్టాలు తెలిసివచ్చేయి అని తోడుగా కొత్త పెద్దవయస్సు వాళ్ళైనా ఆసరా లేకపోవడంలోటే, అది కొండంతై గజిబిజి చేసేసింది. ఏం చెయ్యాలి అన్న ఆవేదన వెన్నుముట్టింది.

ఆ పన్నెండోరోజు దాటకుండానే దూరపు బంధువుల్లో తలనెరిసినవాళ్ళు "ఫలానా వారి సంబంధం వుంది. పిల్ల కొంచెం ముదురు అయినా" అనో "వయస్సేమాత్రం. ఇంకా నలభై దాటలేదు. ద్వితీయ వివాహం చేసుకో" అనో — ఇల్లా సలహాలు, సమీకరణలు ఇచ్చారు. అప్పుడు ఎంతో చికాకు కోపం వచ్చింది. కొందరికి కటువుగానూ, మరికొందరికి కోపప్రపాటే తోనూ సమాధానం చెప్పేడు.

ఇప్పుడు సింహావలోకనంగా నే మాస్తే వాళ్ళు చెప్పింది సబబుగా లేదనిపించింది. అందులో అనుభవం లోకజ్ఞానం మిళాయించి వున్నాయి అనీ తట్టింది. సంపాదించిన ఆస్తి, కట్టిన ఇల్లు ఈనాటికీ జీతం తెస్తున్న ఉద్యోగం ఇవన్నీ కూడా, ఇల్లా ఒంటరిగా నువ్వు వుండిపోతే బూడిదలో పోసిన పన్నీరే అన్నట్టు తోచేది. దాంతో తను ఎంత ఏకాకిగా ఉండిపోయాడా అని గుబగుబలాడిపోయేవి గుండెలు.

అయినా అవన్నీ కూడా తాత్కాలికాలు అనుకుని చాలాసార్లు 'ఏమిటీ దండాలపు తలంపులు' లక్ష్మికి అన్యాయం చెయ్యగలనా అనుకున్నాడు. దాంతో......

అప్పుడు, ఆ పన్నెండు ఏండ్ల క్రితం ప్రథమంగా, లక్ష్మి తనూ, ఈ ఇంట్లో కాపురం పెట్టేరు. ఒక పూర్ణ పుష్కరం గడిచిందని తెలియకుండానే జరిగిపోయేయి వత్సరాలు ఒకదాని వెనుక ఒకటి. ఆ సంవత్సరాల వెనకబడటం, అటు, ఇటు లక్ష్మిలో వున్న పూర్ణ సరస్వతీ ఝరి బయటపడి, తను తన్మయత్వం చెందడం కూడా జరిగేయి.

లక్ష్మి తను, తనే లక్ష్మి అయిపోయేరు. సంసారయాత్ర స్థాయి పెంచుకుంది. వటువింతంతై అన్నట్టుగా పెరిగి, ఇల్లూ, వాకిలీ పొలం బుట్టా, వగైరాలు చారికలు అయిపోయేయి.

ఇదేబాధగా వుండేది. లక్ష్మి లోకానికి, భౌతికంగా లేదు. కాని తనకి ఆత్మీయతగా అయి అమరత్వం వహించినట్లే ఇప్పటికీ వుంది.

ఈ వాతావరణంలో, ప్రతీ అరమరికా కూడా ఆమె హావభావాలలోను, చేతనంలోనూ తీగలు పారించుకున్నాయి. మరచిపోలేని మధురానుభవాలై పోయేయి.

ఈ భౌతిక, ఆధ్యాత్మిక సమ్మేళనం అతీతం అయ్యింది. రోజులు గడిచే కొద్దీ దాంతో సతమతమై పోయేడు. సముద్ర మథనం అన్నట్టే హృదయం ఘూర్ణితం అయ్యింది.

ఏవిషయంలో ఎల్లా వున్నా, ఉండించి, ఓరోజు ఎవరికీ చెప్పకుండా ఆ విరంతు కోరణాలయానికి వెళ్ళి, తన వయస్సంతే రమారమి వున్న రమణమ్మను పెళ్లి చేసుకుని తీసుకువచ్చేడు రామారావు.

ఇరుగుపొరుగులు ఆశ్చర్యపడ్డారు మిత్రులు తెల్లబోయేరు.

పేపర్లలో సంఘసంస్కరణ అన్నట్లు పేర్లు పడ్డాయి.

ఓనాటిసాయంత్రం, తెలిసినవాళ్ళకు, మిత్రులకు, ఇరుగుపొరుగులకు, విందుచేసి, పత్నీ సమేతంగా పరిచయం అయిపోయేరు రామారావు, రమణమ్మను. ఇదివాంది.

* * *

మొదట్లో రమణమ్మ, పరిస్థితులు అవగాహన అయ్యేవరకు కూడా అణగి మణగి, అతిలిస్తే ప్రేవులు లెక్కపెట్టే రీతిగానే ఇంట్లో వుండిపోయింది. మూచాయగా అన్నట్లు కాక, అమూలాగ్రంగానే

గతించిన చరిత్రలన్నీ, క్రొత్తగా వారు అన్నట్లు చెప్పేడు. ఆ చెప్పడంలో మరిచిపోతానేమో అన్నట్లు, ఒక్కొక్క విషయాన్ని టీకా తాత్పర్యాలతో వివరించేవాడు.

రమణమ్మ వింటూనే సమయానుకూలంగా మెప్పులు పడేస్తూ వుండడం రామారావుని అందలంలో కూర్చోపెట్టేసింది.

దీనికి తోడు రమణమ్మ కొత్త కద్దూ పాడుకూ వుండడం, సంప్రెటి ఊరించేకళ్ళు. ఎర్రటి ఛాయ ఇవన్నీ కలసి, తను లక్ష్మిని మర్చిపోడానికి జీవితంలో ఇంకో పత్రం త్రిప్పడానికి మత్తు కల్గింది. ఆ మత్తులో లోకంలాగే దాహోహాంతరకూ కూడా వెళ్లింది, రామారావు స్థితి.

ఆగో'జా ఆఫీసునుండివచ్చి బట్టలు మార్చుకుంటూంటేనే రమణమ్మ "మహాలక్ష్మమ్మకు సంసారం దిద్దుకునే తెలివితేటలేవటకా?" అంది.

చురుక్కుమని చూస్తూ "ఎవరన్నారు?"

"ఇంటి స్థితి చూస్తే పుట్టిన శ్రద్ధకూడా చెపుతుంది."

"అంత అధ్వాన్నంగా వుందా?"

"తెలియనట్లు అల్లా అంటారేమిటి. ఇరుగు పొరుగు కోడై కూస్తుంటే. ఒక్కనాడైనా సుఖంగా వారుండలేకపోయేరుట కా?"

పూర్వాపరాలన్నీ పొంగి పొరలి పోయేయన్న దుఃఖం వచ్చింది. నిరుత్తరుడే అయ్యేడు.

దగ్గరపా ఒస్తూ పాతిదిపట్టుకుని "ఎంతగా కుమిలి క్రుంగిపోయేరో వారు. నేను వున్నానుగా ఇప్పుడు... ఆ గతించిన..." తక్కువ ఆగిపోయింది. దాంతో పొదివి పట్టుకున్న చేతులూ విడిపోయేయి. క్షణకంలోనే ఆవిడ కళ్ళు చెమర్చడం, కెమ్మదిగా కన్నీటి బిందువులు కారడం ... వుండలేక మొఖంలోకి చూడలేక, గబగబా వంటింట్లోకి వెళ్ళిపోయింది రమణమ్మ.

తెల్లబోయేడు రామారావు. ఖంగారుగానే వెనుక వెళ్ళేడు. ఆవిడా వంటింటింలోకి వెళ్ళి "మిరపకాయలు ఎండవెయ్యాలని" డెక్కుపటిన కంఠంలో అంటూనే, చేటలో పొయ్యడం, ఆ ఘాటుకు తనకి తుమ్ములు రావడం జరిగి, సావిట్లోకి వచ్చేసేడు. కాని గాభరాగా నేవుంది; ఎల్లా అనునయం చెయ్యాలో తెలియలేదు. పైగా కట్టలు తెగినట్లు ఈ ఒక్క ఉదుటలో వచ్చిన ఉప్పెన అర్థం కాలేదు.

తనూ పొదివి తీసుకో లేదేమో అని అనుకున్నా, తప్పిదం కన్పించటం లేదు.

అవాళ్టి అల్లా రమణమ్మ పరాగానే వుండి పోయింది. ఏ పెద్ద తక్కువావుంటే ఏదో దారి, కారణం చెప్పివుండేవారు. అది లేకపోవడం ఈ పరిస్థితి వదిగ్లివాన లాగే తట్టడం అయ్యింది.

ఆ సాయంత్రం, మల్లెపూలు, పాలకోవాకూడా తెచ్చినవి, తను రోజూలా ఆదరించలేకపోయేడు.

*    *    *    *

మర్నాడు రాత్రి భోజనాల దగ్గర కూర్చున్నప్పుడే "నిన్న ఏదోలా మనస్సు చివుక్కుమంది. మిమ్మల్ని చాలా కష్టపెట్టేను కాదూ?" ఎంతో ఇదై పోతున్నట్లుగా అడిగింది.

తెలబోయేడు; తనే, కారణం అరాతియ్యాలని పరిమితి మవుతున్నాడు, దారి తెలియక.

"ఒక్కొక్కసారి కొన్ని విషయాలో ఎంత మర్చిపోదామనుకున్నా మర్చిపోలేను. అందులో ప్రత్యేకంగా కొన్ని ఘట్టాలు" అంది యథాలాపంగా.

గుండెలు ఆగినంతపనైంది రామారావుకు. ఓసారి జాలి, మరోప్రక్క ఈర్ష్య కోపం రగిలేయి. ఈ ప్రెమాడైపోయిన చెట్టుకు నీరుపోసి, చిగురింప చేసినా, మనస్సు ఆ గతి వృత్తరణల్లోనే తిరిగి ఆ వాతావరణాన్ని కల్పించుకుంటూ, దాన్నే మననం చేసు కుని, ఈ పగ్గచిగురుల్లో రంగులు కల్పించడం సహజం అనుకున్నా, చెసినత్యాలగాను కృతజ్ఞత లేకుండా వుండడం కోపాన్ని ఉరకలు వేయిస్తోంది.

రవులుతున్నప్పుడే "మనుష్యులకు కృతజ్ఞత తాలి కట్టింది. దాన్ని ఛేదిస్తే మృగప్రాయులవుతారు. దీనివల్ల గమ్యస్థానం స్థిరం అవటానికి ఆస్కారముంది" అన్నాడు.

రమణమ్మ ఆతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ "నే నేం చేసేను" అంది. అందులో నోట్లోపటికి ఉల్లంకూడా కరగదిన్నంత అమాయికత్వం చూపించేసింది.

"ఎవరూ ఏం చెయ్యలేదు" విసురుగా నే అన్నాడు. గబగబా వ్యంజనాలన్నిటినీ ముట్టుకో కుండా. అయిందయిందన్నట్లే ఉత్తర ఔపోసనం పట్టేసేడు.

మొఖం తేపురించుకునే, "అయినా అంతే!" అనేసింది రవణమ్మ అకస్మాత్తుంగా.

"అందుకే దేవుడు తీసుకువెళ్ళి పోయేడు" అంటూ పావిట్లోకి ఏడ్చేసేను.

వినువీధినే రేగిన లేతపట్టులా తనతేజం ఎంత అధోగతిలోకి లాగబడిందో అన్న కుమిలింపు ప్రబలుకుంది. వూహించని సుందరి. ఎంత క్రూరంగా తలంపులన్నీ తన ప్రథమధర్మాన్ని పెట్టుకుని తన్ని తన దర్శల్ని, ఉన్నతినీ, ప్రతిష్ఠని ఒక్కటేమిటి సర్వస్వం, పోలిక చేసుకుని, రూపాన్ని విద్వేషించి, సంసారం సాగించడం అన్నంత, నైతికపతనం ఏదీ లేదేమో అనిపించింది. తాను ఒక ద్రష్ట అయివుండడం తప్పు—వీమృగ్యమైన పాత్రలాగే.

లక్ష్మి చెప్పిందా తన్ని ద్వితీయం చేసుకోమని. లేనే లేదు. అందుకే జీవితం ఇల్లామండి, బుగ్గవలేని స్థితిలో కుళ్ళిపోవలసి వచ్చింది అన్న భావన తట్టింది.

ఏం చెయ్యగలడు? ఇదే నిర్ధారణ అవటం లేదు. విడిచిపెట్టేస్తే, విధుర జీవితం తిరిగి తాండవం. తట్టుకోడితే మానవత్వానికి సమాధి. మార్చుకల్గిన దారి? అదీ కన్పడలేదు.

ఏది ఎల్లావున్నా, ఆ సంపుటాలకి టీక వ్రాయవలసిన బాధ్యత తనమీదనే వుంది. తనే భరించాలి. తను మార్గం చూపించుకోవాలి. ఎంచేతనంటే రమణమ్మ జీవితం నిర్ణీత సరిహద్దుల్లోనే అడ్డగీతలైంది. మానవస్వభావరీత్యా అది సంకుచితమై ముడుచుకుంది. దాన్ని పాముల బుట్టలా తను అవృతం అయి సరిదిద్దాలి.

సామానులన్నీ సర్దుకోకతో సాగిన త్వరిత గమనం, రమణమ్మని పడకటింట్లో పెట్టేసింది. నెమ్మదిగా లేచి వెళ్ళేను. బోర్లాపడుకుని, చెదిరిన కబరీభారంలోనుంచి, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎకుడుదిగుడు లవుతున్నాయి. దుఃఖంలో స్వరజతులే అయ్యింది భావన.

జాలి ముమ్మరమై "రాణీ" అంటూ నే పొదివి తీసుకున్నాడు. బావురుమంటూ గుండెల్లోకి దూరిపోయి, చొక్కామీద కళ్ళు అద్దుకుంది.

"ఆయన అంత క్రూరంగా వుండే వాడా?" అన్నాడు.

తలూపింది.

"నువ్వు చాలా కష్టపడివుంటావు. ఎక్కువగా బాధించేవాడు కాబోలు."

"ముక్కుమీద వుండేది కోపం. రుస రుసలాడుతూ వుండేవారు, అప్పుడప్పుడు..." మరింతగా తల దూర్చేసింది.

"ఎన్ని కష్టాలుపడ్డావు. నువ్వుచాలా అమాయకురాలివి. ఇంకొక ఆడది అయితేనా..."

"నేనూ అల్లాగే అనేదాన్ని" దువ్వున లేచి అంది, హుషారుగా.

"అవన్నీ నేను మర్చిపోయేటట్లు చేస్తాను నిన్నే...నిన్నే..."

"ఎంత మంచివారూ..." అంటూనే బుగ్గలు గోముగా నిమిరింది. శరీరాన్ని తన వేపు లాక్కుంది...

ఆ రాత్రి...

లక్ష్మి, నవ దుర్గలా పహారా కాసేసి కంటిమీద కునుకుపడ నివ్వనేలేదు. మైకంలో 'లక్ష్మి' అన్న అంతఃకల్లోలంలో ఐక్యమైపోయేడు...

'ఛా' అనుకున్నాడు..."నీ స్థితేమిటోయ్. వెర్రి వుల్లాయి" అంటూ ఆత్మ ఎత్తిపొడిసింది. చెమటలు క్రమ్మేయి ఆపాదమస్తకం రామారావుకి.

* * *

ఓ నిర్దిష్ట పంథా ఏర్పడిందని రామారావు సంతోషపడ్డాడు. ఇదే ఆదరణలో పడితే, స్వర్గానికి నిచ్చెనలు వేసినట్టు అవుతుందని పుణుకులతో నే ఆదరణలో పెట్టేను. ఈ ఆదరించడం అన్నది ఒక్కొక్కసారి అతీతాల్లోకి వెళుతుందేమో అన్న ధ్యాసే లేకుండా అయిపోయింది.

రమణమ్మకి అనువయ్యంగా, అన్ని సౌకర్యాలు, సంతోషాలు సమకూర్చాలన్న ఉద్దేశ్యం అందలం ఎక్కింది. అంతవరకూ తియ్యని, లక్ష్మి పెట్టెలోని, తను కొన్న, పెళ్ళివాడు పెట్టిన, పట్టుచీరలన్నీ బయటకు తీసేను. నెలకో చీర చొప్పున కొన్నవీ ఉండిపోయేయి అందులో. పైగా వీటితోపాటు, కట్టువంకీ, కాసుల పేరు, వాల్లు జతల మిరియాలగాజులు, వానువాడు కూడా పైన పెట్టేను.

తీసేసిన్న పేరకాని, ఏ విధంగా రమణమ్మకి ఇవ్వాలన్నది సందిగ్ధం అయ్యింది. ఏదో పనిమీద ఆ గదిలోకి వచ్చిన రమణమ్మ, ఇవన్నీ చూచి, తెల్లబోయి గోడకు చేర్లాపడింది.

నవ్వేడు. "అవన్నీ నీవే రమణా!" అన్నాడు. దేవుడికి కృతజ్ఞత చెప్పుకుంటూనే.

"నావా!" గొంతుకలోంచే అంది.

"అవును. ముమ్మాటికీ నీవే. నీవి కాకపోతే ఇంకెవరివి?" అన్నాడు, కాని గుండెలు ఓ సారి ఆగి మళ్లీ స్పందనం ప్రారంభించినట్లయ్యింది.

రమణమ్మ వెనకటి జీవితంలో పసుపుతాడు తప్ప లేని మెడలో, ఇవన్నీ ఎదురుగా తిరిగితే, స్త్రీ సహజపు కోర్కెల్లోనే ఒక్కొక్కటే త్రిప్పి, సృజించి చూచింది. దాంతోనే క్రమంగా ఆయనంటే ఆరాధన క్రమ్ముకుంది. "నీకోసం" అన్న వాక్యం వేదపారాయణం అయిపోయింది. దగ్గరగా వస్తూనే, కళ్లు చెమ్మగిలగా భుజాలమీద చేతులు వేసి చిరునవ్వు నవ్వి సిగ్గుపడిపోయింది.

ఓ చేత్తో పొదివిపట్టుకుని ఒక్కొక్క నగే మెళ్లో చేతికీను, పెట్టేడు. తొడుగుతున్నప్పుడు కిలకిల్లాడిపోయింది రమణమ్మ.

"ఇప్పుడే వస్తాను" అంటూనే ఆకుపచ్చ పట్టుచీర, ఆరుద్ర పురుగురంగు వెల్వెట్ జాకెట్టు పట్టుకు తుర్రుమంది.

ఒక్కసారి నిట్టూర్పుగానే గాలి విడిచేడు రామారావు. గది మధ్యలో వట్టివేళ్ల వాసన, మల్లెపూలు విచ్చిన సౌందర్యం దాచుకున్న అన్నపూర్ణలా పొగలు చిమ్మిన అత్తరుపుల్లలు, తలకు రాచుకున్న జాజిపువ్వులనూనె, అమృతం అయిపోయేయి.

మైకం క్రమ్మనే క్రమ్మింది. నీరూరిన కళ్లల్లో మసగ్గానే, ఆకుపచ్చచీర, ఆరుద్రపురుగురంగు జాకెట్టు తల్లో మల్లెపూలు, వట్టివేళ్ళ అత్తరు, చెవులచివర్ల కటువంకీ అందలం, కాసులపేరు మెరుపు...జీవం పోసుకుని, కాటుక కళ్ల మధ్య, తోపు కుంకుమ మెరుపులో మళ్లీజీవం పోసుకుంది.

కనుమూసు చేసుకునేటప్పటికి రమణమ్మ ఎదురుగా అదే ఆకారంలో, వెయ్యి వసంతాల నవ్వుతోనే వచ్చేసింది.

తేరుకోలేక పోయాడు, తబ్బిబ్బు అయ్యాడు రామారావు.

చెవులో చెదిపెట్టినట్లే "ఎల్లా వున్నాను" అని గునిసింది.

"లక్ష్మిలా వున్నావు" అప్రయత్నంగానే వచ్చేసింది మాట.

ఘెల్లున చెంపపెట్టు ఇచ్చినట్లే రమణమ్మ తూలిపడి కేవురింపులో "ఆ చచ్చిపోయిన ఆవిడమీద అంత మమకారం, ఆరాధనవుంటే నన్నెందుకు పెళ్ళి చేసుకున్నారు! చేసుకుని దాన్ని తలచుకుంటూ, మనసావాచా దాన్ని ఆరాధిస్తూ, దాన్నే నాలో ఆరాధించుకుని, నన్ను సమాధికట్టడం ఎందుకూ? చిత్రవధ చేయడం ఎందుకూ. ఇందుకా దానికి కొన్న నగలు, బట్టలు నాకిచ్చి, నన్ను నేనుగా లేకుండా, దాని తొడుగులలో జీవించమనడానికా ఇష్టం.. నాకేం అక్కర్లేదు... వెనక నగలు...దరిద్రపు కూడు..." అంటూనే ఒక్కొక్కటీ తీసేసి విసిరింది. ఆఖరుకు ఖండువా ఒకటి చుట్టపెట్టుకుని, చీర, జాకెట్టు కూడా మొహంమీద కొట్టి వెళ్ళిపోయింది

కదలిక లేని కొయ్య అయ్యాడు రామారావు. చైతన్య రాహిత్యంలో మనస్సు వికలమైంది.

గట్టిగా ఏడ్వాలనిపించింది. ఒక్కొక్కటే ఏరి, మడత పెట్టి, నిర్లిప్తంగానే పెట్టెలో పెట్టేడు. అవ్యక్తముగా అవి కన్నీళ్ళతో మాలిన్యం కడుక్కున్నాయి.

"లక్ష్మీ! నువ్వు చెప్పు నేనేం తప్పుచేసేను" అని బావురుమని పోయేడు.

కర్తవ్యం ఏమిటో తెలియక ఖండువా భుజం మీద వేసుకుని బజారునపడ్డాడు.

గుమ్మం మెట్లు దిగినప్పుడే పెట్టె తీసిన శబ్దం. విసురుగా గిన్నెల చప్పుడు వినిపించింది.

'ఎందుకు ఈ ద్వితీయం అనే వాంఛ కల్గింది' అన్న సమస్య పూర్తిచెయ్యాలనుకునే ఆలోచించేడు. అది తెగా తెంపు లేని సముద్ర మథనం అయ్యింది.

* * *

ఆరోజునుండి రమణమ్మ మూతిబిడాయించుకుని, మాటలు మాట్లాడ్డం ప్రారంభించింది. ముభావ సమాధానాల్లో కత్తి దెబ్బ అన్నట్లే వుంది ఎడముఖం పెడముఖాల్లో.

'నాలైదు రోజులు ఇల్లంతా కిలకిలలు లేక నిశ్శబ్దం అవడం, రామారావుకి చీమలు కుట్టినట్లే అయ్యింది. నోరారగ మాట్లాడాలన్నా అభిజాత్యం అడ్డు పడింది. తీరా ఆలోచిస్తే 'తప్పే లేదు' అని అటినా నోరు ఆడకుండా మొరాయించింది. ఆ నాల్గు రోజుల ముందే ఇంట్లో వున్న లక్ష్మి నగలన్నీ కూడా, బజారుకు తీసుకువెళ్ళి, పలకసర్లు, బ్రిడ్జిగాజులు, జాజిమొగ్గల నెక్ లేస్ క్రింద మార్పుకు ఇచ్చేసేడు

ఒక్కసారి 'ఎంతక్రూరంగా లక్ష్మిని బలిపెట్టేసేవు' అన్న తలంపు క్రమ్మితే కళ్ళుమూసుకున్నాడు. 'తనే మారాలి' అన్న భావనలో. ఇవన్నీ రమణమ్మకు చెప్పడం కాని, వివరించడం కాని జరగనేలేదు. ఇంక చీరలు జాకెట్లు మాత్రం వుండిపోయేయి. వాట్లను ఏం

చెయ్యాలో తెలియ లేదు. అయినా ఏ మార్పొక్కటైనా తీసుకుంటారేమో అన్న భావం, వ్యర్థ తలంపులాగే వుంది.

ఆవాళ భోజనందగ్గరే రమణమ్మ "నేనేం తప్పు చేసేనని ఇల్లా కాల్చుకుతింటున్నారు. నన్ను నన్నుగా జీవించనియ్యరు న్నాను అంతే! దాని ఇంత రాద్ధాంతం చెయ్యాలా? ఈ నాల్గు రోజులనుండి ఉరేసుకున్నట్లు వుంది మీరు మాటాడకపోవడం... నాకు మీరు తప్ప ఇంకెవ్వరున్నారు..." అంటూనే కళ్ళమ్మట నీళ్ళు క్రుక్కుకుంది.

శృంగార కావ్యాల్లో ఘట్టాల్లాగే వుంది ఈ నీరెండల సొగసు అనుకున్నాడు.

బుజగింపు చేస్తూనే "మాచెవు నీకోసంగా నేను. నాకు మాత్రం ఎవరున్నారు" అన్నాడు. ఎదురు సవాలుగా.

ఎంగిలన్న విషేసం లేకుండానే బుగ్గలు నిమిరి ముద్దు పెట్టుకుంది రమణమ్మ. కదిలేయ్యాడు రామారావు వినూత్న అధ్యాయంలో ఆరాత్రి

చెవుల్లో చెవిపెట్టి ఒక్క పుస్తెల తాడు పరరిస్తూనే, వట్టివేళ్ళ గుబాళింపులో, కంపాలి మెరుగెట్టి ఇచ్చిన నాలన్నీ విపులంగా చెప్పేడు. కువకువమంటూ పావురాయిలాగే గుండెల్లో దూరిపోయింది.

సమాధుల్లో తులసి మొక్కలన్నట్లుగానే ఆయి సౌందర్యం మాగన్ను పడింది.

*  •  *

ఏది ఎల్లావున్నా ఇంతగా తనుమారినా రమణమ్మ కొన్నికొన్ని సమయాల్లో బిగుసుకుపోయి, దారిలో పడలేకపోవడం జరుగుతూనే వుంది. తను మాత్రం అడుగడుక్కూ లక్ష్మి ఎక్కడ జ్ఞాపకం వస్తుందో అనుకుంటూనే కట్టెళ్ళలోకి పోవడం ఎక్కువై మానసిక ఆందోళనం మిగిలింది.

ఎనిమిదిగజాల గ్లాస్కో పంచకట్టుకుని ఉప్పాడ జరీఅంచు ఖండువాలాల్చిమీద వల్లెవేసుకుని, వీధిలోకి వెళదాం అనుకునే, దగ్గరగా వచ్చిన రమణమ్మని పొదివి తీసుకుని 'ఎల్లా వున్నావని' అడిగితే, చైతన్యం లేని బొమ్మలాగే కళ్ళప్పగించడం వల్లమాలిన కోపం తెప్పించింది. దాంతోనే నిభాయించలేని ఉద్రేకంలో "నన్ను కట్టుకున్నావనే కాని, ఆయన్ని రూపొందించుకుని బ్రతుకుతున్నావు, అంతేగాదూ!" అనేసేడు.

చెప్పలేని బాధలోనే అరచేతుల్లో ముఖం దాచుకుంది.

ఇల్లాంటి దాన్ని మళ్ళీ పెళ్ళెందుకు చేసుకున్నావు? ఉద్యోగానికేనా? ఏం సుఖం ఇద్దామనుకున్నావు? ఇస్తున్నావు?" ఆయనకూడా ఇలాగే బట్టలు జేసుకుని లాలించేవాడు కాబోలు. ఆయనే అనుకుని వచ్చేవు... కాని..."

ఎక్కిళ్ళు ఎక్కువే అయ్యాయి.

"ఎందుకీ మానసిక వ్యభిచారం" జుగుప్స లేచింది "మీరు మాత్రం"

"నేనా?"

"అవును. లక్ష్మిలా నన్ను నిరీక్షించుకుంటూ, ఆమే అనుకుని నన్ను నవిలేస్తూ... ఉండటంలేదూ! అది మాత్రం వ్యభిచారం కాదా?"

రివ్వున తగిలింది. ఆలోచనలు ముందుకుపడెయ్యలేకపోతే, గుజిలీ పుస్తకం అయిపోయేది. ఎప్పుడో ఒకప్పుడు ఈ రుజువవుతుందనుకున్న భయం, పూర్తి మిత్తి అయి రూపొందింది.

మెమ్మదిగానే, అడుగులు వేస్తూనే లేవనెత్తేడు.

తెల్లబోయింది రమణమ్మ, ఈ అనునయానికి.

"అవును. మనిద్దరి జీవితాలు కొన్నాళ్ళు భిన్న దృక్పథాల్లో నడిచేయి. అందులో శరీరాలు వయస్సుల్లో రంగులు దిద్దుకున్నాయి అవి ఒక్కనాటిలో ఈ మారిన పంథాకి అలవాటు పడవు. కాని ప్రయత్నిస్తే సఫలీకృతులం అవుతామేమో అన్న ఆశవుంది.

దానికి త్యాగం కావాలి. అది యౌవనంలో ఉత్కృష్టమవుతుంది. లేకపోతే పతనం తప్పదు..."

ఇక చెప్పలేక పోయేడు. కళ్ళమ్మట నీళ్ళు కారేయి.

ఇద్దరూ మౌనంలోనే వుండిపోయేరు...

ముసగపట్టి గది మూలల్లోంచి వెదజల్లిన ఆషాఢ మేఘంలాగే మెమ్మదిగా నడుస్తూనే గుమ్మందాటేరు.

అందులో గతానికి సమాధి, భావికి పునాది కుంచె పారించింది, ఆ ఆశల్లోనే, అందాలు సవరించుకుందుకు అద్దాలు వెతుక్కున్నారు.

కువకువలాడినట్లే వచ్చి గుమ్మస్తూనే "సెల తిప్పినట్లు" పొంగిపోయింది.

ఎవరి గుండెల్లో వారికి లక్ష్మి, రాజారావులు తణికం మెసలి, మసలి పోయేరు.

# వేదనా వాసుదేవము

శ్రీ నాయని సుబ్బారావు

నీవు వాసుదేవ భావ విస్మృతి నొక్క
కొండ కొమ్ము నెక్కి కూరుచుండి,
ఆ యగమ్య పథము నందుకోజాలని
నన్ను తప్పుబట్ట న్యాయమయ్య !

అన్నా! యెన్నడు గాని నీదరికి గ
ర్వావిష్టత న్నేను రా
నన్నానా, మదిఁగంటగించుకొని న
న్నజ్ఞాతవాసమ్ము పొ
మ్మన్నావెందుకు ! విచ్చిచూచుకొన వ
య్యా నాదు డెందమ్ము శ్రీ
మన్నారాయణమూర్తి దివ్యపద ప
ద్మశ్రీ గుబాళించునో !

శ్రీమంతుడవేగా ! నా
కామిత మీడేర్ప నీకు గగనమటయ్యా
స్వామీ ! అనంతలక్ష్మీ
ధామము నీగుండె బండతనమే మందుగా !

ఆ మహాతల్లి చలువఁ గోటానకోట్ల
కీవు పడగ లెత్తితివి కొండెక్కకులుక,
ఆలి చేసిన సంపన్మహానుభావ !
వట్టి పిసినారివగుట భావ్యమ్మటయ్య !

ఆ జగల్లయకారి సాంబయ్య భ్రష్ట
చిత్తులకు త్రవ్వి తండమ్ము లెత్తువాడు !
భక్తులను బిట్టు ఊచి అంపాన బెట్టి
కాని వదలని గడుసు వెంకయ్యవీవు!

ఆయన నినుఁజూపించును.
ఆయనఁజూపింతు వీవు, హరిహరబలవ
న్మాయా వాగుర నెఱకలు
పోయిన పక్షినయి దొద్దవోవుదు నేసున్!

ఇరువురును తోడుదొంగలే పరమ గురులు!
హరిహరాద్వైతభావ ఖలాంతరమున
కలిపికొట్టిరి కొందఱు ఘనులు మిమ్ము.
రాలెనేమొ వారికిని వరాలమాట!

మన నెఱుగలేని పంగనామాల దొరవు:
పదియు నాలుగులోకాల పట్టు నీ మ
హా జఠర మెప్డు నక నక లాడ నీని.
భక్తులకు పంగనామాలు పంచుమంతె!

ఇది నా వేదన నీకు సహ్యమగునో
యేమో అదేమింత ప
ట్టదు పో నాకు, త్రయీ శిరోగ్రముల నా
ట్య స్ఫూర్తి దీపించు నీ
పదయుగ్మమ్మది నా హృదంతరమునన్
బంధించు కో గంటి, నా
కదియే చాలు సమస్త విశ్వభువన
వ్యాపార పారాయణా!

# మంచి రోజులు

శ్రీ కొండముది హనుమంతరావు

పాత్రలు: రామనాథం, సుధాకర్, శంకరయ్య, శేఖరం, నౌకరు, రాధ.

* * రామనాథంగారి ఇంట్లో మధ్య హాలు. ఆకాశం మేఘావృతమయి ఉండటం వలన సంజచీకట్లు మరీ చిక్కనయి హాలు తమోమయం చేస్తాయి.

ఒకమగ కంఠం. "రఘుపతిరాఘవ రాజారాం, పతితపావన సీతారాం, ఈశ్వర అల్లా తేరేనాం..." అన్న ప్రార్థనా గీతం మందంగా వినిపిస్తుంటుంది. అంతలోకి, రంగం కుడివైపు నుంచి ఏవో ఇత్తడిగిన్నెలు క్రిందపడ్డ శబ్దం విన్పించటంతో పాట ఆపి, "ఏమిటమ్మా రాధ ?- ఆ చప్పుడు" అని ఆత్రుతతో ప్రశ్నిస్తుంది ఆ మగ కంఠం.

"ఆఁ! ఏంలేదు... గ్లాసులుతోమి గట్టుమీదపెట్టుంటే చేయిజారి గచ్చుమీద పడ్డయ్ - అరే! ఇదేమిటీ? చీకట్లో నే పడుకున్నారు!" అంటూ లైటువేస్తుంది రాధ.

హాలు మధ్యన వెలుగుతున్న లైటు కాంతిలో కన్పించేవి - రంగం మధ్యన ఒక పడకకుర్చీ; ఎదురుగా గోడనున్న చిలక కొయ్యకు ఒక వంకెక్కర, ఉత్తరీయము; ఆ పక్కనే ఒక స్విచ్ బోర్డు; రంగం ఎడమపక్కన వీధిలోకి పోయేందుకు ఒక ద్వారం, కుడివైపున వంటగదిలోకి వెళ్ళేందుకు మరో ద్వారం; కుడివైపుద్వారం పక్కన ఎత్తి ఉంచిన ఒక నవారు మంచము.

పడక కుర్చీలో రామనాథం పడుకుని ఉంటాడు. పది పేను రోజులుగా పెంచిన తెల్లనిగడ్డము, నెరిసిన బట్టతల, మాసిపోయిన ధోవతి, లాల్చీ—వయసు సుమారు అరవై సంవత్సరాలు.

రాధ నేతచీర, చీటీగుడ్డ జాకెట్టుతో అతిసామాన్యంగా ఉంటుంది. వయసు ఇరవై సంవత్సరాలు. మాటా జీతిరులో వినయవిధేయతలు ఉట్టిపడుతూ ఉంటాయి.

రామ: గ్లాసులు కాళ్ళమీద పడలేదు గదా?

రాధ: లేదు. కాళ్ళమీద పడితే అంత చప్పుడయ్యేది కాదుగా?—చేయి జారి గచ్చుమీద పడ్డయ్.

రామ: అదృష్టం బాగుంది కాబట్టి సరిపోయింది. పొరపాటున కాళ్ళమీదపడితే ఏమయ్యేది? అదిగాకపోయినా ఇప్పుడు గ్లాసులతో పనేమిటమ్మా?

రాధ: పనేమీ లేదు—కాఫీగ్లాసులు తోముదామని బావిదగ్గర పడేసి మర్చిపోయాను. ఇప్పుడు గుర్తొచ్చి తోముకువచ్చాను.

రామ: (దీర్ఘంగా నిట్టూర్చి) భగవల్లీలలు విచిత్రంగా ఉంటయ్! నీ అవ్వ గ్లాసులు తోమటం కాదుగదా, పనిమనిషి తోమిన నీళ్ళతోనయినా తొలిచి ఎఱుగదు. నువ్వేమో కాపురానికివచ్చిన నాటినుండీ అంట్లూ, చెంబులూ తోముకోవాల్సివస్తూంది.

రాధ: ఆమె జీవితం అలా గడిచిపోవాలని రాసిపెట్టి ఉంది. నాకు ప్రస్తుతానికిలా ఉంది. ఎల్లకాలం ఇలాగే ఉంటాయని ఎందుకనుకోవాలి? మంచి రోజులు రాకూడదూ?

రాము : (నిరాశగా, కన్పడీ కన్పడకుండా నవ్వి) హుఁ! మంచిరోజులు!—మనకు మంచిరోజులా?... ఏమో నమ్మా రాధా! నాకు మాత్రం నమ్మకం లేదు. ఏడాదినుంచి మంచిరోజులకోసం ఎదురు తెన్నులు చూశాను. 'రేపు' మీద విశ్వాసముంచుకుని, వెలుగు నింపుకున్నాను. ఆ రేపు నేడయే సరికి నే నూహించుకున్న కాంతి కాస్తా హరించుకుపోయేది: నిన్నటిలోకిపోయి చీకటిదించుకునేది. ఇలాంటి రేపు లెన్నో గతించిపోయినయ్. వెనక్కి తిరిగి చూసుకుంటే దట్టమైన చీకటి తెరలు, భవిష్యత్తులోకి దృష్టిసారిస్తే నాలుగుదిశలనుంచీ పలుచుకుంటున్న కటిక చీకటి...ఒక్క కాంతికణమయినా కన్పించటం లేదు—ఇంకెన్నాళ్ళు నన్ను నేను మోసం చేసుకుంటాను?

రాధ : మీరలా అనకండి. నిజంగా మనకు మంచి రోజులు వస్తయ్. అలాఅని నాకు బాగా నమ్మకం ఉంది.

రాము : నువు నమ్మకం ఉంచుకో—నేను కాదనను. కాని నన్ను కూడా నమ్మమని మాత్రం చెప్పకు. ఇదే మాట ఇందాక అవధాన్లతో కూడా చెప్పాను.

రాధ : అవధాన్లా? ఎవరండీ ఆయన?

రాము : నువ్వెఱుగవులే. నాకు బాల్యమిత్రుడు. జాతకాలు అవీ చెప్తుంటాడు. చేతులు చూస్తుంటాడు. ఇందాకవచ్చి చెయిచూశాడు. నువ్వింకెన్నాళ్లో కష్టాలనుభవించవు. నీ కష్టాలు గట్టెక్కె రోజు చాలా దగ్గరలోకి వచ్చింది. నీకు మంచి రోజులు కొద్దిరోజుల్లో నే వస్తయ్—అంటూ చెప్పాడు. కాని నేను నమ్మలేదనుకో.

రాధ : ఎందుకని నమ్మకూడదు? కష్టసుఖాలు వెలుగు నీడలవంటి వంటారు. ఎల్లకాలం చీకటిరోజులే ఉంటాయా? వెన్నెలమటుకురాదూ? ఆ అవధాన్లుగారెవరోగాని నిజం చెప్పారు. మనకు మంచిరోజులు వస్తయ్—అనతి కాలంలోనే.

రాము : అరవై ఏళ్లు పైబడవాణ్ణి నేను; ఇరవై ఏళ్ళు కూడా నిండాలేవు నీకు జీవితంలోని ఒడుదుడుకులను చూసినవాడికి అర్థం కుర్థం తెలియని దానివి ఆశావాదం నూరిపోస్తావా-పిచ్చిదానా! కారుదిగని వాడిని కాలినడక వానికష్టాలు తెలుసుకున్నాను. ఆహారపానీయాల్లో ఏమాత్రం అశ్రద్ధచేయని వాడిని ఆకలిబాధ ఎంతదారుణమో గ్రహించాను...తలనొప్పి దరిద్రం తనదాకా వస్తేగాని తెలియవు. ఈ ఒక్క ఏడాదిలో దారిద్ర్యం అంటే ఏమిటో తెలుసుకున్నాను. దాని కోరల వాడికి గురిఅయాను; దాని కరాలవేడిమి గ్రహించాను. అది మనిషినెంత బలహీనుణ్ణిగా, అసమర్థుణ్ణిగా చేస్తుందో అనుభవంద్వారా తెలుసుకున్నాను. నీకేమో శావుగా! కుర్చీలోంచి లేచి లైటు వేసుకునే ఓపిక కూడా లేక...అలా చీకట్లోనే పడుకున్నాను. అది ఏమిటంటావ్?—బలహీనత కదూ? నీ చేతులు కాసిపోతుంటే, నీ మెడ వాపురుమంటుంటే—చూస్తూ ఊరుకుంటున్నాను. అదేమిటంటావ్?—అసమర్థత కదూ? ఈ ఘటం ఇలా దాటిపోవాలిసిందే. మంచిరోజులనేవి ఇక ఈ జన్మకు లేవు. నాకు మంచిరోజులు రాకపోయినా దిగులుపడను నేను. ఇంకెన్నాళ్ళో బ్రతకను నేను. కాని మీ విషయమే ఆలోచిస్తే...నాకు ఎక్కడలేనిదిగులు-ఎంతోగుబులూ.

రాధ : మీరలా అనకండి మామయ్యగారూ నాగుండె చెఱువై పోతున్నది.

రాము : సరే ఆపేద్దామమ్మా. ఆ విషయంగురించి మనం మాట్లాడుకోవద్దు. ఇవాళే కాదు-ఎన్నటికీ. ఎలా రాసిపెట్టిఉంటే అలాగవుతయ్ రోజులు. మనం తెలియక అనుకుంటాంగాని—మన మనుకున్నట్లుగా జరుగుతాయా ఏఁవయినా?—జరిగితే లేనిదేముంది? అప్పుడు ప్రపంచం ఇలా ఉండేదికాదు. ఆ విధి మళ్ళీ పగ్గాలతో పట్టి ఆపుతూ ఉండటంతో సరిపోయిందిగాని, లేకపోతే ప్రపంచం ఎలా ఉండేదో ఎవరు చెప్పగలరు? దాని విలువలే వేఱుగా ఉండేవి; దాని ఎల్లలే మారి ఉండేవి — అదంతా సరేగాని అబ్బాయేడీ?...ఆఫీసునుంచి ఇంకా రాలేదూ?

రాధ : ఎందుకు రాలేదు-వచ్చారు. వచ్చి కాఫీ త్రాగి అలా బజారుకు పోయారు. — రేపు పండుగ కదూ?

రాము : రేపు పండుగా?! ఏం పండుగ?

రాధ : రేపుగాది పండుగ కదండీ—మర్చిపోయారా?

రాము : అవును మర్చిపోయాను రాధా. అయినా గుర్తుంటే మటుకు ఏంలాభం? పండుగని చేసేం చేయగలను చెప్పు. క్రిందటిసంవత్సరం ఉగాదినాడు ఈ ఇల్లెంత కళకళలాడిందని!? ఇల్లంతా ఆనందమే! ఇంటిల్లిపాదికీ కొత్తబట్టలు. ఎక్కడచూసినా సంతోషమే—వరాలు రాలేవన్న ఒక్కవిచారం తప్ప మీ అత్తయ్యకు సంవత్సరాది పండుగంటే ఎంతో సరదా. పొద్దున్నే లేచి తలంటి పోసుకుని, కొత్తబట్టలు కట్టుకుని, వేపపూవు పచ్చడి తినందే ఊరుకునేది కాదనుకో—ఆ రోజులు పోయినయ్. తిరిగి రమ్మంటే రావి

రోజులవి. ఇక మన కుగాదుల్లేవు; ఉషస్సు ల్లేవు—ఆ కవిగా రెవరో అన్నట్లు.

రాధ: అదేమిటండి—అలా అంటారు? ఉన్నంత లోనే జరుపుకుందాం పండుగ.

రామ: పిచ్చిపిల్లా! ఉన్నంతలో జరుపుకోవటానికి అసలు కొంతైనా ఉంటేకదా! నీకు తెలియదేమో గాని శేఖరం చేతిలో ఎఱ్ఱని ఏగానీ అయినా లేదు. నీ పిచ్చగాని—ఇక మనకు గాదు లేమిటే? ఉషస్సులేమిటి? అవన్నీ ఉన్న వారికే. వాళ్ళకి దిన దినమూ ఉగాదే. క్షణ క్షణమూ ఉషస్సే.

రాధ: ఎంతచెట్టు కంత గాలన్నారు. మన తాహతుకు తగ్గట్టు మనం జరుపుకోవచ్చు.

రామ: ఎలా జరుపుకుంటాం చెప్పు. శేఖరం చేతిలో ఎఱ్ఱని ఏగానయినా లేదని చెబుతూంటానికదా!

రాధ: ఎవరో ఒకర్నడిగి ఓ పదిరూపాయలు అప్పు తెస్తామన్నారు.

రామ: అప్పా?! పది రూరూపాయలు-అప్పుగానా? ఎందుకు రాధా? ఇప్పటికి మన మెంత బాకీయో తెలుసునా నీకు? పాలవాడికి పది హేను రూపాయలు; పెలుకుమనిషికి పది రూపాయలు; కరువులో అధికమాస మన్నట్లు మొన్న నేను మంచాన పడ్డప్పుడు మందులకని మహేశ్వరందగ్గర అప్పు తెచ్చినవి ముప్ఫై రూపాయలు; డాక్టరు కియ్యాలిసిన ఫీజు పాతిక రూపాయలు. ఎంతయిందిప్పటికి?

రాధ: ఎనభైరూపాయలు.

రామ: ఆఁ. ఎంతా?—ఎనభైరూపాయలు కదూ?—ఇవన్నీ కాక క్రిందటినెల అద్దె పాతిక రూపాయలు—అన్నట్లు ఇవ్వాళ ఎన్నో తారీఖు?

రాధ: ముప్ఫైఒకటి.

రామ: ఇంకేం మరి? ఈ నెల అద్దెకూడా ఇచ్చుకోవాలి. రెండు నెలలదీ కలిపి యాభై రూపాయలు. అదొక ఎనభై—ఇదొక యాభై. వెరసి నూటముప్ఫై అన్నమాట. మనవాడి కొచ్చే జీతమెంత? బొటా బొటీగా నూరు రూపాయలు. ఈ నెలజీతం నూరు రూపాయలూ అప్పుకింద తీసేసినా ఇంకా ముప్ఫై రూపాయలదాకా బాకీ మిగులుతుంది—పైగా నెల రోజులు గడిస్తేగాని మళ్ళీ జీతంరాదు. ఇలాంటి పరిస్థితిలో పండుగకని ఇంకోపది అప్పు తెచ్చుకోవటం ఎందుకు రాధా?—ఎవరయినా జాలి దలిచి ఇచ్చినా...

రాధ: అదేమిటండి? అప్పులున్నయ్—అని పండుగ చేసుకోవటం మానుకుంటామా? ఏడాదికి ఒక సారి వచ్చే పండుగ. అదీగాక ఆనాడు సంతోషంగా లేకపోతే ఏటికి ఏడాదీ అలాగే ఉంటామట.

(సుధాకర్ ప్రవేశిస్తాడు. కాలేజీ స్టూడెంటని అతని అలంకరణ — సినిమామాటు — మాట తీరు చెప్తాయి.)

సుధా: నువ్వనేది నూటికి నూరుపాళ్లు నిజం.

రాధ: ఏమిరా సుధాకర్! కులాసానా?—ఈ మధ్య అసలిటు రావటమే మానేశావ్?

సుధా: ఒక్కటే కురుపెటకో అక్కయ్యా! నేను బాగలేకపోతే నీకు కబురుచేస్తాను; లేకపోతే బండి కట్టించుకుని మీ యింట్లో దిగుతాను. రాలేదూ, కబురులేదూ—అంటే ముప్పూటలా కాఫీ త్రాగుతూ, రెండుపూటలూ సుష్టుగా భోంచేస్తూ, రోజుకు ఎంతలేదన్నా పదిగంటలు నిద్రపోతున్నట్లేననుకో—కాసిని మంచినీళ్ళిస్తావ్?

రాధ: ఏమిటో సుధాకర్? ఎప్పుడు వచ్చినా నువ్వడిగేదాకా మంచినీళ్ళియ్యాలన్న మాట జ్ఞప్తికి రాదు.

సుధా: (భావగర్భితంగా నవ్వి) జ్ఞప్తికి రాకపోవటం కాదులే అక్కయ్యా!—నాకు తెలుసును... మంచినీళ్ళియటం మర్యాద తక్కువని నీ ఉద్దేశం.

రామ: అదికాదులేవోయ్. కుర్రవాళ్లు కదూ మీరు. కాఫీహోటళ్ళన్నీ మీవే! కూల్ డ్రింక్సు ఎన్నో మీకు! ఇక మా ఇంట్లో పచ్చిమంచినీళ్లు ఎందుకు తాగుతావని రాధ ఉద్దేశం.

సుధా: యూ ఆర్ ఘోరలీ మిస్టేకన్—అలా అన్నందుకు క్షమించండి. అక్కయ్య ఉద్దేశం అదేనని ఒప్పుకోమనండి చూద్దాం.

రాధ: (మౌనం)

సుధా: ఈ తిమ్ముడిమనకు అక్కయ్యకుమాత్రం తెలియదూ? అక్కయ్య ఆప్యాయంగా ఇచ్చిన మంచినీళ్ళు—మీ మాటల్లో చెప్పాలంటే పచ్చి మంచినీళ్ళు—పంచభక్ష్య పరమాన్నాలని మించుతాయ్; అమృతసమంగా ఉంటయ్. అందుకనే చూడండి!—ఎప్పుడు మీ ఇంటికి వచ్చినా అడిగి మరీ తాగిపోతాను మంచినీళ్ళు.

(రాధ తృప్తిగా నవ్వుకుంటూ వంటగదిలోకి వెళుతుంది.)

రామ: (మెల్లగా, స్వగతంగా) అందరూ అలా అనుకుంటే యీ బ్రతికి చెడినవానికి ఏ దిగులూ ఉండదు.

సుధా: ఆఁ! ఏమిటి? ఏదో అంటున్నారే?

రామ: (తొట్రుపడుతూ) అహాఁ! ఏంలేదు.

సుధా: మా అక్కయ్య అనేమాట నాటికి నూరుపాళ్లు నిజమని నా ఉద్దేశం. మీరేమంటారు?

రామ: ఏ విషయం నువ్వనేది?

సుధా: అనేమంటే — నేను వచ్చేముందు అనటంలేదూ — సంవత్సరాదినాడు సంతోషంగా లేకపోతే... ఏటికి ఏడాదీ అలాగే ఉంటామూ, అని. ఈ విషయం నాకు అనుభవంలోకి రాక పోయినా — విశ్వసిస్తాను.

రామ: ఏమోనబ్బాయ్! నాకుమాత్రం నమ్మకం లేదు. క్రిందటి సంవత్సరం పండుగనాడు ఇంటినిండా సంతోషమే. పండుగ వెళ్ళిన నెలరోజులకల్లా వ్యాపారంలో దెబ్బతిన్నాం. అప్పటి నుంచీ కష్టాలూ, కన్నీరూ. దీనికేమంటావ్ — మరి?

సుధా: కారణం చెప్పలేను కాని — నాకుమాత్రం గుడ్డి నమ్మకం ఉందండి.

రామ: ప్రతిసత్యం అనుభవంలోకి వస్తేనే గాని నమ్మకూడదని నే నన్ను. కొన్ని సత్యాలు ఇతరుల జీవితాలనుండి, అనుభవాలనుండి, తెలుసుకోవాలి. కాని నీ అనుభవం అబద్ధమని చెప్పే విషయాన్ని నువ్వు నమ్ముతున్నావంటే — అది మూఢ నమ్మకమే అవుతుంది. నాకు మరీ ఆశ్చర్యంగా ఉంటుందోయ్ — ఈ రోజుల్లో నీవంటి కాలేజీ స్టూడెంట్స్‌నే పట్టుకు కూర్చుంటున్నయ్ మూఢ నమ్మకాలు.

సుధా: దెయ్యాల్లా పట్టుకుంటున్నాయ్ అంటారు — అంతేనా?

రామ: అదిగో చూశావా? ఉపమానంలో కూడా దెయ్యం - నువ్వు చూడనిది - వచ్చింది

సుధా: ఏదో నోటికి వచ్చింది అన్నాను. అంతేగాని. ,

రామ: నువ్వనటం తప్పనటంలేదోయ్ నేను. మీ ఆలోచనలు ఏ పరిధుల్లో తిరుగాడుతున్నాయో — మీ మాటలు తెలుపుతున్నయ్ అంటున్నాను. దెయ్యంలా అని అనకపోతే అప్పులవాళ్ళలా పట్టుకున్నయ్ అనకూడదూ. అతి నవీనంగా కాలానుగుణంగా ఉంటుంది ఉపమానం.

సుధా: ఇఫ్ యు డోంట్ మైండ్ — ఒకమాట చెప్తాను.

రామ: (మాట్లాడకు. ఏమిటి? - అన్నట్లు సుధాకర్ మొహంలోకి చూస్తుంటాడు.)

సుధా: మీ ఉపమానం మీ ఆలోచనలను వ్యక్తం చేయటం లేదూ?

రామ: (మొహం జేవురిస్తుంది. ఉవ్వెత్తున తరంగిత మయిన ఉద్రేకం అణచుకో ప్రయత్నిస్తా పచార్లు చేస్తుంటాడు).

రాధ: (ప్రవేశిస్తూ) ఇదిగో మంచినీళ్ళు. బిందెలో పలకలం చేసి బావిలో తోడుకు రావాలిసి వచ్చింది. ఆలస్యమయినట్లుంది.

(సుధాకర్ మంచినీళ్ళు తాగి రాధకిస్తాడు గ్లాసు)

సుధా: నువ్వేమయినా అనుకో గానీ అక్కయ్యా! రోజూ సాయంత్రం మీ ఇంటికి వచ్చి, నీ చేతి మీదుగా ఇచ్చే మంచినీళ్ళు గ్లాసెడు తాగాలని అనుకుంటూ ఉంటాను.

రాధ: నీది మరీ విచిత్రం. పెరట్లో బావినీళ్ళుగాని ఐస్ వాటరయినా కాదు.

సుధా: అదే నాకూ అర్థం కాదు — అమృతసమంగా ఉంటాయనుకో. ఆ మాధుర్యం ఎక్కడినుంచి వస్తుందో గాని ఈ నెల రోజులనుంచి లోలేక పోయానే... అని తపించిపోయానంటే నమ్ము.

రామ: ఏం — ఎందుకని రాలేకపోయావు? అంత తీరని పనేమి వచ్చి పడ్డది?... కాలేజి ఎలక్షనులా ఏమిటి?

(రామనాథం — నిజమాడితే నిష్ఠూరం అనుకోటం — ఎందుకని తలచాడో ఏమో — ఆవేశం అణచుకుని వారిద్దరి మాటలూ వింటుంటాడు)

సుధా: ఎలక్షను గొడవయితే ఎలాగోలా తీరికచేసుకుని వచ్చేవాడినే. అవన్నీ జూలై, ఆగస్టులలోనే అయిపోయాయి. ఆ ప్రమాదాలకూ, అపనిందలకూ భయపడని ఆడదయినా కట్టుకున్న మొగుడంటే దడుసుకుంటుంది.

(రామనాథం సన్నగా నవ్వుతాడు)

రాధ: నువ్వనేది నాకర్థం కావటం లేదు. నేను అడిగిందేమిటి? — నువ్వు చెప్పేదేమిటి?

సుధా: నువ్వడిగిందే నే చెప్తున్నది. మామయ్యగారి కర్థమయింది గాని — ఉపమానం మళ్ళీ పాత చింతకాయపచ్చడి లాగా పురాతనకాలానికి సంబంధించిందే — అని నవ్వుతున్నట్టున్నారు.

రామ: (నవ్వు ఆపుకుంటూ) ఈరోజుల్లో భర్తను చూసి భయపడే భార్య ఉందనా నీ ఉద్దేశం?

సుధా: నా ఊహ నిజమే అయిందన్నమాట. తమరిం చాలి అనుభవజ్ఞులు. కేవలం బ్రహ్మచారి నేను. అలాంటి విషయజ్ఞానం శూన్యం. ఏదో కుతూహలం కొద్దీ చెప్పదలచుకున్నది సూటిగా చెప్పకుండా సామ్యం చూపించి 'అసలు విషయం అర్థం చేసుకోండి' అందామనుకున్నాను.

రామ: నీ కుతూహలం సంతోషించదగ్గదే కాని కొన్ని సత్యాలు కాలాన్ని బట్టి మారిపోతుంటయ్ — అన్నది జ్ఞప్తిలో ఉంచుకోవాలి. ఆ మార్పులు నేను ఒప్పుకోమా, నాకు తెలియవూ — అంటే

తెలిసి తప్పుకవాడిక్రింద జమకడుతుంది జగం; ఛాందసునిగా పరిగణిస్తారు లోకులు.

రాధ: ఇంతకీ మీరనేది—ఈరోజుల్లో ఆడదానికి భర్తంటే భయం లేదనా?

రామ: ఎక్కడో నూటికి కోటికి ఒక మనిషి భయపడ వచ్చు భర్తను చూసి నువ్వన్నావనుకో...

రాధ: నా విషయం ఎందుకులెండి?

సుధా: అదేమిటి అక్కయ్యా! నువ్వు మరీ ఇంత టిపికల్ గా ఉంటావేం? నీ విషయం నీముందు చెప్తుంటే వినాలని ఉండదూ నీకు?

రామ: ఎందుకుండదోయ్ ఎవరికయినా? మంచిగానీ చెడుగానీ తనని గురించి ఎవరయినా చెప్తున్నారూ అంటే చెవులు నిక్కపొడుచుకుని వినదూ! మీ అక్కయ్య మినహాయింపేమీ కాదు. మానవసహజమది—

రాధ: సరే చెప్పండి. కాదన్నానా?

రామ: చూశావా సుధాకర్?

రాధ: సరే. ఇది మరీబాగుంది. మీ ఇద్దరూ చెప్పుకోండి — నేను పోతాను.

సుధా: నో...నో. నువ్వుండాలి అక్కయ్యా! స్త్రీ పాత్ర లేకపోతే నాటకం రక్తికట్టుందా? నువ్వు లేకపోతే మా ఇద్దరి సంభాషణ—లైఫ్‌లెస్, అంటే నిర్జీవంగా ఉంటుందూ?

రాధ: అయితే నన్నొక పాత్రకింద కట్టావన్నమాట!

సుధా: నో...నో. ఉపమానం చెప్పాను. అంతే! నిన్ను మాత్రం — లైఫ్ ... ప్రాణంగా చెప్పాను. అన్నట్లు ఈ నా ఉపమానం అతి సజీవంగా పడ్డట్టుందే - ఏం మామయ్యగారూ!

రామ: ఉపమానం బాగా నే ఉంది కాని విమర్శవచ్చేసరికి సమర్థించుకోలేకపోయావు. రాధ నాటకంలో పాత్రే. ఒక్క రాధే కాదు—నువ్వూ, నేనూ, అందరమూ ఈ జగన్నాటకంలో పాత్రధారులమే.

సుధా: అంతేనంటారా?

రామ: ముమ్మాటికీ అంతే! లోతుగా ఆలోచిస్తే మనమంతా మట్టిబొమ్మలం...విధి చేతిలో కీలుబొమ్మలం. మన చేతిలో ఏంలేదు; మనం చేయ కలిగిందేమీ లేదు. కేవలం అబలలం...నిర్జీవులం. పురుషుడూ, ప్రాణంకలవాడూ — మాత్రం ఒక్కడే; ఈ పాత్రలను రూపొందించి, నాటకం ఆడిస్తున్నవాడు.

సుధా: లోతులు శోధించి నా ఉపమానం సమూలంగా నాశనం చేశారే!

రాధ: ఇంతకీ అసలు విషయం చెప్పటంలేదు—మీరిద్దరూ!

రామ: దానికే వస్తున్నాను — నువ్వన్నావనుకో. భర్తను చూస్తే నీకు భయంలేదు; గౌరవం ఉంది. మా తమ్ముడికూతురు సంధ్యవిషయం తీసుకుంటే —అది మొగుణ్ణి అసలేమాత్రం 'కేర్' చెయ్యదు ...చాలా చులకనగా చూస్తుంది. వాడి మాటకు విలువీయదు; వాణ్ణి గౌరవించదు. రాధా, సంధ్యా —ఈనాడు స్త్రీ లోకంలోని రెండు తరగతుల ప్రతినిధులు. వినయ విధేయతలున్నవాళ్ళు భర్తను గౌరవిస్తున్నారు...కొంచెం తెలివి ఉన్నవాళ్ళు భర్తను అగౌరవిస్తున్నారు. అంతేగాని భర్తనుచూసి భయపడేవాళ్ళు ఈ రోజుల్లో లేరు. ఉంటే చాలా తక్కువ—లెక్కలోకి తీసుకురాదగని సంఖ్య.

రాధ: సుధాకర్ అనేది ఇంతకీ ఏమిటి?

సుధా: ఆడది భర్తకు భయపడేట్లుగా, విద్యార్థులు పరీక్ష అంటే దడుస్తారు—అని చెప్పబోయాను. కాని మామయ్యగారు ఆడదానికి ఈరోజుల్లో మొగుడంటే భయంలేదంటున్నారు. విద్యార్థుల్లో మాత్రం పరీక్షను గౌరవించే తరగతి, అగౌరవించే తరగతి—అంటూ రెండు తరగతులు లేవు. పరీక్ష అంటే భయపడేవాళ్ళు, భయపడని వాళ్ళు ఉన్నారు. నేను మొదటి తెగకు చెందుతాను, పరీక్ష పేరు వింటేచాలు—నీళ్ళు రుచించవు; అన్నం సయించదు; నిద్రపట్టదు.

రాధ: అయితే ఈ నెలరోజులనుంచి నిద్రాహారాలు మాని పుస్తకాలతో కుస్తీ పడుతున్నమాట. బాగా వ్రాశావా?

సుధా: బాగానే వ్రాశానులే. ఇంకా ఒక పరీక్ష ఉంది—ఎల్లుండి. రేపు ఉగాదిపండుగాయెను నువ్వు పిలవకపోయినా పొద్దున్నే వచ్చి వేపపూవు పచ్చడి తినిపోదలచాను.

రాధ: అంతేకన్నానా? నువ్వింకా పరీక్షలయి ఇంటికెళ్ళావేమో అనుకుంటున్నాను — ఈ నెల రోజులనుంచీ కనపడకపోతేను. నువ్వు వచ్చే ముందు రేపటి పండుగగురించే ఆలోచిస్తున్నాం.

సుధా: ఎక్కడయినా ఉండనీ — ఉగాదినాటికి ఇంటికి కేగాలిసిందే! అమ్మ ఊరుకోదు: తలంటిపోసి, వేపపూవు పచ్చడి తినిపిస్తేగాని అమ్మకు తృప్తిఉండదు. అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గరా—అన్నట్లు మా అమ్మవిషయం నీకు చెప్పటమేమిటిలే! కాని ఈ సంవత్సరం ఈ లెడీ ఎగ్జామ్ ఒకటితగలడి నన్ను ఇంటికి పోనీకుండా చేసింది.

రాధ: మా అత్తయ్య, మీ అమ్మ ఒకరకం మనుషులురా సుధాకర్!

రామ: అవును సుధాకర్! మా వరాలు, నువ్వూ — ఒకేరకం మన స్వత్వానికి చెందుతారు. పెళ్ళి అయి కాపరానికి పోయినా ఉగాదికి ఇంటికి వచ్చితీరాలిసిందే అది. అది రాకపోతే వాళ్ళమ్మ ఊరుకోదు; రాకుండా అది ఉండనూ లేదు. — ఆ అమ్మా కూతుళ్ళవంటివాళ్ళే మీ అమ్మా కొడుకులు. నాలుగేళ్ళనుంచి వరాలు ఎక్కడో దూరదేశంలో ఉంటున్నది. ఉగాదికి రాలేక పోతున్నది...... దానిమనసు ఎంతగా ఆరాట పడుతున్నదో? ఈ ఏడూ రాదు. ఆదరించే అమ్మ లేదు ...పండుగంటే ప్రాణసమానంగా చూసుకునే ఆ ప్రేమమూర్తి లేదు. ఇంకెందుకు వస్తుంది వరాలు? — ఒక వేళ రావటానికి వీలు పడినా...(క్షణం ఆగి) — ఒకవిధంగా చూస్తే దానికీ, మాకూ అది రాకుండా ఉండటమే మేలు.

రాధ: అదేమిటండీ; అలాగంటారు. వదినరాకుండా ఉండటం ఉభయులకూ మేలా?

రామ: అవును. ఉభయులకూ — ఒకవిధంగా కాదు, ఎన్నో విధాల — మేలు. ఈ పరిస్థితిలో వరాలు రావటమంటే — వద్దు, వద్దు. ఊహించు కుంటేనే భయమేస్తున్నది.

రాధ: అనవసరంగా మీరు గోరంతలు కొండంతలు చేసుకుని భయం పెంచుకుంటున్నారు. మన ఇంటికి వచ్చినవాళ్ళు, మనమీద ప్రేమ కొద్దీ వచ్చినవాళ్ళు-మనతో పాటే తింటారు. ఇక్కడ ప్రధానం ఏంతిన్నామని కాదు; ఎంతవరకు ఒకర్నొకరు ప్రేమించుకుంటున్నారనేది.

సుధా: నా మనసులోనిమాట చాలా ప్రస్ఫుటంగా చెప్పావు అక్కయ్యా! హాట్సాఫ్! మా అక్కయ్య చెప్పింది వాస్తవం మామయ్యగారూ! నేను రేపు మీ ఇంటికి వస్తానన్నానూ అంటే—పది స్వీట్లు, ఇరవై హాట్లు తినాలను కున్నానా? ప్రేమతో పలకరించి, ఆప్యాయంగా ఆదరిస్తారని; మనసిచ్చి మాటాడుతారని. హృదయమున్నవారెవరయినా కోరుకునేది పవిత్రప్రేమే గామరి? పెద్దవారు మీరు. అనుభవజ్ఞులు. మీకు నేను చెప్పదగవాడిని కాదనుకోండి (క్షణంఆగి, రాధతో) బావ కన్పించడేమిటే—అక్కయ్యా! ఆఫీసునుంచి ఇంకా రాలేదూ?

రాధ: ఆఫీసునుంచివచ్చి బజారుకుపోయారు. రేపు పండుగకు సామానులు తీసుకురావద్దూ?

సుధా: నేను వచ్చేముందే వెళ్ళారా—ఏమిటి? ఇంత వరకు అతీ, గతీ లేదు.

రాధ: చాలాసేపయిందే వెళ్ళి!

సుధా: ఏదీ? మరి— నేను పోవాలే.

రాధ: ఎవరి దగ్గరయినా అప్పు తీసుకుని, సామాను కొనుక్కు రావాలన్నారు. బహుశా అందు కాలస్యమయి ఉంటుంది

(రామనాథం ఒక్కసారి రాధవంక తీవ్రంగా చూస్తాడు—ఆమె ఆ మాట చెప్పటం తప్పు అన్నట్లు. మామగారి భావం అర్థం చేసుకున్న రాధ తనతప్పును సమర్థించుకో ప్రయత్నిస్తుంది)

రాధ: అహా! అదికాదు సుధాకర్. ఎవరో మీ బావకు బాకీ ఉన్నారట. ఆ బాకీ వసూలు చేసుకుని సరుకులు తేవాలన్నారు.

సుధా: అక్కయ్యా! ఎందుకు నా దగ్గర దాస్తావ్? ఇవ్వాళ తారీఖు నాకు బాగా జ్ఞాపకం ఉంది. ముఖ్యంగా ఒక్కటి. జీవిత ప్రథమాంకంలో ఉన్నా సంసారంలోని కష్టసుఖాలు కొంతవరకు తెల్సుకునే హృదయం ఉంది నాకు. ఇఫ్ యు డోంట్ మైండ్—రూమ్‌కిపోయి ఒక ఇరవై రూపాయలు పంపిస్తాను...

రాధ: వద్దు. వద్దు—సుధాకర్. మీ బావ ఎలాగోలా అప్పు పుట్టిస్తారు.

(రామనాథం వంక చూస్తుంది) ఫర్వాలేదు.

రామ: అక్కర్లేదు సుధాకర్! మా వాడికి బాకీ పెట్టే స్నేహితులు చాలా మంది ఉన్నారు. ఆం దిగు లేదు.

సుధా: అందరికీ నెలాఖరే గదా! అందరి ఇళ్ళలో పండుగ ఖర్చు ఉంటుంది. అప్పు పుట్టక పోవచ్చు. వినవది చూడండి! ఎప్పుడూ నా జేబులో ఎంత లేదన్నా పది పాతికా ఉంటూనే ఉంటాయి. కాని ఇవ్వాళ స్నేహితుడొకడు తొందర పెట్టటంతో జేబులో ఉన్న అయిదు రూపాయలతోనే వచ్చేశాను. బజారులో ఫ్రెండు కన్పించి—పరీక్షలుబాగా వ్రాశావు, పార్టీ చేయాలిసిందేనని పట్టుపట్టి ఐస్ పార్లరుకు తీసుకుపోయారు. నాలుగురూపాయలు ఖర్చయి ఒక రూపాయి మిగిలింది. రూమ్‌కి పోయి ఒక ఇరవై రూపాయలు పంపిస్తాను—తీసుకోండి... ఊరికే వద్దు, అప్పుగానే తీసుకోండి—

రామ: వద్దు సుధాకర్! అయినవాళ్ళదగ్గర అప్పుతీసుకునేటంత అవమానమయిన పని మరొకటి ఉండదు—ఇలా అన్నావని మరోలా భావించకు. స్వానుభవంమీద చెప్తున్న కఠోరసత్య

మిది. ఈ ఏడాదిలో—వ్యాపారంలో దెబ్బ తిన్న ఈ సంవత్సరం ఇలాంటి కొత్త సత్యాలు చాలా తెలుసుకున్నాను; ఇదివరలో తెలిసినవి అనుభవంలోకి తెచ్చుకున్నాను.

రాధ : అవును సుధాకర్! నువు డబ్బు పంపించవద్దు. మీ నాన్నగారికి తెలిస్తే బాగుండదు. ఎన్నో విధాల అనుకుంటారు. నీకు తెలియదు—చిన్నవాడివి.

సుధా: కాదు అక్కయ్యా! నాన్నగారికి ఎలా తెలుస్తుంది చెప్పు?

రాధ : నీకు తెలియదు. ఇలాంటి విషయాలు ఒకరు చెప్పనవసరం లేదు. వాటంతటవే తెలుస్తాయ్.

సుధా: మా నాన్న మనస్తత్వం జీర్ణింపచేసుకున్నావు గాని—'అవసర సమయంలో అక్కయ్య నా సహాయం తీసుకోవటం లేదే—'అని నేను భరించే బాధ అర్థం చేసుకోలేక పోతున్నావు.

రాధ : నిన్నర్థం చేసుకోలేదనుకోకు-సుధాకర్! పరిస్థితులటువంటివి. ఏం చేస్తాం... చెప్పు?
(వీధిద్వారం దగ్గర పోస్ట్ సార్! అన్న కేక వినిపిస్తుంది. రామనాథం వెలుపలికిపోయి ఉత్తరం తీసుకుని హాలులోకి వస్తాడు)

రాము : చూడు సుధాకర్—ఇదేమిటో! జోడు లేకపోతే రాత్రిళ్లు అక్షరాలు కనపడవు.

సుధా : (చదివి) మీ అమ్మాయి -వరలక్ష్మి— వస్తున్నదండి.

రాము : (సంభ్రమాశ్చర్యాలతో) మా వరాలా? వస్తున్నదా?—ఎప్పుడు సుధాకర్??

రాధ : ఎప్పుడు వస్తున్నది? అందులో ఆ విషయం లేదూ?

సుధా: ఎందుకు లేదూ? ఉంది. ఇవ్వాళ మెయిలుకి.

రాము : ఇవ్వాళ మెయిలుకే! నేను చెప్పలేదూ! దాని మనసూ, నీ మనసూ ఒకటే సుధాకర్! ఏ మాత్రం వీలు చిక్కినా ఉగాదిపండుగకు రెక్కలు కట్టుకొని ఇంట్లో వాలుతుంది అయితే- మెయిల్ ఎన్నింటికి వచ్చేది?

సుధా : ఏడున్నరకనుకుంటాను.

రాధ : ఇప్పుడెంతయింది?

సుధా : (వాచీ చూసుకుని) ఏడుగంటలయింది సరిగ్గా

రాము : ఇంకా అరంగంటేవున్నమాట వ్యవధి ఉంది. ఇంకో అరగంటలో నా వరాల్ని ... నా వరాల తల్లిని చూస్తాను. రాధా! వరాల్ని చూసి ఎన్నేళ్లయిందో తెలుసునా?

రాధ : నేను కాపురానికిరాని ముందు కదూ?

రాము : నువు కాపురానికి రాని ముందేమిటి? నీ పెళ్ళికి వచ్చింది. అప్పుడయినా ఎన్నోరోజులు లేదు. మూడు నిద్రలవగానే వెళ్ళిపోయింది. అంతే; మళ్ళీ రాలేదు. అదేమి ఉద్యోగమో కాని దాని భర్తకు—ఒక్క రోజు కూడా సెలవు దొరకటం లేదుట. అయిదేళ్ళయిందన్న మాట—దాన్ని చూసి! అప్పటికీ మనకీ దారిద్ర్యం లేదు. కావలసినంత ధనం... కొట్టనిండా ధాన్యం. వ్యాపారముంది చూశావ్! తీసి కళ్ళిందా శిఖరాగ్రాలకి తీసికెళ్తుంది; లేదా అందని అగాధాల్లోకి తోసేస్తుంది. పట్టుకుంది బంగారమయిందా అవుతుంది; లేదూ ఎందుకూ పనికిరాని బూడిదయి పోతుంది. (బరువుగా, బాధగా) ఎలా రాధా?—ఈ అందని అగాధాల్లోంచి నా వరాల తల్లిని చూడటం? ఈ మాసిపోయిన గుడ్డలూ, యీ పెరిగిన గడ్డమూ – చూసి నా వరాల హృదయం వేయి ప్రక్కలయి పోదూ? ఎలా రాధా? ఎలా? అప్పుల క్రింద ఇంత మేడా జమకట్టా...ఇందులో ఒక భాగంలో పాతిక రూపాయలిచ్చి అద్దె కుంటున్నామంటే—నా చిట్టితల్లి మనసు సంక్షుభితమయిపోదూ? భగవంతుడు ఎంతటి దారుణ పరిస్థితి కల్పించాడో చూశావా రాధా! ఏం నేరం చేశాడని ఈ దీనుడికి ఇంత కఠినశిక్ష విధించాడంటావు?

రాధ : (కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది)

రాము : అయ్యో! అదేమిటి రాధా! ఏడుస్తున్నావా? వంటపట్టించుకున్న ఆశావాదం ఒక్కసారి ఆవిరయిపోయిందేం? పిచ్చితల్లీ — విశ్వాసం, విశ్వాస-అంత బెంబేలుపడితే ఎలాగు? ఫర్వాలేదు. చేస్తున్నాను. ఏనుగు చచ్చినా విలువ తగ్గదు. నేను చితికిపోయినా, నా గౌరవ మర్యాదలు పతనం కాలేదు. అభిమానం వదులుకొని అడగాలేగాని పరపతి పుట్టకపోదు. నిమిషాలమీద మనకు కావలసినంత పైకం తెస్తాను. తెచ్చి వరాలు వచ్చే వేళకు ఇంట్లో వసంతం పండిస్తాను. పిచ్చిపిల్లా! భయపడకు (ధైర్యం పూర్తిగా పుంజుకుని) సుధాకర్! టైమెంత ఉందన్నావు?

సుధా : రైట్ టైముకయితే ఇంకో అరగంట ఉంది.
(రైలుగంట నేపథ్యంలో వినిపిస్తుంది)

రాము : అదిగో! మెయిల్ కేలావుంది—మొదటిగంట కొట్టారు. ఇక ఆలస్యం చేస్తే లాభం లేదు. అర గంటలో మెయిల్ వచ్చేస్తుంది. ఆ మెయిల్లో నా చిట్టితల్లి వస్తుంది....

సుధా : మామయ్య గారూ! ఒక్క మాట. మీరు మరోలా భావించక మీకెంతడబ్బు కావాలో చెప్పండి. అయిదు నిమిషాల్లో తెచ్చి పెడ్తాను.

రామ: సుధాకర్! ఇందాక ఒకసారి చెప్పాను. నీ దగ్గిర తీసుకోవటం సమంజసం కాదు. నన్ను బల వంతి పెట్టావంటే బాగా పెట్టినట్టే గాని నాకు సహాయం చేసినట్టు కాదు. నా తిప్పలు నన్ను పడనీయి. రాధా! ఏదీ ఆ ఉత్తరీయమూ, చేతి కర్రా—ఇటియ్.

రాధ: అవెందుకు?

రామ: ఏం చేస్తాను మరి? నా వరాలకోసం...నా ప్రాణంకోసం...అభిమానం చంపుకుంటాను... అవును! అభిమానం చంపుకుని ఆ సుబ్బయ్య శెట్టిని బతిమిలాడి—రేపు పండుగకు కావాల్సిన సామగ్రీ, మనకందరికీ కొత్త బట్టలూ... చినిగిపోయిన గుడ్డలతో మనల్ని వరాలు చూడకూడదు. మనం చితికిపోయినట్లు తెలియకూడదు దానికి. వరాలకి వంకపండు రంగంటే ఎక్కడ లేని మక్కువ! మంచిది ఖరీదైనది వంకపండు రంగు సిల్కు చీర ఒకటి తెస్తాను. త్వరగా ఇయ్ రాధా!—ఉత్తరీయమూ, వంకి కర్రా--

రాధ: చీకట్లో మీరేం పోతారండి? మీ అబ్బాయి గారిని రానీయండి—పంపిద్దురు గాని.

(రామశాస్త్రి చిలక కొయ్యకు తగిలించి ఉన్న వంకి కర్రా, ఉత్తరీయమూ తీసుకుంటాడు.)

రామ: అహహా...లాభం లేదు రాధా! వాడు ఎప్పుడు వస్తాడో ఏమో. ఈలోగా వరాలు రాదూ! వచ్చి మన ఈ పరిస్థితి చూసిందంటే కంట తడి పెడుతుంది. దాని కంట తడి నేను చూడలేను. నా గుండెలు పగిలిపోతాయ్.

రాధ: చీకట్లో మీరొక్కరే ఎలా పోతారండి? సుధాకర్! కొంచెం సహాయం పోగలవా?

సుధా: తోడు పోతానులే. దానికేముంది? ఆర్థిక సహాయం చేయటానికి కూడా సంసిద్ధుడ వచ్చాను. కాని ఆయన ఒప్పుకోవటం లేదు.

రామ: నువ్వు నావెంట రావద్దు సుధాకర్. రూమ్‌కి పోయి హాయిగా చదువుకో—ఎల్లుండి పరీక్ష కూడా ఉందాయెను. కాని రేపు మాత్రం మర్చిపోకుండా రా. పొద్దున్నే వచ్చెసెయ్-ఇక్కడే తలంటి పోసుకుందువుగాని, పండుగ చేసుకుందువుగాని.

రాధ: అదేమిటండి. రానీయండి వాణ్ణి. తోడు ఉంటాడు. పరీక్ష రేపు కాదు, ఎల్లుండిగా. ఫర్వాలేదులే. వాడు చదివేదంతా మించుకుపోయే దేమీ లేదు.

సుధా: పదండి వస్తాను

(రామశాస్త్రి, సుధాకర్ వీధి ద్వారముదాకా పోయేసరికి శంకరయ్య ఎదురవుతాడు. యాభై సంవత్సరాల వయస్సు. పల్లని నిండైన విగ్రహం. గ్లాస్కో ధోవతి, సిల్కు లాల్చీ, జరీ ఉత్తరీయం—ఉన్న వాడని తెల్పుతుంటాయ్. మాటలు మాత్రం వ్యాపారి అని చెప్పక చెప్తయ్.)

శంక: ఓహోహో! రామశాస్త్రం గారు ఎక్కడికో బయల్దేరినట్టున్నారు?

రామ: ఓ! నువ్వా! అలా బజారుకు పోతున్నానోయ్ చిన్న పనుండి. ఏదో పనుండి వచ్చినట్టున్నావ్?

శం: చిత్తం...అద్దె ఇస్తారేమోనని వచ్చాను.

రామ: (బతిమిలాడుతున్నట్టుగా) ఇదిగో శంకరయ్యా ఇన్నాళ్ళనుంచి ఆగినవాడివెటూ ఆగావు. ఇంకో రెండురోజులు ఓపికపట్టు. క్రిందటి నెలదీ. ఈ నెలదీ—రెండు నెలలదీ ఇస్తాను ఎల్లుండి సాయంత్రానికి. ఈ రెండు రోజులు నన్నల్లరి పెట్టకు. ఇప్పుడు మెయిల్‌కు మా అమ్మాయి వరాలు వస్తున్నది.

శం: బాబ్బాబు—అలా అంటే ఎలా? చచ్చి పోతాను. ఇవ్వాళ మీరు ఇచ్చి తీరక పోతే లాభం లేదు. రేపు పండుగకూడా నాయెను. మా అమ్మాయికి చీరా, సారె తేవాలి. లేకపోతే నా ప్రాణాలు తీసేస్తుందది.

రామ: భలేవాడివేనోయ్—శంకరయ్యనువ్వు! మీ అమ్మాయికి చీరకొనటానికి నేనీయాల్సిన ముష్టి యాభై రూపాయలా ఆధారం నీకు?! ఎవరయినా వింటే నవ్వుదగ్గ మాటేనా ఇది?... పిల్లలుగలవాడివి. నీకు కష్టసుఖాలు తెలియక పోవు. మా అమ్మాయికి మేమిలా అప్పులపాలయి నట్టు తెలియకూడదు. తెలిస్తే అది ఎంతగానో దుఃఖిస్తుంది. మంచినీళ్ళుకూడా ముట్టదేమోనని నా భయం. ఇంకా నీ దగ్గిరకు వద్దామనుకుంటున్నాను.—ఈ రెండు రోజులూ ఈ మేడ నువ్వు అప్పుక్రిందకట్టుకున్నట్టు అనుకోకు. నా కింద ఉన్నట్టే భావించు. మేంకొక మీరు అడకున్నట్టు ప్రవర్తించినా పరువు మర్యాదలు నిలబెట్టు.

శం: దానికేముంది?—అనుకోవటానికి అనుకుంటాను. పైకి అనమన్నా అంటాను. డబ్బు ఖర్చేమీ కాదుగా. నాకుమాత్రం కనీసం ఒక నెల అద్దె యినా పడేయండి.

రామ: ఎల్లుండి పడుతాను-అని చెపుతుంటేనిగా శంకరయ్యా!—ఇవి చేతులు కావు (దగ్గిరకుపోయి చేతులుపట్టుకుంటాడు) కాళ్ళనుకో—.

శం: బాబ్బాబు (చేతులు విడిపించుకుని, దూరంగా పోతూ) ఆగండి. మీరు పెద్దలు—అలా అనకండి—.

రామ: కాదు. నా వరాలమునను కష్టపెట్టకు. రాక

రాక అయిదేళ్ళకు వస్తున్నది. ఉన్న రెండు రోజులు సుఖంగా ఉండిపోనీయి. కూతురు అల్లుడు ముందు పరువు మర్యాదలుపుంట కల్పకు—చచ్చి నీ కడుపున పుడతాను."

సుధా: ఏమిటండి శంకరయ్యగారూ! అంత మొండి పట్టు పడతారు—వెనక అద్దె దగల. రెండు రోజుల్లో పంపుతామని ఆయన చెబుతున్నారుగదా! ఆ మాత్రం గ్రహించుకోలేరేం కష్టసుఖాలు?

శం: పిల్లాడికేం తెలుస్తుంది ఉండేలు దెబ్బ?—ఇంకా పాలుగయిపోయాయి, ఇచ్చి పుచ్చుకోవటాల లోకి దిగినతర్వాత లోతుపాతులు నీకే తెలుస్తాయ్.

సుధా: అంతలోతులు పరిశోధించాల్సిన విషయమేమీ కాదే ఇది? ఎ సింపుల్ మాటర్ ఆఫ్ ఎడ్జస్ట్‌మెంట్! పాటి మానవుని సాధకబాధకాలు...

శం: నా నెత్తిన వేసుకోమంటావా?

సుధా: అలా అనటంలేదు మహాశయా! నీ కష్టం గురించి నీవెలా ఆలోచించుకుంటావో ఇతర్ల విషయంలోగూడా అలా ప్రవర్తించమంటాను.

శం: సుద్దోచ్చి పిల్ల వెక్కిరించిందిట—అలా ఉంది నీ వ్యవహారం చూస్తోంటే. ఇలాంటి నీతులు చెప్పమంటే నేనూ శతకోటి చెప్పగలను

రాధ: సుధాకర్! నీకెందుకు? నువ్వూరుకో—

సుధా: ఆదరణలో పెట్టటానికి అసాధ్యమయిందేమీ చెప్పటంలేదే నేను?

శం: చెప్పేటంత తేలిక కాదు నాయనా చేయటం!

సుధా: రెండు రోజులాగితే మీ కొచ్చే కష్టమేమిటో చెప్పండి...చూద్దాం.

రాము: అవును శంకరయ్యా. ఎల్లుండి సాయంత్రానికి రెండు నెలల అద్దె ఇస్తానంటినిగా.

శం: లాభంలేదండి—ఇలా ఎన్నో సార్లు వాయిదాలు వేశారు.

సుధా: అవును - మరి చేతిలో పైకం లేనప్పుడు వాయిదా వేయక ఏంచేస్తారు?

శం: లేనివాళ్ళు లేనివాళ్ళలాగానే ఉండకూడదూ? పాతిక రూపాయలు పెట్టి ఈ మేడలో అద్దెకుండట మేమొచ్చె?

సుధా (కోపంగా) ఏమిటి అంటున్నావ్?

శం: మింగ మెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె ఎందుకంటాను! ఎవరి విషయాలు ఎవరికి తెలియవు?

సుధా: అవును - ఎవరివిషయాలు ఎవరికి తెలియవు? నీలాంటి లక్షాధికార్లను లక్షమందిని కొనేస్థితిలో పీక్కున్నప్పుడు—నువ్వెక్కడున్నావో నాకు తెలియదనుకున్నా వేమిటి?

శం: ఏయ్ అబ్బాయ్! జాగ్రత్తగా రానీయి మాటలు.
(రాధ రామనాథంవంక చూస్తుంది. రామనాథం మొహంలో అవమానం, ఆవేదన ప్రస్ఫుటంగా ద్యోతకమవుతుంటయ్.)

రాధ: సుధాకర్! ఆవిషయాలు నీకెందుకు?

సుధా: ఏమిటే అక్కయ్యా! మీరు అలుసీయటం వల్లనే వీడి నోరు ఇంత దూకుడుగా వుంది. ఈ నాడేదో - అదృష్టంబాగుండి, స్టార్ తిరిగి-నాలుగురాళ్ళు కూడబెట్టుకున్నాడు కదా - అని నోటికొచ్చినట్లు అంటాడా?

శం: అవన్ - ఊరుకుంటారా ఏమిటి? నా అద్దెబాకీ పారేయమను. అవతలకు పోతాను. మహా నువ్వు చెప్తున్నావ్. అంత తెగువదారివి, దమ్ము కలవాడివి అయితే ఆ యాభై రూపాయలు పారేయి పోతాను.

సుధా: మామయ్యగారు ఒప్పుకోరని చూస్తున్నాను గాని- లేకపోతే గడిచిపోయిన రెండు నెలల అద్దె కాదు, రాబోయే ఆరునెలలది కూడా నీ మొహాన పారేస్తాను. ఏమనుకున్నావో ఏమిటో!

రాము: (గట్టిగా) సుధాకర్!

శం: ఏమిటోయ్? మొహం, గిహం అంటున్నావ్. మర్యాదగా మాట్లాడటం నేర్చుకో.

సుధా: నువ్వు మర్యాదగా మాట్లాడేవు కనుకనా- నేను మాట్లాడలేదు అనటానికి.

శం: నువ్వెవరివని నేను నీతో మర్యాదగా మాట్లాడతాను. నీమాటల్ని చూసి నేను భోళా పడుతాననుకున్నావు కాబోలు. ఇలాంటి వాళ్లని చాలా మందిని చూశాను నేను. మా తాతలు నేతులుతాగారు,మా మూతులు వాసన చూడండి, అనేరకమిదంతా.

సుధా: రకంగికం అన్నావా?

శం: ఉన్నమాటంటే ఉలిక్కిపడతావేం? పొయ్యిలో పిల్లి లేచే తాహతుకూడా ఉండదు. బయటికి మటుకు పంచభక్ష్య పరమాన్నాలతో భోం చేసినట్లు నిండుగా కన్పిస్తారు. మీ విషయం ఎవరికి తెలియదోయ్?
(సుధాకర్ ఉద్రేకం ఉప్పొంగగా రామనాథం చేతిలోని కర్రలాక్కోపోతాడు. కాని రామనాథం ఆపుతాడు)

రాము: సుధాకర్! ఏమిటిది?

శం: ఏమిటి? కొడతావేమిటి నన్ను! ఎలాకొడతావో కొట్టమను చూద్దాం. నా విషయం తెలియదేమో అబ్బాయి గారికి.

రాధ: సుధాకర్! మా మర్యాద ఏమయినా ఉండదలుచుకుంటే కర్ర వదిలి పెట్టు.

(సుధాకర్ కర్ర వదలకుండానే వెనక్కి తిరిగి రాధ మొహంలోకి చూస్తాడు. తీక్షణమైన చూపుల ఆజ్ఞను ధిక్కరించలేక కర్ర వదిలిపెట్టి కోపంగా శంకరయ్యను, అసహాయంగా రాధా రామనాథములను మార్చిమార్చి చూస్తాడు)

రామ: అవును–సుధాకర్! మనం అతనికి బాకీ ఉన్నాం కాబట్టి ఎన్నయినా అంటాడు; పడక తప్పదు-మరి.

రాధ: ఇచ్చినవాడి కెప్పుడూ పుచ్చుకున్నవాడు లోకువే! ఆయన అద్దె అడుగకిచ్చేస్తే ఇంతంతేసి మాటలు మనం పడవలసి వచ్చేది కాదు.

రామ: శంకరయ్య! పిల్లవాడు అతను. వేడిరక్తం. ఉద్రేకంపాలు ఎక్కువ. మరోలా అనుకోకు.

(నేపథ్యంలో రైలుగంట రెండోసారి వినిపిస్తుంది)

అదిగో! మెయిల్‌కి రెండోగంట కూడా కొట్టారు. నన్ను బజారుకు పోనీయి శంకరయ్యా! బట్టలూ అవి కొని, ఇంటికి పంపించి, నేను స్టేషనుకు పోవాలి.

శం : కాదండి—రామనాథం గారూ! మీరు ఎప్పటి కప్పుడు వాయిదాలు వేస్తున్నారు. బజారుకు పోయి బట్టలు కొనే డబ్బుంచుకుని నాకు ఒక నెల అద్దెపారేయమంటే లేదంటారేమిటి?

రామ: బట్టలు కొనటానికి నాదగ్గర డబ్బుందను కున్నావా? లేదు సుబ్బయ్య సెట్టిని బతిమిలాడి అప్పుపెట్టి తెద్దామని బయల్దేరాను. అంతేగాని డబ్బుంచుకుని నీకీయటం లేదను కున్నావా?

(అసహాయంగా దిక్కులు చూస్తున్న సుధాకర్ ఒక్కసారి ఎవరో వెలుపలనుంచి పిలిచినట్లుగా వీధిద్వారం గుండా వెళ్ళిపోతాడు)

రాధ: సుధాకర్! వెళ్లిపోతున్నావా?

(ఆమెమాట వినిపించుకోడు)

శం : ఏమో ఎవరు చూశారు—మీరు దగ్గరుంచుకునే లేదంటున్నారో, లేకనే లేదంటున్నారో! నిజం తెలుసుకునే దివ్యశక్తులు నాదగ్గర లేవు.

రామ: అదేమిటోయ్! అలా మాట్లాడుతావ్! ఇంత చిన్న విషయంలో అబద్ధమాడవల్సిన అవసరమేమొచ్చింది నాకు! ఎంత చెడినా—మానవుడిని. ఇంతవరకు నైతిక విలువలు పోగొట్టుకోలేదు. నేచెప్పేది గ్రహించుకోలేవేం? ఇలాంటి విషయాలు తెలుసుకోవటానికి దివ్యశక్తులేమీ అవసరంలేదు. ఇంగిత జ్ఞానంచాలును. నేను నీడబ్బు ఎగేసి ఎక్కడికయినా పారిపోతానను కుంటున్నావా ఏమిటి?

శం : ఏమో! ఎవరు చూశారు? ఎగవేసినా ఎగవేయ వచ్చు. చెప్పేవి శ్రీరంగనీతులు ... దూరేవి ఏవో అన్నట్లు—నైతిక విలువలను గురించి మాట్లాడినంత మాత్రాన ఆచరణలో పెడతారని నమ్మకమేమిటి? మీ వాటం చూస్తే నాకు భయంగానే ఉంది.

రామ: (కోపంతో. పెదవులు కంపిస్తూండగా) ఆఁ! ఏమిటన్నావ్? వాటం చూస్తే భయంగా ఉందా? చిన్నా—పెద్దా, పరువు మర్యాదా లేకుండా నోటికెంత వస్తే అంతమాట్లాడుతావా?

శం : హుఁ! పరువు మర్యాదలా? నాదయా దాక్షిణ్యాల మీద ఆధారపడ్డ వాళ్ళకి పరువు మర్యాదలు కూడానా? సిగ్గులేదూ—ఏ మొహం పెట్టుకుని......

(రామనాథం ఆవేశంతో కర్ర ఎత్తుతాడు శంకరయ్య భయపడి అనబోతున్న మాట మింగుతూ వెనక్కి తిరుగుతాడు ఎత్తిన కర్రను రాధ పట్టుకుంటుంది వెనకనుంచి)

శం : (వెనక్కి తిరిగినవాడు ముందుకువస్తూ) ఏమిటండోయ్! కొడతారేమిటి? కొట్టండి ఎలా కొడ్తారో చూద్దాం.

రామ: నోటికొచ్చినట్లు వాగితే కొడతానా నెత్తురు కళ్ళ చూస్తానా......!

రాధ: మామయ్యగారూ! ఆగండి. ఎందుకంతకోపం తెచ్చుకుంటారు? ఆయనేదో పొరపాటున నోరు జారాడు. మీరు తొందరపడి మాట తూలారెందుకు?

నౌక: (పరుగెత్తుకుంటూ ప్రవేశించి) బాబుగారూ! మీకు ఫోను వచ్చిందండి.

శం : ఉండరా! కాసేపాగు.

నౌక: కాదండి. అరజంటుగా మాటాడాలటండి. తొందరగా రమ్మంటుండారండి—ఎవరో గాని.

శం : వస్తున్నా పద డిస్కనెక్టు చేయకు. రామనాథం గారూ, మీ రీపూట నాకు ఒక నెల అద్దెఅయినా ఇస్తే ఇచ్చినట్లు—లేదా మీ అమ్మాయి వచ్చే వేళకు అనవసరంగా అల్లరి పడాల్సి వస్తుంది.

(శంకరయ్య, నౌకరు వీధి ద్వారంగుండా నిష్క్రమిస్తారు. రామనాథం ఏంచేయాలో తోచక పచార్లు చేస్తుంటాడు.)

రాధ: (దగ్గఱకువచ్చి మెల్లగా) ఎలాగోలా డబ్బుపుట్టిస్తున్నారు కాబట్టి ఉన్నప్పుడే వసూలు చేయాలని శంకరయ్య ఉద్దేశం. అందుకే అంత మొండి పట్టు పట్టి కూర్చున్నాడు. పోనీ—ఒక నెలది సర్దుతాను—అని చెప్పండి. లేకపోతే వదినవచ్చే వేళకు అల్లరిచేస్తూ కూర్చుంటాడేమో.

రామ: అల్లుళ్లతో ఎలాంటిసంబంధం పెట్టుకోవాల
ఉంటారు అందుకనే. పరిస్థితులర్థం చేసుకునే
సంస్కారం శూన్యం వాళ్ళకు. నువ్వనేది
బాగానే కన్పిస్తున్నది. ఒక పాతికరూపాయలు
చెల్లుపెట్టాను.

శం: (ప్రవేశిస్తూ, విప్పారిన ముఖంతో) రామ
నాథంగారూ... అదృష్టవంతులు మీరు. అభినం
దిస్తున్నాను. (రామనాథమూ, రాధా—అర్థ
రహితంగా చూస్తుంటారు)
మీ అబ్బాయికి — శేఖరానికి — పజిల్సులో
ఫస్ట్ ప్రైజు వచ్చింది. లక్షరూపాయలు.

రామ: మా శేఖరానికా?.

రాధ: నిజంగా?.

శం: అబద్ధంచెప్తే నాకేంవస్తుంది? ఇపుడు ఫోనులో
చెప్పింది అదే.

రామ: ఎవరు చెప్పారు?

శం: ఏజంటు.

రాధ: మీకెందుకు చెప్పాడు?

శం: శేఖరం ఏజంటుకు మా ఫోను నెంబరు ఇచ్చి
ఉంటాడు.

రాధ: చూశారా! మామయ్యగారూ! నేనటంలేదూ
—మనకు మంచి రోజులు వస్తాయని.
మీ బాల్యస్నేహితులు అవధాన్లుగారు
చెప్పిన జోస్యం నిజమయిందికదూ!—ఇప్పటి
కయినా మీకు నమ్మకం కుదిరిందా?

రామ: ఇది నిజమేనా? కలకాదుగదా! నేను నమ్మ
లేకుండా ఉన్నాను.

శం: నిజమేనండి. నూటికి నూరుపాళ్ళు నిజం.

రాధ: అబద్ధం చెబితే ఆయనకు ఒరిగే ఒలోపడేదేముంది?

రామ: నీ గుడ్డినమ్మకం కళ్ళు తెరిచింది. నీ తపస్సు
ఫలించింది. ఒప్పుకుంటున్నానురాధా! మనకు
మంచిరోజులు వచ్చినయ్. పూర్వంలా భోగ
భాగ్యాలనుభవించలేకపోయినా కూటికీ, గుడ్డకూ
కరువుండదు మనకిక.

రాధ: ఏమో! పోయిన ఆస్తి అంతా తిరిగి సంపా
దించుకోగలమేమో! ఎవరు చూశారు?

శం: అవునండి. రాధమ్మ అనేది నిజమే! ఈమాత్ర
మయినా నిలదొక్కుకుంటామని మీ రను
కున్నారా? లేదు. అదృష్టం పట్టిందంటే అందల
మెక్కించే ఊరుకోదు; కావాలన్న ప్రదేశానికి
పోయిస్తుంది కూడాను. మంచి రోజు చూసి
వ్యాపారం మొదలుపెట్టండి. పట్టిందల్లా బంగార
మవుతుంది. కోటికి పడగలెత్తుతారు.

రామ: నాచిట్టితల్లి చలవే ఇదంతా! నా వరాలు నా
ఇంటికి వస్తున్నదని తెలిసి, దానికన్నా ముందు
గానే అదృష్టదేవత గృహప్రవేశం చేసింది.

శం: నాకు ఎప్పుడో తెలుసునండి — ఈవిషయం.
మీ అమ్మాయే కాదు — మీ అబ్బాయి, మీ
కోడలు, మీరు—అందరూ అదృష్టజాతకులే.
ఏజన్మలోనో పెట్టి పుట్టారు. మీ రూపురేఖలు
చూస్తేనే తెలుస్తుంది విషయం. ఏదో ఈ ఒక్క
సంవత్సరం శనిపట్టి పీడించింది. ఈ నాటితో
ఆ పీడ కాస్తా విరగడయిపోయింది—దశతిరిగింది.

రాధ: మెయిలుకు వేళ కావటంలా?

రామ: అవును. అవుతున్నది. శంకరయ్యా! నాతో రా
సుబ్బయ్యసెట్టిదగ్గిర తీసుకుని నీ అద్దె చెల్లపెడ
తాను.

శం: ఎంతమాట? మీదగ్గిర డబ్బెక్కడకు పోతుంది?
మీ ఇష్టం వచ్చినపుడు ఇద్దురుగాని. ఉంటే
ఇస్తారేమో అని అడిగానుగాని గంపెగతెర
ఏమొచ్చె? అప్పు తీసుకుని ఈయాల్సినంత
అవసరం లేదులెండి.

రామ: అయితే సరే! వస్తాను. పదినిమిషాలకన్నా
ఎక్కువలేదేమో వ్యవధి! సుబ్బయ్యసెట్టిదగ్గరకు
పోయి, స్టేషనుకుపోయే టైము లేనట్లుంది?

రాధ: టైమెంతయిందండి శంకరయ్యగారూ!

శం: ఏడు - ఇరవై అయిందనుకో—

రాధ: (కంగారుపడుతూ) ఆయన ఎక్కడెక్కడ
తిరుగుతున్నారో, ఏమిటో? ఇంతవరకు ఇంటికి
రాలేదు. కబురుచేస్తే బాగుండును. వదినవస్తున్న
విషయమూ ఎరుగరు; ప్రైజు వచ్చిన సంగతీ
తెలియదు—అవతల మెయిలు వేళ అవుతున్నది.

రామ: అవుతున్నదేమిటి? అయిందిగూడాను—మహా
ఉంటే పదినిమిషాలుంటుందేమో.

శం: రామనాథంగారూ! రాధమ్మా—మీరు కంగారు
పడకండి. నేను చెప్పినట్లు వినండి. అన్నీ సక్ర
మంగా జరుగుతాయ్. (వీధిద్వారం దగ్గరకుపోయి
వెలుపలకి చూస్తూ) ఒరేయ్ రంగడూ!
(నౌకరు ప్రవేశిస్తాడు)
రాధమ్మా! ఏమేమి కావలసింది వాడితో చెప్పు.
బజారుకుపోయి మా కొట్లో తెస్తాడు.

రాధ: చాలా కావాలే! వాడికి గుర్తుంటాయా?

రామ: అలా అనుకునేదానివి ఒక చీటీమీద వ్రాసియ్యి.
(రాధ లోపలికి పోతుంది.)

శం: ఒరేయ్ రంగడూ! ఇంట్లో డ్రైవరున్నాడురా?

నౌక: ఉండాడండి—అబ్బాయిగోరిని ఇంతకుముందు
గానే సినిమాహాలు కాడ దింపొచ్చాడు.

శం: మంచిది. రామనాథంగారు రైల్వేస్టేషనుకు
పోవాలిగాని—గ్యారేజిలోంచి కారు బయటికి
తీయమని చెప్పి, త్వరగా రా.

నాక : చిత్తం—(నిష్క్రమిస్తాడు.)

శం : ఏమండీ రామనాథంగారూ! అంతా తేలికయింది కదూ వ్యవహారం! మీతోపాటే నేను కూడా బజారుకు వస్తాను. సిటీ ఎంపోరియం దగ్గర దిగి—మీకు కావలసిన బట్టలేవో చెప్తే—తీసుకొని ఇంటికి పంపిస్తాను. మీరు అటునుంచి అటు మన కారుమీదే స్టేషనుకుపోయి అమ్మాయిని తీసుకువద్దురుగాని—ఏమంటారు?

రామ : (మొహంలో గూడుకట్టుకున్న ఆందోళన మాయంకాగా, కృతజ్ఞతాపూర్వకస్వరంతో) నీ సహాయం జన్మజన్మాలకు మరువలేనోయి శంకరయ్యా! దేముడులాగా కాపాడావు నన్ను. ఆ విషయంలోకూడా—ఏదీ, యీ మేడ నువ్వు అప్పులక్రింద కట్టుకున్నట్లు మా వరాలకు అలుసైనా తెలియకుండా చేశావంటే—నన్ను గట్టున పడేసినట్టే.

శం : అలా గేలంటేనిగా! నీకా అనుమానమెందుకు?

రామ : నీ ఋణం ఎలా తీర్చుకుంటానో?

నాక : (ప్రవేశిస్తూ) సెప్పాను బాబూ! కారు ఎలపలకి తీసి రెడీగా ఉంచాడు.

శం : మంచిది. ఏమమ్మా రాధమ్మా! చీటీ రాయటం ఇంకా కాలేదూ?

రాధ : (ప్రవేశిస్తూ) మా వరాలొదినకు చారులో ఇంగువ వేస్తేగాని తాగదు. వంకాయ కూరలో ఉల్లిపాయలు వేయకపోతే ముట్టుకోనే ముట్టుకోదని మా అత్తయ్య చెబుతూండేది. అన్నీ గుర్తుకు తెచ్చుకుని రాసేసరికి ఆలస్యమయింది.

శం : (రాధ చేతిలోంచి చీటీ తీసుకుని నాకయ్యకు ఇస్తూ) ఈ చీటీ చూపించి మన కొత్తకొట్లో సరుకులు పట్టించుకుని రాధమ్మగారికి అప్పచెప్పు. త్వరగా పోయిరా. దోవలో ఆటలాడుతూ కూర్చోకు. అర్జంటుపని ఇది.

నాక : చిత్తం.

శం : నడిచిపోకు-ఆలస్యమవుతుందేమో! సైకిల్ రిక్షా ఒకటి కట్టించుకో.

నాక : చిత్తం. (నిష్క్రమిస్తాడు)

శం : (వాచీ చూసుకొంటూ) రామనాథంగారూ! ఇక మనం పోదామా?

రామ : ఊఁ. ఎందుకు కాలవ్యయం చేయటం! (రాధతో) శంకరయ్యగారి కారులో పోతున్నామమ్మా రాధా! బజారులో దిగి కొన్ని బట్టలు తీసుకుని ఈయన ఇంటికి వస్తారు; నేనేమో అటు స్టేషనుకు పోయివస్తాను. జాగ్రత్త అబ్బాయి వస్తే స్టేషనుకు రావద్దను. ఎంతలో వస్తాం? ఒక అరగంట. వాడటు పోవటం, మేమిటు రావటం అవుతుందేమో! జాగ్రత్త...

(రామనాథం, శంకరయ్య వీధిద్వారం దగ్గరకు వెళ్ళేసరికి రైలు గంట మూడోసారి వినిపిస్తుంది. రైలుకూత వెంటనే పెద్దల హాహాకారాలూ, పిల్లల ఏడ్పులూ—ఒక్కసారి గగ్గోలుగా వినిపిస్తాయ్. వారిద్దరూ అక్కడే ఆగిపోయి ఒకరిమొహం ఒకరు చూసుకుని—ఇద్దరూ కలిసి రాధవంక చూస్తారు.)

రాధ : ఏమిటండీ?—ఆ ఏడ్పులూ, పెడబొబ్బలూ.

శం : మాసెబోతే మెయిలుకేదో ప్రమాదం సంభవించి వుంటుంది.

రామ : మెయిలుకు ప్రమాదమా?!
రాధ : అవా ఆహాహాకారాలు?! (ఒక్కసారి)

శం : అదే... నేను అనుకుంటున్నాను.

రామ : నా వరాలు... నా వరాలతల్లి... ఇందులో... ఈ మెయిల్లోకదూ వస్తున్నది... (కంఠం గద్గదమవుతుంది) వరాలూ!... వరాలూ!!... ఏమిటమ్మా ఇది?... ఈ ముసలివాడికి ఎందుకమ్మా ఈ శిక్ష?... వద్దుతల్లీ... నేనూ నీదగ్గరకే వస్తున్నాను...

రాధ : మామయ్యగారూ! మామయ్యగారూ! (భయంతో కంపిస్తుంది కంఠం)

శం : భయపడకమ్మా రాధమ్మా! ఏ విషయమూ కనుక్కుందాముగా రామనాథంగారూ! ఎందుకు ముందుగా కీడూహించుకుంటారు? అసలు రైలు పడటం ఎంతవరకు నిజమో?... ఒకవేళ పడినా అది మెయిలో, మరొకటో?... మెయిలు పడినా ప్రమాదం పెద్దది కాదేమో!... కనుక్కుందాముగా... మీ అమ్మాయికి ఎటువంటి ప్రమాదమూ లేదు. నేను చెబుతున్నానుగా... వినండి. అపశకునాల్ని చెప్పుకోటం దేనికీ కూడా తగదు.

రాధ : మీనోటి చలవవల్ల... (పమిట చెంగుతో కళ్ళు ఒత్తుకుంటూ) మా వదిన సురక్షితంగా ఇంటికి చేరితే రేపు వెంకటేశ్వరస్వామికి నాలుగు కొబ్బరికాయలు కొడ్తాను.

రామ : మీ పిచ్చిగాని... రైలు ప్రమాదం... అందులో మెయిలు ప్రమాదం... ఎంతో ఘోరంగా ఉంటుంది... ఎంతో దారుణంగా ఉంటుంది... రాక రాక చాలా ఏళ్ళకు వస్తున్నది చిట్టితల్లి—ఈ పిచ్చి తండ్రిని చూద్దామని... కాని భగవంతుడు—దయామయుడనే ఆ దేవుడు—నిర్దయగా... నా దిగులుకు నా తల్లిని... చేరనీయలేదు... వస్తున్నానమ్మా వరాలూ! నీ పిలుపు... విన్నానమ్మా... నేనే నీ దగ్గరకు... వస్తున్నాను... ఎవరు అడ్డుతారో చూస్తాను... భగవంతుడు కూడా ఆపలేడు... (వీధి ద్వారం గుండా పరుగుతీస్తాడు.)

శం : రామనాథం గారూ! రామనాథం గారూ!!

రాధ: మామయ్యా! మామయ్యా!!

శం : ఆగండి! ఆగండి!! (వీధి ద్వారం దగ్గరకుపోయి వెలుపలికి తొంగిచూసి) వెనుక చూపు లేకుండా పరుగు తీశాడమ్మా రాధమ్మా!

రాధ: (కంపిత స్వరంతో) నాకు భయంగా ఉందండి- ఏమవుతుందో ఏమిటో?

శం : నీకేం భయం లేదమ్మా! జాగ్రత్తగా ఉండు. నేనుపోయి అన్ని విషయాలూ కనుక్కు వస్తాను. మీ వదినకేలాంటి అపాయమూ ఉండదు. వస్తానమ్మా—జాగ్రత్త

(శంకరయ్య నిష్క్రమిస్తాడు. రాధకేం చెయ్యాలో తోచక కాలు గాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతుంటుంది. ఖాకీ పంచీతో శేఖరం ప్రవేశిస్తాడు. ముప్ఫై సంవత్సరాలవయస్సు. మాసిపోయిన గుబురు మొహంలో నిరాశా నిస్పృహాలు స్పష్టంగా గోచరిస్తుంటాయ్.)

రాధ: ఏమండీ! వచ్చారా?! వచ్చారా?!

శేఖ : ఏమిటి రాధా?—ఏమిటి జరిగింది?...అదేమిటలా వణికిపోతున్నావ్?

రాధ: వదిన మెయిల్లో వస్తున్నట్టు...ఇందాక ఉత్తరం వచ్చింది...మెయిలు పట్టాలు తప్పిందట...ఘోర ప్రమాదం సంభవించిందట.

శేఖ : (శాంతంగా, విచారంగా) అక్కయ్యా!

రాధ : మామయ్యగారు పిచ్చిగా పరుగులు తీశారు. వారి వెంట శంకరయ్యగారు పరుగెత్తారు......ఏమయిందో, ఏమిటో—నాకు భయంభయంగా ఉందండి.

శేఖ : నేనూ పోయొస్తాను. జాగ్రత్తగా ఉండు రాధా!

రాధ : నాకొక్క దానికే భయమండి నేనుకూడా వస్తాను. తీసికెళ్ళండి.

శేఖ : వద్దు రాధా! నీకు తెలియదు. రైలు ప్రమాద మంటే ఘోరంగా ఉంటుంది......ఆ బీభత్స దృశ్యాలు నువు చూడలేవు...

రాధ : అయినా వస్తాను. ఇక్కడసలు ఒంటరిగా ఉండలేను. నా హృదయఘోష నేను వినలేను...నా గుండెలు పగిలిపోతాయ్.

శేఖ : సరేపద. తలుపులెయ్.

(రాధ వంటగది ద్వారం మూసి వేస్తుంది. ఇద్దరూ వీధిద్వారం దిగబోయేసరికి — టెల్గ్రాం! సార్ అని వినిపిస్తుంది. శేఖరం టెల్గ్రాం తీసుకుంటాడు. అది చదువుకుంటుంటాడు.)

రాధ : (ఉత్కంఠతో) ఏమిటండి అది?

శేఖ : థాంక్ గాడ్! అక్కయ్య మెయిల్లో రావటం లేదుట.

రాధ : (గుండెమీది బరువు దించుకొన్నట్లు నిట్టూర్పు) అమ్మయ్య! బతికాము.

శేఖ : బావను సీనియరాఫీసరు దయ్యంలా గాపట్టి సెలవు గ్రాంటు చేయలేదుట.

రాధ : అతనెవరో గానీ దయ్యంలాగా పటలేదు. దేవుడులాగా రక్షించాడు. వెయ్యేళ్ళు వర్ధిల్లాడులెండి ఆ ఆఫీసరుగారెవరో గాని.

శేఖ : నిజం చెప్పావు...అన్నట్లు వీరిద్దరూ — నాన్నగారూ, శంకరయ్యా — ఏమయ్యారో? స్టేషనులో లబోదిబోమంటూ శవాలు వెతుకుతుంటారేమో! ఈ శుభవార్త చెప్పి తీసుకువస్తాను.

రాధ : శుభవార్తంటే గుర్తుకొచ్చిందండోయ్. మీకు చెప్పటం మర్చిపోయాను. మీరేదో పజిల్లో గెలిచారండి. ఫస్ట్ ప్రైజ్ వచ్చింది. లక్ష రూపాయలు.

శేఖ : (ఆశ్చర్యపోతూ) నాకు ప్రైజా? నేనసలు పజిల్ పంపించలేదే?!

రాధ : జ్ఞాపకం తెచ్చుకోండి మర్చిపోయి ఉంటారు. మీకు అసలే మతిమరుపెక్కువ.

శేఖ : అసలు అలాంటి అలవాటే లేకపోతే?

రాధ : అయితే మీ పేరు నెవరయినా కట్టి ఉండాలి.

శేఖ : ఒకవేళ అలా జరిగి ఉండవచ్చు. అదంతా తర్వాత ఆలోచిద్దాం. ముందు స్టేషనుకు పోయి రానీయి—(నిష్క్రమిస్తాడు.)

రాధ : (స్వగతంగా) ఈయన చెప్పేది నిజమేనా? పజిల్ పూర్తిచేసి పంపనే లేదంటారేమిటి?... అబద్ధం ఎందుకు చెపుతారు లే... ఎవరయినా ఈయన పేరుమీద కట్టి ఉండాలి. ఎవరయి ఉంటారు?...ఎవరయినా కానీయి. మొత్తానికి పంపించారు. అదృష్టం ఉండి బహుమానం వచ్చింది ఎలా పంచుకోవాలి? పేరు ఫలమీయనిది; శ్రమపడ్డదెవరు - ఎవరో. చెరిసగమూ అంటాడో, మొత్తం తనకే అంటాడో...అంటే మటుకు ఇచ్చేదెవరులే?...ఆ ఏజంటు ఈయన చేత సంతకం చేయించుకుని, ఆ సంచి యీయన చేతికే ఇవ్వాలిగదా? ... ఈయన వట్టి భోళా మనిషి...ఆ స్నేహితునికే ఇచ్చేస్తారేమో! నేను దగ్గర ఉండి జాగ్రత్త చేయాలి వ్యవహారం.

సుధా : (ప్రవేశిస్తూ) ఏమిటే అక్కయ్య విశేషం?— జాగ్రత్త చేయవలసిన వ్యవహారం ఏదో వచ్చిపడ్డట్టు ఉందే—

రాధ : రా! రా! నీకింకా తెలియదు కాబోలు. మీ బావ పజిల్ గెలుచుకున్నారు. ఫస్ట్ ప్రైజ్ లక్ష రూపాయలు.

సుధా : (ఆశ్చర్యంగా) ఈజిట్?!

రాధ : (వ్యంగ్యంగా, కోపంతో) అహా-అబద్ధం.

సుధా : అంత ఇంపేషన్స్ అయితే ఎలా చెప్పు— మైడియర్ సిస్టర్ !

రాధ : మరి నువ్వు నా మాట నమ్మవేం ?

సుధా : నమ్మదగ్గమాటగా లేకపోతే నేనేం చేసేది?

రాధ : అంటే నీ ఉద్దేశం— ఆ మాత్రం అదృష్టం మాకీ జన్మలో పట్టదనా ?

సుధా : పట్టదని కాదు ; అవకాశాలు లేవే-అని.

రాధ : అదృష్టం ఉంటే అవకాశాలు వాటంతటవే ఏర్పడుతాయ్.

సుధా : కాని ఆ అదృష్టం ఉన్న సూచనలూ కన్పించటంలేదు

రాధ : పోనీ, లేని సూచనలు కన్పిస్తున్నాయా ?

సుధా : ఆఁ! చాలా కన్పిస్తున్నాయ్.

రాధ : చెప్పు, చూద్దాం.

సుధా : లెక్క వేసుకో. ఒకటి— చేతిలో చిల్లి కానీ లేని సమయంలో మీ వదిన రావటం.

రాధ : మొదట్లో నేపప్పులో కాలు వేశావు. ఆమె రావటం లేదని ఇంతకు ముందుగా నే ఉత్తరం వచ్చింది.

సుధా : ఈజిట్ ?!

రాధ : అహఁ-అబద్ధం.

సుధా : అయితే పునాదులే కూలిపోయినప్పుడు, పైన కట్టిన అంతస్తు లేముంటాయిక ?

రాధ : నువ్వోడిపోయినట్లు ఒప్పుకున్నావా ?

సుధా : నా కారణాలు తప్పయి, నేను ఓడిపోయినా- మీ వదిన రావటమనేది పూర్తిగా అబద్ధం.

రాధ : కారణాలు చెప్పలేకపోతుంటేని. మరింకెందుకు నమ్మవు ?

సుధా : క్షమించాలి అక్కయ్యా! నిన్ను డిజప్పాయింట్ చేస్తున్నందుకు. ఆ ఫోను చేసిందెవరనుకున్నావ్ ?

రాధ : (క్షణంలో మొహం మాడిపోతుంది. పేలవంగా) నువ్వా ?

సుధా : అవును. నే నేను— అక్కయ్యా.

రాధ : (నిరాశగా) ఏజంటు కాదన్నమాట.

సుధా : కాదు. శంకరయ్య తరహా కనిపెట్టి సమయానికి అలా ఉపాయం పన్ని, ఆపదలోనుంచి తప్పించాను. తర్వాత డిజప్పాయింటయినా ఫర్వాలేదు అనుకుని.

శం : (ప్రవేశిస్తూ) నేను అప్పుడే అనుకున్నాను— వీళ్ళకు మంచిరోజులు రావటమేమిటని. అలా చెప్పు నువ్వు చేసిన నిర్వాకమేనా నాయనా ఇది?

(రాధా, సుధాకర్ తెల్లమొహం వేసుకుని శంకరయ్య వంక చూస్తారు.)

శేఖరం మొహానికి పజిల్ గెలుచుకునే తెలివితేటలు కూడానా! రాధమ్మ అదృష్టానికి యాభైవేల రూపాయలు రావటమా! రాధమ్మకూ, శేఖరానికీ రాలేదు మంచిరోజులు. ఆయనకు, రామనాథంగారికి మంచిరోజులు వచ్చినయ్. ఈ అప్పుల బాధనుంచి విముక్తుడయాడు. క్షణ క్షణం ఎదురవుతున్న కష్టాల కత్తులబారినుండి తప్పించుకుపోయాడు.

రాధ : ఏమిటండి— మీ రనేది ?

శం : ఏమీ లేదమ్మా. నిన్నూ, శేఖరాన్నీ— మీ కష్టాలు మీరు పడండి—అని మీ మామగారు మరణించారు.

రాధ : (భయకంపిత కంఠంతో) ఆఁ! ఆఁ! మామయ్య మరణించారా ?

సుధా : మీ రనేది నిజమేనా ?

శం : వళ్ళు తెలియని పరిస్థితిలో నరాలు కోసుకుని పరుగుతీస్తూ కారుక్రింద పడ్డారు. నిమిషాల మీద పోయారు. గవర్నమెంటు ఆస్పత్రికి తీసికెళ్ళారు శవాన్ని— పోస్టుమార్టమ్ చేయాలట. శేఖరంకూడా అక్కడే ఉన్నాడు.— పదండి త్వరగా.

(సుధాకర్, రాధ కళ్ళు ఒత్తుకుంటూ నిష్క్రమిస్తారు)

(నౌకరు పండుగసరుకులు నెత్తిన పెట్టుకుని ప్రవేశిస్తాడు.)

నౌక : ఇదిగో బాబుగారూ! తెమ్మన్నవన్నీ తెచ్చాను. రాధమ్మగోరేరి! ఏడ పెట్టమంటారో?

శం : ఇక్కడ కాదు. మనింట్లో పెట్టు.

నౌక : అదేటి బాబూ! మర్చిపోయినట్టుండారు. రాధమ్మగోరికి తెచ్చి పెట్టమంటిరిగా!

శం : అధిక ప్రసంగం మాని నేను చెప్పినట్లు చేయి. అప్పుడు తెమ్మన్నాను. ఇప్పుడు వద్దంటున్నాను.

నౌక : చిత్తం. (బుట్ట ఎత్తుకుని నిష్క్రమిస్తాడు)

(శంకరయ్య స్విచ్ బోర్డు దగ్గరకుపోయి బెడ్ లైట్ వేసి హాలు మధ్య వెలుగుతున్న బల్బు ఆర్పేస్తాడు. రంగస్థలం గుడ్డివెలుతురుతో మినుకు లాడుతూ ఉంటుంది.)

శం : పుణ్యాత్ముడు! ఒక్క ఏడాది దరిద్రంతో నే కష్టాలు తెంచుకున్నాడు. ఆయన బాల్య మిత్రుడు అవధాన్లుగారు చెప్పినట్లుగానే ఆయనకు మంచిరోజులు వచ్చినయ్. కాని రాధకూ, శేఖరానికీ రామనాథంగారి లాగా మరో జన్మంలోనో, ఈజన్మంలోనో మంచి రోజులు వచ్చేది? ఆ శుభదినం ఇంకెంత దూరంలో ఉందో ?

(వీధి ద్వారం గుండా నిష్క్రమించి- తలుపులు వెలుపలనుంచి బిగిస్తాడు. తెర.)

# వైద్యశాస్త్రమునకు జ్యోతిశ్శాస్త్ర సహాయము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఆరు సంవత్సరములనాటి మాట. ప్రాత కాగితములు తిరుగవేయుచుండగా, జ్ఞప్తికి వచ్చినది. పాఠక మహాశయులకు నివేదించుటకిపుడు పూనుకొంటిని.

గృహకృత్యపు పనులకొరకై నేనపుడొక నగరమునందుంటిని. నా బసకు సమీపమందే పుర వైద్యశాల. దానిని నిర్వహించు డాక్టరు చాలా యోగ్యుడు. రోగనిదాన విషయమున దక్కని అనుభవశాలి మాత్రమే కాక, మంచి హస్తగుణము, దయాదాక్షిణ్యశీలత కల సులభుడతడు. నగరములోని ఇతర వైద్యశాలల సమీపములో నివసించు రోగులు సయితము ఇతని సౌజన్యముపై విశ్వాసము కారణముగా, దూర ప్రాంతములనుండి ఈ వైద్యశాలకే వచ్చుటంజేసి, అతనికి విరామమే యుండెడు. జ్యోతిశ్శాస్త్రముపైన నమ్మకము, దాని వ్యాసంగవిషయమున కొంత పిచ్చియు, అతనికి కలవు. సమానవయస్కులము కతమున నేను నా నగరము చేరిన కొన్ని దినములలోనే, అతని పరిచయము తలవనితలంపుగా నాకబ్బినది. తీరికయున్న వేళలలో వైద్యశాలకుపోయి, రోగుల ఒత్తిడిలేని కాలములో, అతనితో వైద్యశాస్త్రమునకు జ్యోతిశ్శాస్త్రమునకు కల సంబంధమును గూర్చియు, జాతక పరీక్షవలన వైద్యులకు కలుగు ఉపయోగములను గూర్చియు, అపుడపుడు చర్చించుచుండెడివాడను. సెలవు దినములలో, ఏ కొంత విరామము దొరకినా, నాగదికే అతడు వచ్చి అట్టి చర్చలతో నే కాలక్షేపము చేయుచుండెను

ఒకప్పుడు నా మిత్రుని కొక క్లిష్టసమస్య వచ్చినది. అతని బంధువర్గమునకు చేరిన ఒకానొక బీద ఇంటి కన్యక కలదు. చిన్నతనమందే ఆమెకు జనక శోకము వచ్చినది. అగతిక అయిన తల్లి విధిలేక ఏదో చిన్న బడిలో పంతులమ్మ ఉద్యోగమును సంపాదించుకొని కష్టముతో జీవయాత్ర జరుపుకొనుచు, తన ఏకపుత్రికకు విద్యా వ్యాసంగమునకు అవకాశము నిచ్చి పెంచుచు వచ్చినది. దినదిన ప్రవర్ధమానయై తెలివి తేటలలో పేరుగాంచి ఆ చిన్నది పందొమ్మిది వసంతములు వచ్చునప్పటికి బి. ఏ. పరీక్షలో పట్టభద్రురాలయినది. నాటినుండి వివాహ ప్రయత్నము.

చొక్కపు బంగారువన్నె మరపించు దేహ కాంతి, అందము తోలుకాడు అంగసౌష్ఠవము, ఆరోగ్యమునకు వయస్సునకు తగిన ఆకారపుష్టి, విద్యకు తగిన వినయవిధేయతలు, కల అతరుణిని చూచినచో, బంగారునకు పరిమళమబ్బినదని చూపరులు భావింతురు. కాని, బీదయింటి కన్యకలకు వివాహపు విపణివీధిలో తగినవెల లభించదని అన్యాయపు శాబ్దమిది. ఇతర పదార్థములలోవలె వరులవిషయములో సయితము "నీలిసంత" వ్యాపారము నిరర్గళముగా సాగు దుర్దినములు దాపురమైనవి. స్వజాతిలో తగినవరులు సమృద్ధిగా నున్నారు. కాని, వేనవేలు అరణము కోరుట వారి అలవాటు. కన్యక రూపలావణ్యములు కొందరు వరులను ఆకర్షించినా, వారి తల్లిదండ్రులు, ఆడుబిడ్డలు, లాంఛనముల సందర్భములో అందరాని అంతస్తులో నుండుటచే. వరుల ఇష్టార్థము సామాన్యముగా నెరవేరదు. పాపము! కన్యక తల్లి యేమిచేయ గలదు? జీవయాత్ర జరుపుకొనుటే ఆమెకు దుస్తరము.

ఇట్లే సంవత్సరము కడచినది. సమీప ప్రాంత మండలి యొక పట్టణములో ఒకానొక సంపన్న గృహస్థుని పుత్రుడు ఉన్నతవిద్యలో కృతార్థుడై కొన్నాళ్ల క్రిందనే ఇంటికివచ్చినాడని తెలిసి, ఆ బీద రాలు ఆత్మగౌరవమును బిడియమును దిగవిడిచి, తన కూతురును వెంటబెట్టుకొని నేరుగా వారిఇంటికేపోయి, కులగోత్రనామములు చెప్పుకొని, తన పరిస్థితులను తెలిపి, కుమారునికి కన్యను స్వీకరించి ఉద్ధరించుమని దైన్యముగా ఆ గృహస్థుని ప్రార్థించినది. సాక్షాత్తుగా లక్ష్మీదేవివలె ఇంటికివచ్చిన ఆ తరుణిని చూచి ముగ్ధుడైన వరుడును, ఉదారాశయముగల అతని జనకుడును, అరణముమాట ఎత్తక, సంబంధమును సమ్మతించినారు. ముహూర్తమును త్వరలో నిర్ధరించి తెలుపుదుమనియు,

సకాలమునకు కన్యను పిల్చుకొనివచ్చినచో సకల వ్యయమును తానే భరించి తన ఇంటిలోనే వివాహము జరుప గలవనియు, వరునితో సంప్రతించి, అతని తండ్రి మాట ఇచ్చినాడు. పుణ్యము పండినదని సంతసించి ఆ కన్యాజనని ఇల్లుచేరుకొని లగ్నపత్రికను నిరీక్షించు చుండినది. కన్యక ఆనందము వనుక చెల?

ఎదురుచూచిన జాబు పదునైదు దినములకే వచ్చినది. కన్యక రజస్వల అయినట్టి ఆ సమాచారము తెలిపినచో, వెంటనే ముహూర్తము నిర్ణయించి వ్రాతునని కాబోవు వియ్యంకుడు సూచించినాడు. వివాహమునకు, గర్భాధానమునకు సహా, అనుకూలించు రీతిగా సుముహూర్తమును నిర్ధారించవలయునని ఆ పక్షమువారి కోరిక. కన్యకగల వయోధర్మమును గమనించినచో ఈకోరిక సమంజసమే కాని, వచ్చిన చిక్కేమనగా, ఆ తరుణి మూడు మాసములుగా రజస్వల కానేలేదు. ఎందుకు కాలేదో, ఎప్పుడగునో, తెలియదు. నెలనెలకు సక్రమముగా రజస్వల అగు స్వభావము కన్యకకు లేదనియు, ముహూర్తము పెట్టవచ్చుననియు, కన్యకతల్లి ప్రతి ఇచ్చినది. కాని, రజస్వల అగు వరకు వివాహ ముహూర్తము నిర్ధారము కాదని వియ్యంకుడు తెలిపినాడు. మూడు నెలలుగా కన్యకు రజోదర్శనము కాలేదని అతనికి తెలిసినదేమో? ఎవరైనా కుట్రచేసి యుందురా? ఎందరో వివాహ కంటకులు! సర్వ సులభముగా మనువు కుదిరినదని తోడి కన్యకల కెందరికో కన్నులు కుట్టియున్నవి. త్వరలో రజస్వల కానిచో, లేనిపోని సంశయముల కాస్పదమై, వివాహమునకు భంగమే వచ్చునేమోయని కన్యక తల్లి హృదయము తల్లడిల్లినది. సాధారణముగా స్త్రీలకు వాడుకలో నుండు చిల్లరమందులు ఉపయోగించినా, ఫలము కానరాలేదు. విధిలేక, కడకామె నా మిత్రు నాశ్రయించినది. విషయము నంతయు గమనించి అతడు ఆర్తవ ప్రదములగు ఘాటైన మందులు రెండుదినము లిచ్చినాడు. చికిత్స ఫలప్రదము కాలేదు. అతనికేదో అనుమానము కలిగినది. కన్యక చాలా గుణవంతురాలనియు, యోగ్యురాలనియు, ప్రతీతి. అయినా ఏదైనా పొరబాటు జరిగినదేమో? ఏ పుట్టలో, ఏ పామున్నదో, ఎవరికి తెలియును? మూడవసారి మందిచ్చుట ప్రమాదకారి అని నా మిత్రుడు భయపడినాడు. ఏమైనాసరే, ఇక మందియ్యనని చెప్పినాడు.

రహస్యముగా ఈ కథ చెప్పి, నాకా తరుణి జాతకము నిచ్చి, అందలి తత్త్వ మేమో, వివాహమునకు ప్రతిబంధకము కలుగు సూచన లున్న వేమో, చూడుమని నా మిత్రుడు కోరెను.

ఆమె సాయన జాతక చక్ర మీ క్రిందనున్నది:

| | | | |
|---|---|---|---|
| ధం 18-44 | రా 3-31<br>శ 16-28 | | |
| | (సాయనము)<br>—<br>కన్యక జాతక<br>చక్రము.<br>— | | |
| శ 18.10<br>ప్రేమ 13-5<br>ఆధానం 0-12<br>1 0-3 | | | దాంపత్య<br>4-26<br>గు 20-41<br>చ 22-5 |
| కు 3-22 | ర 11.48<br>బు 20-52<br>శు 25-40 | కే 3-21<br>X 6-51<br>పుణ్య 10 18 | ఇం 7-37<br>రక్ష 16.8 |

ప్రకృత విషయమునకు చెందిన యోగములను మాత్రము చర్చింతును.

వృశ్చికరాశిలో సున్న, రవి, బుధ, శుక్రులు దాంపత్య జీవితముపై మిక్కుటమగు కాంక్ష, దానికి తగిన దేహ పాటవము, కలదని తెలుపగలరు. శీలచ్యుతిని సూచించు ఇతర యోగము లున్నచో, వానికీయోగము చేయూత. గురు చంద్ర సంయోగమునకు బుధ శుక్రులు కేంద్రము, వరుణుని కోణ దృష్టియు కలవు. వలసినంత భావోద్రిక్తత కలదు. దాంపత్యసహమున్నచో, కుజుని కోణదృష్టి నందుకున్నది. వివాహేచ్ఛ మిక్కుటము. ప్రేమ సహమమునకు ఇంద్రుని కోణ దృష్టి, రవి అర్ధకోణ దృష్టియు, కలవు. అనురాగ మబ్బినయెడల తీవ్రగతి చెందు స్వభావము చూపట్టును. ఇది ఇట్లుండ, లగ్నము మకర రాశిలో వర్గోత్తమాంశ. లగ్నాధిపతి శని స్వక్షేత్ర బలముతో మకరమందే యున్నాడు. అతని అర్ధకోణ దృష్టి బుధ శుక్రులను అదుపులో పెట్టుకోజాలినది. గురుచంద్రులు

ధర్మస్థానములో నుండుట ఎంత భావోద్రేకము ఉండినా, ఎంత ఉత్కంఠ యుండినా, లోపల అణచుకొని పైకి ప్రశాంతముగా, నీతి నియమ సహితముగా ప్రవర్తించు స్వభావము వచ్చును. వాస్తవముగా, ఇట్టి స్వభావము కల భార్య లభించుట పురుషుని పుణ్యోదయము.

కాని, ఇప్పటికి వివాహము లేనందున, ప్రకృతి సమస్యకిది సదుత్తరము కాజాలదు. దశలనుండియే మనము విషయమును తేల్ప వలసియున్నది.

అప్పటికి చలిత జాతకములో చలిత గురువు సప్తమాధిపతియగు జన్మ చంద్రుని సంయోగములో నుండెను. పతి సంయోగ భాగ్యమును చూపు దశ ఇది. చలిత బుధ శుక్రులకు సంయోగమున్నది. ఆటపాటలు, విద్యావినోదములు, విలాసవిహారములు, సరససల్లాపములు, మున్నగువానికి ఇది పనికివచ్చును. చలితలగ్నము త్రిస్ఫుటసహమునకు అర్ధకోణమునకు వచ్చినది. చలిత దాంపత్య సహమునకో గురు సంయోగము రమ్యమైన వైవాహిక జీవితము వచ్చుటకు తగిన శుభకాల మాసన్నమైనదని ఈ సహాయోగములు చాటుచున్నవి. పురుష కాంక్ష సహకారము ననుసరించి వివాహము జరుగుటకు సందేహము లేదు.

ప్రాజాపత్య వివాహమేమో జరిగియుండ లేదని ఎరుగుదుము. కాని, గాంధర్వవివాహమో, రాక్షస వివాహమో, ఏల జరిగియుండరాదు? అను సందేహము రావచ్చునేమో? యుక్తమే. ఇప్పుడు వ్యాప్తిలోనున్న వన్నియు శుభవిశేషములే కాని, దుష్ప్రగ్రహ క్రూరదశలు కావు. ఈ పరిస్థితులలో, రాక్షసవివాహము కాని, పైశాచ వివాహము కాని, అసంభవము. జరుగుచున్న శుభగ్రహదశలైనా, వానికి అనుకూలించు ఉత్తేజము చలిత చంద్రునికి వచ్చినపుడే ఫలము నియ్యగలవు. పంద్రెండు నెలలుగా అట్టివేళలు చలిత చంద్రునికి రానేలేదు. గురు, బుధ, శుక్రుల విషమదృష్టిలోనే ఆ చంద్రుడు సంచరించుచుండెను. పరీక్షాకాలములో మిథునరాశిలో 1½ భాగలో ఆ చంద్రుడుండుట, చలితరవికిపుడు సమసప్తకము. కాననే ఈ ఆందోళనము. రెండు నెలలలో జన్మకుజుని సమసప్తక వీక్షణము నందుకొని చలితచంద్రుడు దాంపత్య సహముతో, చలిత ప్రేమసహముతో సహా, అనుకూల దృక్సంబంధము వహించగలడు. ప్రాజాపత్యమో, గాంధర్వమో, ఏ వివాహమైనా, అప్పుడు జరుగగలదు.

సరే. బాగున్నది. కాని, ఇప్పుడీ అర్థవిభంగపు పిట్టపిడుగు రానేల? చలితలగ్న మిప్పుడు శని సంయోగములో నున్నది. దూరదృష్టి, జాగరూకత, సహజము. కాముపరవశతవలన అవివేక ప్రవర్తనము నిచ్చుదశ కాదిది. లగ్నాధిపతి అగు శని హితకాంక్షి. అతనిపట్టు క్షేమముకొరకే. ఇతని సర్వవీక్షణమువలన కానిచో, వచ్చియున్న ఇతర ప్రబలదశలు గాంధర్వ వివాహ కలాపమునకు దారితీసియుండెడివి. కాని, నైసర్గిక శీతల స్వభావుడగు శని లగ్నమును పట్టి జాతకురాలి దేహమున రక్తోష్ణమును తగ్గించి ఉద్రిక్తస్థితికి రానీయక రక్షించినాడు. తత్ఫలముగా బుధధర్మము మందగించినది. నాల్గు నెలల క్రింద చలిత చంద్రునికి శుక్రునికి సమసప్తక వేధ రాగా, పుష్పమునకు వికాసము తగ్గి నెలలు తప్పినవి: కుజుని దృష్టి వచ్చెనేని, మరల వికాసము రాగలదు. ఆధాన సహ మిప్పుడు జన్మశనికి చేరుచున్నది. ఏ ప్రమాదమున కైనా, అవకాశము లేదు. ఇంతలోనే చలితచంద్రుడు కుజుని సమసప్తక దృష్టి నందుకొనగలడు. పరిస్థితులప్పుడు చక్కబడును. అంతా శుభోదర్కముగా పర్యవసానము నందగలదు.

జాతకపు సూచన లివి. కార్యకారణ సమన్వయ పూర్వకముగా నా ఊహలు నా మిత్రుని కెరిగించితిని. కాని, అతనికి విశ్వాసము కుదరలేదని, ముఖ భావము సూచించినది. రెండువారములు నిరీక్షించుమని చెప్పిపంపితిని. నాటికి ఎనిమిదవ దినమున ఆ తరుణి ఋతుమతి యయినది. నా మిత్రుడు ఆత్రముతో వచ్చి పట్టరాని సంతోషమును వెలిబుచ్చినాడు, నాల్గవ నాడుదయమున అతనివెంట ఆ తరుణి నా గదికివచ్చి సవినయముగా నమస్కరించినది. "శీఘ్రమేవ వివాహ ప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించితిని. కొన్నాళ్ళకే ఆమెకు పరిణయమైనది. ఇప్పుడామె ఆదర్శప్రాయయగు గృహిణి.

* * *

నాలుగు దినములతరువాత ఉదయముననే నా మిత్రుడు నాగదికివచ్చి ఒక జాతకచక్రమును నాకిచ్చి.

"ఒక యువకవిద్యార్థి జాతక మిది. సాయన కుండలి వేసి చూడండి. సాయంకాలమున వచ్చి మాటలాడగలను." అనిపోయెను.

"ఏమి విశేషము?" నే నడిగితిని.

"అంతా సాయంకాలమే."

అని చెప్పి రోగులు కాచియుందురని ఆశ్రమంలో అతడు వెడలిపోయినాడు. అతడిచ్చిన సామగ్రితో ఆ విద్యార్థి జాతకమును గుణించి, అప్పటికి చలితకుండలి సహా సిద్ధపరచితిని. ఇదే ఆ జాతకము.

| | | | |
|---|---|---|---|
| భార్య 17-28<br>పుణ్య 14-39 | వ 12-10 (వ)<br>రా 22-25 | X 17-1 | ద 14-28 |
| | (సాయనము)<br>విద్యార్థి<br>జాతకము<br>— | | గు 20-31(వ)<br>యు 20-47 (వ) |
| శ 8.1 | | | కు 3-18<br>I 15-54 |
| శు 6-29 (వ) | ర<br>15-38-24<br>బు16-39 | కే 22-25 | ఇ 5-32<br>ప్రేమ 8-45 |

సింహాలగ్నపు వర్గోత్తమాంశ లగ్నము. లాభ భావమందలి చంద్రుని స్నేహదృష్టి లగ్నముపై నున్నది. శుక్రుడు పంచమభావములో నున్నాడు. దర్శనీయమగు సౌందర్యము, రసపిపాస, భావోద్రేకమునకు లోనగు చిత్తవృత్తి. ఆత్మ విశ్వాసముతో అంజలు వేయుచొరవ, ఇష్టార్థసిద్ధికొరకు పట్టుదల, ఆశావాదిత్వము, భోగలాలసత, చూపట్టుచున్నవి. లగ్నాధిపతి రవి బుధునితో చేరి వాల్గింట నున్నాడు. సోదరసంపత్తు, సౌందర్యము, అతికామము, దీని ఫలము. చతుర్థ భాగ్యాధిపతియై యోగకారకుడగు ఖగోళ సర్వసేనాని కుజుడు తను భావమందె నిలిచినాడు. దేహపాటవము, యోగ్యమగు వృత్తివలన అర్జన, బహుస్త్రీలోలత తెలుపు యోగ మిది. చంద్రునికి మేషరాశిలోనున్న ప్రభావశాలి వరుణుని మిత్ర కటాక్ష మున్నది. సులభముగా ఆకర్షణమునకు లోనగుట, ఆదర్శ సాధనమునకై ఎంతటి త్యాగమునకైనా, చొరవకైనా, వెనుదీయక ముందంజవేయుట, ఇతరుల మాటలను కాని, అభిప్రాయములను కాని, సరకుచేయక పనులు సాగించుట, తలచని తలంపుగా కోరికలకు సహాయము లభించుట, ఈ యోగపు ఫలములు. విక్రమ భావమందలి కేతువుతో, ధర్మస్థానమువందలి రాహువుతో, పంచమ భావమందున్న శుక్రునికి విషమదృష్టి కలుగు. స్త్రీ వ్యామోహమువలన ధర్మభ్రంశము, విద్యావిఘాతము, సూచితములు. సవాధి పని బుధుని చతుర్థస్థితికి.

"పరాంగనారత్యభిసార పేశలత్వము" ఫలములు, సప్తమాధిపతియగు శని అరింటనున్నాడు.

"దారాధీశే, షష్ఠగే, మృత్యుగే వా,
రుగ్ణో నిత్యం, క్రోధయుక్తః, స్మరార్తః;
సౌఖ్యం స్వప్నే ప్యస్య న స్యాత్ కథంచిత్,
వారస్త్రీభి ర్వా గతిస్య క్షయః స్యాత్."

'సంకేతనిధి'.

వారాంగనా లోలత, ధననాశకరము, అనారోగ్యము, సుఖహాని, ఈ యోగపు ఫలము లున్నవి.

పుణ్యసహమము అష్టమభావములో చంద్రుని కేంద్రవేధలో నున్నది. ఆ సహమాధిపతి గురువు యమునితో చేరి వ్యయములో నుండుటే కాక బుధుని కేంద్రవేధపాలయినాడు. కాముక వ్యాపారమున విశేషనాశము, అనర్థకరము నగు ప్రవృత్తిని మాత్రమే గాక, ఈ యోగము ప్రాపంచికముగా దారిద్ర్యములను, దురదృష్టమును సహా సూచించగలదు.

జాతకుని సామాన్యస్వభావమిట్లు చూపటగలదు. శుక్ర, కుజ, వరుణులకు పరస్పరముగా ఏర్పడియుండు త్రికోణదృష్టి జాతకుని కామకళాకౌశలమును తెలుపుచు, అతిసులభముగా స్త్రీల హృదయముల నాకర్షించుశక్తిని సహా సూచించగలదు. కాని, ఆ శుక్రునికి ప్రబలమగు ఇంద్రకేంద్రవేధ యున్నది. స్త్రీ వ్యామోహవిషయమున అలవికాని కోరికలు, అందరాని ఆదర్శములు, ఆశాభంగమువలని క్లేశము, జీవితములో అనుభవమునకు రాగలవు. ఆ ఇంద్రుని ఆశ్రితమందే ప్రేమసహమ ముండుట! ఇతరులను మోసగించి తానుసయితము జాతకుడు మోసపో వచ్చును. ఇంద్రయములు లగ్నము నిరుప్రక్కల పొదివినారు. ఈ గ్రహముల పరివేషముచే లగ్నము నిలిచియుండెనేని, దుర్వ్యామోహము వలననో, దురాశ వలననో, నిర్బంధ వాసమునకు జాతకుడు గురికావలసి వచ్చుచుండెను. కొంచెములో గండము తప్పినది.

సరేకాని, ఇప్పటి పరిస్థితి ఎట్లున్నదో? జీవ మానసదశలో చలితలగ్నము కడచిన సంవత్సరమున ఇంద్రసంయోగములో నుండినది. మాయావి ఇంద్రు డప్పుడే తన నాటకము ప్రారంభించియుండును. చలిత కుజుని అర్ధకోణదృష్టి జన్మచంద్రునిపై నుండు నది. రంగప్రవేశమునకు కావలసిన శక్తి చాతుర్య ములు కుజు డొసగించినాడు. చలితరవి జన్మశుక్ర సంయోగ మప్పుడే సిద్ధమయినది. కథానాయిక పాత్ర ధరించుటకొక తగిన లభించి యుండగలదు. చలితచంద్రుడు నా కాలమందే భార్యసహమమును చేరుకొన్నాడు. మంగళాంత ముగా నాటకము ముగియుటొక్కటే కొదవ. కాని, కళత్రకారకుడగు శుక్రుడు వక్రిఅగుటచే వృశ్చికరాశి యందు 16 వ భాగ కప్పుడే వచ్చి వరుణుని పార్థకేంద్ర విషమదృష్టికి పాత్రమగుట చింతాకరము. తలపెట్టిన కార్యమును గట్టెక్కనీయడు వరుణుడు. కథ విషా దాంతమగుటే అతనికి ప్రీతి. ఇట్టి దశాఫలముగా, జాతకుడొక యువతిని రహస్యముగా ఆకర్షించి, ప్రేమించి, వివాహమునకు పురిగొల్పి విజయపతాక నెత్తుటకు పూనుకొనునంతలో, ఆకస్మికముగ ప్రబల విఘ్నమేదో కలిగి, వియోగముగా పరిణమించి, విషాద కరముగా పర్యవసానమంది యుండుట అస్వాభావికము కాదు. చలిత పుణ్యసహమముపై శనియొక్క కేంద్ర విషమదృష్టికి చిక్కినది. జాతకుడు అదృష్టహీనుడు. దరికానని విరహవేదన అనుభవించుచు కుములుటే ఫలము. తృతీయ దశాధిపతి అగు శుక్రుని వేధాకాల ములో చేసిన ప్రయత్నము, చూపిన పరాక్రమము, సఫలముకా జాలవు. విద్యావ్యాసంగ మున్నచో, దానికి జలప్రదాన మేగతి.

వీడాదికడవగా, శుక్రదశ వేధ ముగిసినది. పరిస్థితులలో అసౌకర్యము తగ్గియుండును. చలిత లగ్న మిప్పుడు ఇంద్రుని దాటి ప్రేమ సహమమును చేరుకొన్నది. ప్రాత కథకు పునశ్చరణమో, నూతన కథయో ఆరంభమైయుండును. కాని చలితశుక్రున కిప్పుడు శని అర్ధకేంద్ర వేధ. ఏవో ప్రతిబంధకములను శని తెచ్చిపెట్టి బాధించగలడు. ఆకర్షించిన వ్యక్తియో అనారోగ్యమో, పెద్దల అభిప్రాయములో ఆశాభంగ మునకు కారణము కావచ్చును. ప్రశాంతకాలములో చలితచంద్రుడు నికరముగా జన్మశుక్రునికి కోణ మందే తిరుగుచున్నాడు. చలిత శుక్రునికి శనివేధ యుండు కారణముచే, చలిత చంద్ర శుక్రుల సంబం ధము మనోయాతనకే సహాయపడగలదు. రెండు నెలలలో చలితచంద్రునికి శని కేంద్రస్థితి వచ్చును. వెంటనే హితకరములగు దృష్టిసంబంధములు ఆ చంద్రుడు సంపాదించగలడు. కనుక, తొందర యుండదు. జాతకుని సంకల్పము సఫలము కావచ్చును. చలిత దాంపత్యసహమము లగ్నాధిపతిపై నుండుట, చలితభార్యా సహమము ఇంద్రుని శుభదృష్టికివచ్చుట, అను దశాయోగములు మనోరథసిద్ధికి మార్గము చూప గలవు.

ఆ సంవత్సరమునకు వర్షజాతక మేమనుచున్నదో చూతమని, ఆనాటి సాయంకాలమున అది గణించు చుండగా నామిత్రుడు గదికివచ్చి సుఖాసీనుడై,

"జాతక మేమనుచున్నది?" అని ప్రశ్నించెను.

"వివాహము కావలెననుచున్నది." అంటిని.

"వివాహమా?" ఆశ్చర్యముతో.

"అవును."

నా మిత్రుడు పకాపక విరుగబడి గట్టిగా నవ్వ నారంభించెను. కారణము బోధపడక ప్రశ్నార్థకముగా అతనిని చూచితిని. అతడు నవ్వుచునే ప్రతిఇచ్చెను.

"జాతకములో మీకు పెండ్లి కావచ్చినదేమో? నాకేమో వాని ముఖములో పిచ్చిఆస్పత్రి కని పించినది."

ఈ ఎగతాళి నాకు అర్థముకాలేదు. మనస్సు కొంత చివుక్కుమనినది. నా మనోభావము నా ముఖ ములో దాచుకొనలేకపోతిని.

"విషయమేమో, దయచేసి చెప్పండి!"

"మహానుభావా! అతనికి పిచ్చిపట్టియున్నది. మీరు వివాహమనగా, నాకు నవ్వు ఆగలేదు. క్షమిం చండి."

నేను నమ్మలేకపోతిని. జాతకము గుణించుట యందు కాని, గ్రహస్థానములలో కాని, పొరపాటు చేసియుంటినేమో, అని ఒకసారి చూచి అది సరిగా నున్నదని గమనించితిని. నెమ్మదిగా,

"నా దృష్టిలో పిచ్చి కానరాదు." అంటిని. నా మిత్రుని ఆత్మగౌరవము దెబ్బతినినట్లయినది. కొంత తీక్ష్ణముగా నన్ను చూచుచు అతడు ప్రతి చెప్పెను.

"నేను వైద్యుడను. ఇరువది ఏండ్ల అనుభవమున్నది. జాతకుడు నా బంధువు. వానిని పరీక్షించినాను. వాస్తవముగా పిచ్చిపట్టినవాఁడు. పిచ్చివారి వైద్యశాలకు వానిని తీసుకొనిపోయి విడిచివచ్చినవాఁడను నేనే. జాతకములో పిచ్చి కారణాలేవంటే, నే నేమి చెప్పగలను?"

"ఎన్నాళ్లుగా ఉన్న దీ పిచ్చి?"

"ఎన్నాళ్లో క్కడిది! జాతకుడు మంచి తెలివితేటలుగల విద్యార్థి. కళాశాలలో నాలవ సంవత్సరపు తరగతిలో వ్యాసంగము చేయుచుండెను. నాలుగు దినములనాఁడు ఉదయము తొమ్మిదిగంటలకు ఉన్నటుండి అతనికి పిచ్చి ఆరంభమైనది. మరుదినమున అతనిని పట్టుటే అసాధ్యమైపోగా, నాకు సమాచారమిచ్చినారు. పోయి పరీక్ష చేసితిని. వాస్తవముగా పిచ్చియే. ఇచట సాధ్యము కాదని అతనిని నిన్ననే వైద్యశాలలో విడిచి వచ్చినాను."

"ఏదైనా స్త్రీ వ్యామోహమువలని తల తిక్క కాకూడదా?" అంటిని.

"అయ్యో! వాఁడు గుణవంతుఁడండీ! అలాటి అభ్యాసములకు పోయినవాఁడు కాఁడు."

"ఏమో మరి! జాతకములో ప్రబలముగా శుక్ర చేష్ట చూపట్టుచున్నది పిచ్చికి కారణములు లేవు. ప్రబలమైన స్త్రీవ్యామోహము ముదిరిపోయి అకాలభంగము కలిగి ఉన్మత్తస్థితికి వచ్చియుండవచ్చును.

"దృక్, మన స్సంగ, సంకల్పో,
జాగరః, కృశ, తా రతిః,
హ్రీ త్యాగ, గోన్మాద, మూర్ఛాంతా,
ఇ త్యనంగదశా దశ."

అను నిర్వచనానుసారము, మన్మథావస్థలలో ఉన్మాద మొక్కటి కదా! జాతకములో, దశలలో, శుక్ర చేష్టయే చూపట్టుచుండుట. ఇది అసంభవమనుచున్నారు మీరు. ఒకవేళ, ఈ జాతకమే అతనిది కాదేమో? ఏమైనా ఎందుకైనా మంచిది, అతని పూర్వచరిత్రమును, ముఖ్యముగా కడచిన ఏడాదిలో అతని ప్రవర్తనమును, మరియొకతూరి విచారించండి." అంటిని.

నా మిత్రునికి తృప్తి కలుగలేదు. అంతటితో అతఁడు వెడలిపోయినాఁడు.

నా ఊహలు వాస్తవస్థితితో సమన్వయపడలేదని, నాకు కొంత అశాంతి కలిగినది. ఇంకా పరిశీలింతమని వర్షజాతక, దినజాతకములను సాధించితిని.

ఆ సంవత్సరపు వర్షచక్ర మిది:—
తేది 7/8-11-1952. 8-13-8 AM (IST)

| | | | |
|---|---|---|---|
| | | శు 15-42 (వ) | భార్య 12-23 దాంపత్య 28-52 |
| రా 16-56 | (సాయనము) — వర్ష జాతకము — 1952 — | | శ 18-27 (వ) చ 28-58 |
| ప్రేమ 29-18 శు 19-27 | | | కే 16-56 యమ 23-12 |
| I 24-36 కు 20-20 బు 8-6 | ర 15-38-24 | శ 21-15 ఇ 22-20 | పుణ్య 7-51 X 29-52 |

వర్షలగ్నముతో సంయోగమును అభిలషించు ఆ త్రికములో నున్నాఁడు కామాధిదేవత శుక్రుడు; దాంపత్యసహమును నేరుగా సప్తమ (కళత్ర) భావమునే చేరుకున్నది. భార్యాసహమును కళత్రకారకుఁడగు శుక్రుని యొక్కయూ, కళత్ర భావాధిపతి యగు బుధుని యొక్కయు నిండు దృష్టిలో నే నిలిచియున్నది.

"స్వామి దృష్టం స్త్రీ సహమం,
శుక్ర దృష్టం వివాహకృత్."

అనుతాజక విధి ననుసరించి, వివాహమును సూచించు యోగము లివి. పుణ్యసహమును జన్మకాల ప్రేమసహమును నాశ్రయించినది. ఈ సంవత్సరమున పుణ్యం పండినా, ఎండినా, ప్రేమవలననే! ఇంద్రుఁడు అష్టమభావములో, పైగా, గండసంధిలో నుండి ప్రేమసహమును బలముగా ఆకర్షించుచున్నాఁడు. ప్రేమయే గండముగా పరిణమింప వచ్చును. పుణ్యసహమునకు ఇంద్రుని అర్ధకేంద్ర వేధ. ఆ ఇంద్రుఁడో, జన్మకేతువు మీద స్వారి చేయుచు, చంద్ర వరుణులకు కేంద్ర క్రూరదృష్టి నిచ్చుచున్నాఁడు. విశేషమేమనగా, ఇట్టి ఇంద్రుఁడు శుక్రునికి మిత్రుఁడై (అర్ధకోణము) పురిగొల్పు

చు, బుధునికి శత్రువు (అరకేంద్రము) గా పరిణమించినాడు. కామాంధత, బుద్ధికి వైపరీత్యము, మనశ్చాంచల్యము సూచితము లగుచున్నవి. లగ్న షష్ఠాధిపతులగు గురు శుక్రులకు పరివర్తన మున్నది. ఇది అనారోగ్య హేతువు. శుక్రుని ప్రభావము ప్రబలమై రోగముగా మారకూడదా? ప్రేమ తీవ్రమున్నకై, మతిభ్రమణము కలిగి, వికార ప్రవర్తనమునకు దారితీయవచ్చును. ఇది ఉన్మాదము కాక మరి యేమి?

మన ఊహలను వర్షజాతకము సహా అనుమోదించినది. జాతకునికి మతిభ్రమణము కలిగినది 26-11-1952 తేదినాడట. ఆనాటిదిన జాతక మిది:—

| | | | |
|---|---|---|---|
| చ 22-7 | | శ 13-37 | |
| కు 3-53 | (సాయనము)<br>—<br>దిన<br>జాతకము<br>ఉన్మాదారంభము | | X 15.56<br>వ 18-5<br>(వ) |
| శు12-11 | | | |
| బు 13-48<br>(వ)<br>ప్రేమ13-37 | ర<br>15-38-24 | I 17-4<br>ఇ 22 55<br>శ 23-14 | |

దినజాతకములో పాఠకమహాశయులు ముఖ్యముగా గమనించవలసినవి బుధ, శుక్ర, చంద్రస్థానములు. (బుద్ధి, కామము, మనస్సు.) బుధుడు పోయి ప్రేమసహాయము నాలింగన మొనర్చినాడు. బుద్ధి ప్రేమతో ఐక్యమగుచున్నదనుట. శుక్రుడు జన్మకాలమునకు కేంద్రములోనున్నాడు. ప్రియావియోగమును సూచించుటయే ఇది. చంద్రుడు మీనరాశిలో ఆరింట నున్నాడు అనారోగ్యముతో వైద్యశాలావాసము నిది సూచించును. ఇంకేమి కావలెను? ప్రియావియోగమువలన కలిగిన ఉన్మాదావసరమే ఇదియని ఘంటాకొట్టి ఇప్పుడు చాటవచ్చును కదా?

వర్షజాతకములో ఇంద్రుని మాతృకు లోనైన గ్రహము బుధుడు. ఈ బుధుని వ్యాప్తి వర్షలగ్నమునకు ఏనాడు వచ్చునో, ఆనాడే కదా బుద్ధి భ్రంశరూపమగు ఫలము జాతకుడనుభవించవలయును మరి

ఛిద్రారంభమున బుధునిపై నున్న ఛిద్రాకారము భూపరిభ్రమణము కారణముగా ఏనాడు వర్ష లగ్న స్థానమునకు రాగలదో, పరీక్షింతము గాక.

వర్షలగ్నము ఉదయించు నాక్షత్రకాలము గం 12-0
వార్షిక బుధ స్థానము ఉదయించు నాక్షత్రకాలము గం. 10-46.
భోగా శేషము గం॥ 1 14
వర్షారంభకాలపు నాక్షత్రకాల భుక్తి గం. 15-6.
మొత్తపు నక్షత్రకాలము గం॥ 16-20.

ఈనక్షత్రకాలము ఏనాటి భుక్తి అగునో, ఆనాడే వర్ష బుధుని వేధ లగ్నమునకు లభించును. 'ఎఫెమెరిస్సు' చూచితిమేని, ఈ నక్షత్రకాలము 20-11-1952 నాటిదే యని పాఠకమహాశయులు సులభముగా కనుగొనగలరు.

ఇక, మన సమస్యకు వేరు నిదర్శనము కావలయునా? వైద్యుల అభిప్రాయ మెట్టిదైనా, మన తీర్మాన మిదే.

మూడు దినముల తరువాత నా మిత్రుడు నా గదికి వచ్చి,

"మీ ఊహలలో సత్యమున్నది సుమండీ!" అనుచు కూర్చుండెను. చిరునవ్వుతో"

"ఏమి కనుగొంటిరి?" అని ప్రశ్నించితి.

"నాకప్పుడు తెలిసియుండలేదు. మీరు చెప్పిన తరువాత నాకును సంకేహముతోచి, జాతకుని పూర్వచరిత్రము నంతయు బాగా విచారించితిని. సత్యము బైటపడినది."

"వినవచ్చునా?" అంటిని. అతడు చెప్పిన కథ యందలి సారాంశ మిది.

కడచిన సంవత్సరమున జాతకుడు నగరాంతరమున కళాశాలలో విద్యాసంగము చేయుచుండినాడు. అతనికి కావలసిన ద్రవ్యమును స్థలాంతరములో ఉద్యోగములో నున్న అన్న పంపుచుండెను: విద్య సక్రమముగా సాగుచున్నదని విశ్వసించితిమి. జాతకుడు బుద్ధిమంతుడే. అవివేకముగా ఎప్పుడు కాని ప్రవర్తించియుండలేదు. పెద్దలకు దూరముగనున్న యువకులు ఏ సహవాసములు సంపాదించుకొందురో, ఏ అమార్గముల వ్రాలియుందురో, ఏ దురభ్యాసములపాలగుదురో. తెలియుట దుస్తరము. జాతకునిగదికి సమీపమునందే ఒకానొక ధని

కునియింటి మేడ యున్నది. బి. ఎ. పట్టము సాధించి, చదువుచాలించియున్న సుందరియగు తరుణి, అవివాహిత, ఆ ఇంట కలదు. మేడపై ఆమెగది కిటికీకి ఎదురుగా శాలాయనముగల గదినే ఇతడు సంపాదించుకొనియుండినాడు. అప్పుడప్పుడు కిటికీలగుండా వారికి పరస్పర సందర్శన వినోదము లభించుటతో కథ ఆరంభమైనది. ప్రేమలేఖలు తరువాతిమెట్టు. సినీమాప్రదర్శనముల చీకటిలో పరస్పరస్పర్శసుఖము వారికి లభించుట. క్రమక్రమముగా నగరారామంపు మారుమూలలోని పొదరిండ్లలో వారి సాయంతన సమావేశములు జరుగసాగినవి. వారి పరిచయము ప్రేమగా మారి స్థాయీభావమునకు వచ్చినది. అతని చదువులు మూలబడెను. కళాశాలకు పోయివచ్చి శాస్త్రముగది చేరుకొని, ఆ యువతి ఛాయాచిత్రమును త్రిప్పిత్రిప్పి చూచి మురియుటో, వాతాయనములో ఆమె ముఖము కానరాగా, సైగలు చేయుటో, దీర్ఘములగు ప్రేమలేఖలు వ్రాయుటో, అతని దైనందిన కార్యక్రమములోని ముఖ్యాంశములు. కొన్నాళ్ళలోనే వివాహోత్కంఠ వారికి ప్రబలినది. కాని, ప్రతిబంధకసామగ్రి హెచ్చు. ఆ తరుణి జనకుడు లక్షాధికారి; ఇతడో, దరిద్రనారాయణుడు. వృత్తిలేదు; విద్య అయినా పూర్తికాలేదు. వివాహమున కతడు సమ్మతించడని వీరు బాగా ఎరుగుదురు. తమ ఇష్టార్థము నెరవేరు ఉపాయము వారికి కానరాలేదు.

"తడబడవే,
నాటికొక్క దినము లేదే."

అనుకొని తమ ఆనందములో తాము మున్గియుండిరి.

రెండు మూడు నెలలిట్లు జరుగగా, తోడి విద్యార్థులు ఇతని చర్యను పసిపట్టి వేళాకోళము చేయసాగిరి. కథ కొంత బైటికి పొక్కినది ఇది ఆతరుణి పెద్దల చెవికెక్కుటకు తరువాత ఎంతో కాలముపట్టలేదు. ఆమె తండ్రి ప్రత్యుత్పన్నమతి. రెండు మూడు దినములలోనే ఆమెను నగరాంతరమునకు తీసుకొనిపోయి, కొన్నాళ్ళలోనే అచట ఆమెకు వివాహముచేసి వెంటనే భర్తతో పంపి చేతులుకడుగుకొన్నాడతడు. ఆమెను చూచుటకు కాని, తన గోడు చెప్పుకొని కన్నీరు కార్చుటకు కాని, జాతకునికి అవకాశము లభించినదికాదు. ఈ ఆకస్మిక సంఘటన మతని హృదయమును బలముగా గాయపరచినది. ఆ పుండు మాన్పుటకు ఉపాయాంతరము తోచక, మెల్లమెల్లగా సాని వాడలవెంట తిరుగుట అలవాటైనది. అతని అందచందములు, కొంటెచూపులు, చాకచక్యము సాని వాడలలో చిల్లిగవ్వ వెల అయినా చేయకపోయినవి. వ్యాసంగము వకని అన్న పంపిన ద్రవ్యము దుర్వినియోగ మగుచు వచ్చెను. తిండి తీర్థములకు డబ్బు చాలక జాతకుడు నానా బాధలు పడవలసివచ్చినది. వ్యాసంగము లేని కారణమున పరీక్షకు పోయినా, ఫలము లేకపోయినది.

ఒక సంవత్సర మిట్లు వ్యర్థముకాగా, ఈ నగరమునందున్న అతని మేనమామ సందర్భములను గ్రహించి, జాతకుని స్వేచ్ఛగా వదలుట పనికి హానువు కాదని గుర్తించి, దయతలచి, అతనిని పిల్చుకొని వచ్చి తన యింట నుంచుకొని, ఇచటి కళాశాలలో జేర్చినాడు. పదునాలుగు ఏండ్ల వయస్సు కలిగి, పాఠశాలలో చదువు సాగించుచున్న చక్కని కూతురు ఆ మేనమామకు కలదు. వ్యాసంగము ముగిసి, వృత్తిలో చేరినతోడనే, జాతకునికే తన కూతురు నిచ్చి వివాహము చేయవలెనని అతని ఆశ. జాతకుని అదృష్టము పండినది. రోగి కోరినదే వైద్యుడు పథ్యముగా నిర్ణయించినట్లయినది. గత సంవత్సరంపు గాసినుండి తేరుకొనుటకు ప్రేమ పాత్రమగు వేరొక వ్యక్తి అతనికి కావలసియుండెను. ఆహారవిహారముల ఇబ్బందిలేక, చదువు సాగించ కలుగుటే కాక, అందాల రాణియగు మేనమరదలి కనులముందు మసలు అవకాశము ఆయాచితముగా దొరికినది. అతడా అవకాశమును వృథాపోనీయలేదు. గణితము చెప్పుట, పాఠములు చెప్పుట, వ్యాసములు వ్రాయించుట నెపముగా కొన్నాళ్ళలోనే ఆముగ్ధను మచ్చిక చేసుకొన్నాడా చతురుడు. చిన్నపిలల కోలాహలమునుండి వ్యాసంగమునకు భంగము కలుగరాదను వ్యాజమున గదితలుపులు బిగించి వెలికి వినపడునట్లుగా పాఠములు చెప్పుచునే, క్రమక్రమముగా మరదలిని అంకపాళి చేర్చి లాలించుట తరువాతిమెట్టు. నెల రెండు నెలలో ఆ చిన్నదానికి చనవిచ్చి, బిడియము పోగొట్టి,

"వలవిల్తు శాస్త్రంపు మినుకులాకర్ణించుమని"

ఆరంభించుట అతనికి కష్టము కాలేదు. కూతురునకు వ్యాసంగము బాగుగా జరుగుచున్నదని ఆ ముగ్ధతండ్రి సంతసించినాడు. ఇంటిపనుల ఒత్తిడిలో యీ భామాకలాపమును తల్లి గమనించలేదో లేక తానుచేయవలసిన పని కంఠుర్వలే చేసిరని ఊరకుండెనో, చెప్పుట కష్టము. కాని, పనిపాటలు చేయక మూలలో కూర్చుండి జపమాలను త్రిప్పుచుండిన ముసలి అవ్వ మాత్రము పసిబట్టె. ఆ కన్యావరుల కడగంటి చూపులు, మందహాసములు, కనుసైగలు, మాటవిరుపులు, చిలిపి చేష్టలు, గమనించి, కన్యక తండ్రిని హెచ్చరించినది. అతడు కన్నులు తెరచి కొంత గమనించి, ఏమి ప్రమాదమో అని భయపడి వెంటనే కారణమేదో కల్పించి, కూతురుని పిల్చుకొనిపోయి మేనమామ ఇంట వదలివచ్చినాడు. కథానాయకునికి ఆకస్మిక

ముగా చేకడి నా దప్పినది. చేసిన పరిశ్రమ అంతయు బూడిదలో చేసిన హోమము కాగా, ప్రపంచమే శూన్యముగా తోచిన దతనికి. మేర కానని మనోయాతనతో నిద్రాహారములు మాని, కళాశాలకు నీరు వదలి, శిరోవేదనతో మూడుదినములు యమయాతన ననుభవించుచు గదిలో మూలులతో పడకపట్టి, నాలవనాటి ఉదయమునుండి ఉన్మాదావస్థకు వచ్చి నా డతడు. నవ్వులు, ఏడ్పులు, తిట్లు పలవరింతలు, సిగ్గుమాలిన చేష్టలు, ఆక్రోశములు, ఆర్భటింపులు, మితిమీరినవి. అతనిని భరించుట సాధ్యము కాక, నామిత్రు డతనిని వైద్యశాల చేర్చినాడు. జరిగిన కథ ఇది.

జాతకము మోసము చేయలేదని నాకేమో సంతోషమయినది కాని, ఏడాదిక్రిందటనే జాతకునికి రానున్న దశల పరిణామమును అతని పెద్దలు గమనించి తగిన జాగరూకత వహించి యుండినచో, ఇంత అనర్థము కలుగకుండ క్లిష్టకాలములో అతనిని కాపాడియుందురు గదా?

ఈ జన్మరాశి భవిష్యత్తు ఎట్లున్నది? అని నా మిత్రుడు ప్రశ్నించెను.

"వాని భవిష్యత్తు మేనమరదలి చేతిలోనున్నది." అంటిని.

"అనగా, పెండ్లి చేయవలెననియా? వైద్యశాలలో నున్నవానికా పెండ్లి?"

నామిత్రుని ఆశ్చర్యము అతని ముఖములో వ్యక్తమగుచుండెను.

"మహానుభావా! నేను ఎగతాళి చేయుచుండ లేదు. అతనికి పిచ్చిపట్టించినవారు మీరే. మీరే..."

ఆర్తితో నామిత్రు డందుకొని,

"వాని కర్మ. ఎవ రేమి చేయగలరు?" అని తేలబలికెను.

"ఖండితముగా కర్మయే. ఎవ్వరు కాదనిరి? వాని కర్మకు మీ కర్మ సహాయమైనది. ఏడాదిగా స్త్రీ వ్యామోహమునిచ్చు దుష్టదశ వాని జీవితములో నడచుచున్నది. తగిన సంస్కారము, ఉపదేశము, అనుభవ వివేకము, లేని వయస్సులో అది వచ్చుట. కలసిన అనుకూలము లన్నియు దానికి ఎదిగించి ఇచ్చినారు మీరు. పెద్దలకు దూరమందు జాతకునికి వసతి ఏర్పరచుట, అడిగినంత ధనము పంపుట, అది సద్వినియోగమగుచున్నదో లేదో, గమనించకపోవుట, అతని ప్రవర్తన యెట్లున్నదో కనుగొనలేకుండుట, ఇవి అన్నియు వాని దుర్దైవమునకు మీరు చేసిన సహాయములు. పోనిండు. ఈ ఏడు జరిగినదేమి? సదుద్దేశముతోనే మేనమామ వానిని తన ఇంట చేర్చుకొన్నాడు. కూతు నిచ్చుటకు సంకల్పించినాడు. ఆ చిన్నదానితో అతనికి చనువు వచ్చుటకు అవకాశము నెదిగించి ఇచ్చినాడు. అమాయకురాలైన కన్యక సహా వాని భావములకు తగిన ఉత్తేజనము నిచ్చినది. వాడామెను ప్రేమించినాడు. వారికి అన్యోన్యత ఏర్పడినది. వారి ప్రేమ అంకురమై, చిగురై, మొగ్గయై, పూవై, ఫలమైనది. అనుభవమునకు వచ్చు కాలమున అభ్యంతరము కల్పించి ఆశాలతను తటాలున త్రెంచినారు. ఈ కర్మ ఎవరిది? అనుకొన్నారు, అండచేర్చినారు; అవకాశ మిచ్చినారు; ఆశ కల్పించినారు; ఇపుడు నిరోధించినచో, ఉన్మత్తత ఏలరాదు? పరిణామ మేమగుననుట మొదటనే గమనించి యుండవలసినది.

"అనారంభో మనుష్యాణాం,
ప్రథమం బుద్ధి లక్షణం,
ఆరబ్ధస్యాంత్యగామిత్వం
ద్వితీయం బుద్ధి లక్షణం."

అన్నారు పెద్దలు. ఇపుడు, ఇంతకువచ్చి, వెనుకకు మరలుట యుక్తము కాదు. మొదట అకన్యను పిలిపించి ఆమె వచ్చినదని వానికి తెలిపినచో, వ్యాధి సగము కుదురును. వైద్యశాలనుండి ఇంటికి తెచ్చుట రెండవ పని. మరదలి మందహాస చంద్రికలే వానికి మందు. రెండు మూడు నెలలు మనస్సు నెమ్మది పడనిచ్చి మంచి ముహూర్తము చూచి, వారికి వివాహము చేయుట మూడవది. చక్కగా వ్యాసంగము చేసి, నెమ్మదిగా అతడు జీవించగలడు. కన్య సహా సుఖపడగలదు."

సావధానముగా విని నా మిత్రుడు క్షణ మూరకుండి.

"ఈ మార్గమే హితమని నా కిపుడు తోచుచున్నది. ప్రయత్నింతును" అనెను.

తరువాత వారము దినములలోనే జాతకు డింటికి వచ్చినాడు. మరదలి ముగ్ధమధుర దరహాసముతో అతనికి స్వస్థత వచ్చినది. అందరు సంతసించినారు.

జాతకు డిపుడు చక్కని గృహస్థుడు.

"అన్యాని శాస్త్రాణి వినోదమాత్రం,
నకించి దేషాంతు విశేషమస్తి,
చికిత్సిత, జ్యోతిష, మంత్రవాదాః,
పదేపదే, ప్రత్యయ మావహంతి."

(ప్రాచీన సుభాషితము.)

# వర్ణాంతర వివాహం

శ్రీ బలివాడ కాంతారావు

జగన్నాథం పెద్దకూతురు దొంగతనంగా తక్కువ జాతివాణ్ణి పెళ్ళి చేసుకుందట!

మధ్యాహ్నం పండ్రెండు గంటలకే పూర్తో యీ వార్త వ్యాపించేసింది. "ఈ వేళ ప్రొద్దున్నే ఆఫీసుకు తలవంచుకొని వెళ్లి పోతుంటే చూశాంగా! నమ్మతగ్గ కబురు కాదన్నారు." ఆమెను వుదయం ఎనిమిది గంటలకు చూసినవాళ్ళు!

"లేదు! ఆఫీసుకని యింట్లో బయలుదేరి టాక్సీయెక్కి షరాపరి ప్రక్కవూరి దేవాలయం దగ్గర దిగిందట! అంతా సిద్ధంగా వుంది. మూడు ముళ్లూ పడిపోయాయ్!" విషయం కనుక్కున్న వాళ్ల వాదనయిది.

ఇలా అవునా కాదన్న వాదనలు సాయంత్రం వరకే బల్లబడిపోయాయ్. పెళ్లికూతురు అప్పుడే తన కాపరం అది చేసుకోవటం యెందరో చూశారు కాబట్టి!

ఇది చాలా చోట్ల చర్చనీయాంశం అయింది!

"పోనిద్దూ! ఆడపిల్లకు చదువేవిటి? అధికార మేవిటి? అంత స్వతంత్రం యిస్తే యేమైనా చేస్తారు!"

"ఇంత అజగన్నాధానికి తెలిసింటావా?"

"తెలిస్తే కట్టుబాట్లు చెయ్యకపోనూ—!"

"తెలుసురా అబ్బాయి తెలుసు! కొద్దిగా పసిగట్టే ఆ యిద్దరు పనిచేస్తున్న ఆఫీసు పెద్ద దగ్గరకు వెళ్ళి గోలపెట్టాడట!"

"నిజం!?"

"హాఁ" ఆ ఆఫీసులో మా మేనల్లుడు పైనో కదోయ్! అంతా పక్కగదిలోనించి విన్నాడుగా— ఆ ఆఫీసరు యేమన్నాడంటే—కులం సాంప్రదాయాల విషయంలో నీకున్న అభిప్రాయాలతో నేను యేకీభవించలేనన్నాడట!"

"అహా! కాలాతీతుడులా వున్నాడే!"

"అంతేకాదు నా ఆఫీసులో నాకొక్క వలసింది పని, నడవడిక! ఇద్దరూ బాగాపని చేసుకుంటున్నారు.. సద్యంగా మెసులు తున్నారు. వాళ్లిద్దరూ దొంగ తిరుగుళ్లు తిరగకుండా పెళ్లి చేసుకొని సుఖంగావుంటే నాకు సంతోషమే అన్నాడట!"

"ఆంతవరకు యెప్పుడు వచ్చిందో వుద్యోగం వెంటనే ఊడ్చించి వంటయిల్లు కదలనివ్వకుండా చెయ్యవలసింది! పాపం జగన్నాథం వుత్తి అమాయకుడు!"

"కూతుర్ని కట్టేస్తే అన్నీ వాడితో నాకేం పని అందట! వాణ్ణి పెళ్లిచేసుకోనని ప్రమాణంకూడా చేసిందట!"

"నమ్మాడూ ?!"

"నమ్మక యేం చేస్తాడోయ్—అదంటే పంచ ప్రాణాలే వాడికి—ఇంతకీ ఆ ఆఫీసరు ఏం చెప్పాడో పూర్తిగా విను..."

"వాడికింకా రాలేదుగా—యేమైనా..."

"పారపడుతున్నావ్. వాడు చాలా దండ శాసనుడట! వాడి చెల్లెలూ యెవరినో కట్టుకుంటా నంటే తల్లి దండ్రి కాదంటే తనే స్వయంగా పెళ్లి చేశాడట!

జగన్నాథం ఖుస్సుమంటే నీవన్నీ త్రేతా యుగంనాటి కబుర్లు—నెహ్రూలా, రాజాజీలకంటే నీవు తెలివైనవాడివా" అని అడిగాడట!

"వాడే ప్రోత్సాహంచేసి వుంటాడులే, లేక పోతే పిల్లకా ధైర్యం యెక్కడిదీ? అయినా అంత తక్కువ కులంవాడిని కట్టుకోవటం కమలకు భాగ్యం కాదుసుమా!"

"ప్రేమ గుడ్డిదిరా అబ్బాయ్..."

"ఇలాంటి వన్నీ జరగలేదు. తెగిపోలేదు పెటాకీ్సి ఆ ముసలాణ్ణి అందరి ఆడపిల్లలతో ష

గంగలో త్రోసినట్లు చేసింది! దానిసౌఖ్యం చూసుకుందిగానీ యీ కుటుంబం సర్వనాశనం చేస్తున్నానసైనా ఆలోచించిందా? పాపం! ఆ ముసలాడు పిచ్చివాడిలా వున్నాడు లే! మూడురోల్నుంచి తిండీ తిప్పలూ లేవట! కళ్లంట రక్తం కారుస్తున్నాడు! చూశాను—చాలా జాలి వేసింది!"

"నేను జగన్నాథం గురించి విచారించ లేనోయ్! కమలగురించే!"

"దానికేం? ఇద్దరి ఆర్జన—హాయిగా వుంటారు! వాడూ డబ్బుకు ఆశపడే దీన్ని చేసుకున్నాడు లే!"

"ఈ క్రొత్త ఉల్లాసం యెంతకాలం వుంటుంది? ఏదో పేచీ యెక్కడో - వస్తే ఆఫీసులోనే! రావమ్మ దాని యిష్టానుసారం తిరగనిస్తాడనా? ఖర్చు పెట్టనిస్తాడనా? అప్పుడు రెండు వేపులా చెడుతుంది!"

ఇలా రకరకాల చర్చలు కొనసాగి చివరకు ఆ పదిహేను రోజుల్లోనే వూర్లో పుకారు బయలుదేరింది! వాళ్ళిద్దరూ యెప్పుడూ దెబ్బలాడుకుంటూ వుంటారని! ఏవో కేసులు వేసుకోవటం స్వయంగా మేం విన్నాం అన్నారు కొందరు! ఇద్దరూ ఆఫీసుకు వెళ్తే గాని యెడమొఖం పెడమొఖంగా వుంది—మీ రెవరూ గమనించలేదూ? అసలు చెయ్యికూడా మొన్నరాత్రి చేసుకున్నాడట లే!

ఆ ముసలాడి వుసురు తగలదా మరి అన్నారు కొందరు. రామ రామ పీనుగై పోయాడే—కడుపాకలి—గుండెమంట! చుట్టాలు పరామర్శకు వచ్చినట్లు వచ్చి వాలుగ వర్ణిస్తున్నారు. చూడటానికి వచ్చిన వాళ్ళు ఆ క్రొత్త దంపతులలో [illegible] దుమారం వర్ణిస్తూ చూసినట్లే చెప్పుకొస్తున్నారు—జగన్నాథం మనసు తన స్వాధీనంనుంచి యే నిముషంలో తప్పుకు పోతుందో!

ఇలా వుంటుండగా పోస్టు మేన్ తలుపు తట్టాడు. నూరు రూపాయలు మనియార్డరు—ఇంట్లో వుండేటప్పుడు జీతం అందుకున్నవాడు తండ్రి చేతికి అంతే యిచ్చేది!

ఆ మనియార్డరు ఫారము చేతిపెట్టగానే జగన్నాథం మెల్లగా "నూరు రూపాయలు" అన్నాడు. వెనువెంటనే క్రోధంతో "నూరు రూపాయలు!" అని పెద్ద కేక వేశాడు. ఇద్దరు కూతుర్లూ పెరటినుంచి పరుగెత్తుకొచ్చారు.

"అది నా కూతురా? నన్ను తిన్న బ్రహ్మరాక్షసి! నన్ను ద్రోహం చేసింది...ఛీ ఛీ ఆ పాపిష్ఠి దాని ఆర్జన నాకొద్దు"

ఆ ఫారం విసరికొడుతూ కూతుర్ల వేపు తిరిగి "ఏమమ్మా నేనేం లోటు చేశాను? నా ప్రయత్నాలలో నేను లేనా? ఏమూల చూసినా నాగురించే? నా పరువు మర్యాదలూ తీసి నన్ను గొయ్యలో పాతిందిమ్మా..." వెంటనే వలవల యేడ్చేస్తూ "పదండి! ముగ్గురం పోయి ఏ నుయ్యో గొయ్యో చూసుకుందాం!

అలా క్రిందను కూలబడిపోయాడు. మూర్ఛ పొందినట్లయిపోయాడు జగన్నాథం! తెలివి వచ్చాక కలం తీశాడు. "ఓ పాతకీ! రాక్షసీ! పిశాచీ!

నీవు విద్యల సరస్వతి వనుకున్నాను. వీణాపాణిని చేశాను. అది చచ్చిపోయాక మిమ్మల్ని నమ్ముకొని బ్రతికాను. నానా చాకిరీ చేసైనా మిమ్మల్నో యింటివాళ్ళని చేస్తానని నోరు కట్టాను, పరువు నిలుపుకున్నాను. నా ఆశలన్నీ గంగలో కలిపావే! నన్ను వెనుకనుంచి బాకుతో పొడిచావే! నన్ను నమ్మించి ద్రోహం చేశావే! నన్ను చేసినట్లే వాడినీ యెప్పుడో ద్రోహం చేస్తావ్? చివరకు బజారులోపడి నాశనమయిపోతావ్..."

"అమ్మాయిల్లా—యిప్పుడే—వెళ్ళి యీ వుత్తరం డబ్బాలో వేసీ!" కోపంతో వణికిపోతున్నాడు... రెండో కూతురు వేస్తుందో లేదో అని డాబా యెక్కి మన్యలో నిల్చొని చూస్తున్నాడు. ఆమె వెయ్యటం చూశాక కొంత మనసు తృప్తిపడింది. క్రిందికి దిగి మంచంమీద వ్రాలిపోయాడు. దుఃఖం ముంచుకొస్తోంది. గట్టిగా యేడవాలనుకున్నాడు. కానీ కళ్ళల్లో నీరు తిరుగుతున్న యిద్దరి కూతుర్ల వేపు చూశాడు. వాళ్ల ముఖాల్లో నెత్తురు చుక్కలు లేవు. వాళ్ల వేపు చూస్తుంటే కడుపు మరీ దహించుకుపోతోంది! "దాని సౌఖ్యం అది చూసుకుంది? పిల్లగతేం గానూ? ఈ మచ్చ అది చచ్చేవరకూ వుంటుంది! వీళ్ళనెలా ఒక యింటి వాళ్ళనిచేస్తాను? అప్పుడే యెందరో వ్రేళ్ళు చూపిస్తున్నారే? కట్నాలకి డబ్బు లేక యిన్నాళ్ళూ కుమిలిపోతే యిప్పుడు యింటి గుమ్మం యెవరు త్రొక్కుతారు! డబ్బు కొల్లలుగా చల్లడానికి నాకెక్కడిది? ఆయ్యో పిచ్చివాడే యీ జగన్నాథం! పిల్ల పెళ్ళిళ్ల గురించా ఆలోచిస్తున్నాడు? ఈ యేకై

రూపాయల పింఛనీతో వీళ్ళకి కడుపునిండా తిండీ, ఒంటికి బట్టయినా యివ్వగలడా? పిల్ల చదువుల సంగతేసరి! ఎందుకురా యిలాంటి హీనమైన పుటుక పుట్టావ్. ఒరే జగన్నాథం—చచ్చిపోరా...యీ గొడవంతా తగ్గిపోయిగా వెళ్ళిపోతావ్!"

ఇలా తనని తే నేదూషించుకున్నాడు. చచ్చిపోదామనుకున్నాడు. మళ్లీ కూతుళ్లగతేం అవుతుందని ఆలోచనలో పడ్డాడు. తను చచ్చిపోతే వాళ్లను చేరదీసే వాళ్లెవరూ వుండరు. ఆకలితో చచ్చిపోలేరు. వాళ్లు కున్నదంతా ఒక్కటే—యౌవనం! అది కడుపు కోసం నానా దుర్మార్గులకు అమ్ముకోవాలి! లోకం అంతా వేలెత్తి చూపిస్తుంది—ఫలానా సంప్రదాయ కుటుంబీకుడు జగన్నాథం కూతుళ్లు వీళ్ళు! వాడు వురిపోసుక చచ్చాడు! కాని వీళ్లని బజారులో విడిచిపెట్టాడు. అప్పటి పరిస్థితులు వూహించగా ఒళ్లంతా కంపించసాగింది. ఇంతకంటే మరీ అధ్వాన్నం! చచ్చిపోను బాబో అనుకున్నాడు. వీళ్ల కోసమైనా నేను బ్రతికుండాలి...తప్పదు...తప్పదనుకున్నాడు.

తను వ్రాసిన వుత్తరానికి కూతురు దగ్గరనుంచి జవాబు వచ్చింది:

"మహారాజశ్రీ నాన్నగారికి నమస్కారములు:—

మీ ఉత్తరం చేరింది. మీబాధ అర్థం చేసుకున్నాను. సానుభూతి చూపించటం తప్పించి యింకేం చెయ్యగలను? లోకంలో యే తండ్రీ యే కూతురినీ పెంచనంత గారాబంతో పెంచారు. మీమాట ప్రతీ చిన్న విషయంలోనూ విన్నానుకానీ యీ ఒక్క విషయంలో నే స్వతంత్రించినందుకు క్షమించండి!.

నా సాహసానికి యీవూళ్లో నే కాదు, పొరుగూర్లలోవున్న గంపెడు చుట్టాలు దాడి జరుపుతున్నారు. మీకు చాలా తలవంపు తెచ్చేమాటలు వినుర్తున్నారు. కానీ నా పరిస్థితి కొంత చెప్పుకోనీయండి:—

మీకు తెలియక పోవచ్చు—ఉద్యోగంలో చేరిన దగ్గరనుంచి సరిగ్గా నడిచినా—ఎవరితో మాటాడినా - చిన్న నవ్వునవ్వినా - నే నేంచేసినా యేదో అపాయం అయ్యింది - అపవాదులు లేచిపోయాయ్. అందరి నోటిలో నేనొక పతితనయ్యాను. ఇలాంటి పరిస్థితులలో మీరు కలలుగన్న అల్లుణ్ని మీరు సంపాదించటం దుర్లభం—దొరికినా అనుమానాలతో నా జీవితాన్ని నాశనంచేస్తాడు. ఈయన నా అసహాయ పరిస్థితిని గ్రహించారు. లోకంఅంతా దూషించటి చివరకు నా తోబుట్టువులు కూడా దూషించని సానుభూతి చూపించారు. ప్రవాహంలో కొట్టుకపోతున్న దానిని తన బంధువర్గం కాదన్నా సాహసించి ఒడ్డుకుతీశారు. అలాంటి నిర్మలుణ్ని, నిజాయితీపరుణ్ని, నే నెలా మోసంచేస్తాను? నేనూ మా అమ్మలాంటి ఆడపుట్టుక పుట్టాను. పాతికేళ్లు నిండినా మా అమ్మలా బొగ్యతి తీసుకోకుండా యెన్నాళ్లు వూరుకుంటాను? ఇది సాహసమనండీ యేమనండీ మీకు తప్పనితోస్తే క్షమించండి! కులంలో యేం వుంది. గుణంలో వుందిగానీ?....వారు చెప్పినట్లు మీ డబ్బు బ్యాంకులో వేస్తున్నా....

మీ అమ్మాయి—

జగన్నాథం "కులం యేవుంద"ని పళ్లు పటపట కొరికి వుత్తరం విసరికొట్టాడు. మళ్లా తలకొట్టుకుంటూ "ఎంతయెత్తునుంచి దిగజారి పోయాం దీన్నుంచి...!"

ఆవారం రోజుల్లోనే బ్రతుకుభారం అనిపించింది.

ఒక నెలరోజులకే బాగా చిక్కిపోయాడు. ఒకపూట కాఫీ మానేశాడు. ఇంకోపూట భోజనంకూడా సరిగ్గాలేదు. అయినా చిల్లర అప్పులవాళ్లు పీక్కుతింటున్నారు. బయటకు ముఖంచూపించడానికి సిగ్గేస్తోంది! బయటకు వెళ్లినా తనేం ఆర్జించగలడు? రిటయిరయ్యే సమయానికి కూతురు చెయ్యి కలిసొచ్చిందని వుబ్బి తబ్బిబ్బయ్యాడే—అలాంటిది యింతలో యింత ఘోరం చేస్తుందని తను కలలోనైనా అనుకోలేదు! పరధ్యానంగా వుండేటప్పుడు యిలా బాధపడే బదులు కూతురు దాచిన డబ్బు తలుపుకువచ్చేది. చప్పున మెలుకువ వచ్చినట్లయ్యేది?—అదా? పాతకి—దానిముఖం చూస్తానా యీజన్మలో... ఇలా కష్టాలు పడి ఆకలితో చిక్కి చచ్చిపోతానుగానీ ... ఒకడికి యెదరుగా చెయ్యిచాపను ... ఈ జగన్నాథం యెంత బ్రతుకు బ్రతికాడు! కానీ దిన దినక యుగంలావుంది—దిక్కుమాలిన బ్రతుకైపోయింది. అన్నివేపులా బాధే. —ఇలా తనెందుకు అప్పులవాళ్లచే అనిపించుకొని

కంఠంచే వేళ్లి చూపించుకొని బ్రతకాలి? ఎవరో అనుకుంటున్నారు, నా మతి చలించిందని! నిజంగా చలించిందా? ఏమో?

ఇలా జీవితంమీద రోతపుట్టే సమయంలో ఒక ముసలమ్మ — దగ్గిరిదుటమే వచ్చించుకొని వస్తూనే "ఒరే జగన్నాథం — విన్నావటరా నీ పెద్దకూతురు సంగతి!"

"అది నా కూతురా — నా కూతురు ఆనాడే పోయిందిలే!"

"కాదురా! వాడు మాంసం తెచ్చి వండమన్నాడట! కమలసంగతి మనకు తెలీదు — అలాంటివాటికి ఆమడదూరంలో వుండేది. వండనంటే పాపిష్ఠివాడు ఎముకలు విరగొట్టాడట! అవును మరి — విధి చెడి యీటివాడితో లేచిపోతే చచ్చేవరకూ డోలు వాయించమనదూ? దానిగతి అలాగేవచ్చింది! పాపం!!

రెండోకూతురు కలుగజేసుకొని "అక్క వెళ్లాక తను అలాంటివి తినటం మానేశాడట!"

జగన్నాథం కూతురుమీద ఖస్సుమన్నాడు. "దాని వూసుయెత్తరంటే యెటో పారిపోతాను..." ముసలమ్మ ఓదార్పు మాటలతో "అలాగంటే యెలాగరా! ఒక తుంబలో విత్తనం — ఐనా ఆ కమల నెందుకంటావ్?"

"దాన్ని అనక పై అమ్మకొడుకు వాడినెందుకంటానే దీనికి సాహసం లేకపోతే..."

"ఓరే జగన్నాథం యింకా నీకు చిన్నబుద్ధి పోలేదురా! ఎంతవందనంగా వుండేది పిల్ల! మాయా మర్మంలేని తల్లి! మీ వంశంలో లేని అందచందాలున్న పిల్ల! ఎంతకమ్మగా పాడేది! అదంటే నీకు పంచప్రాణాలే—ఎంత ఆలోచనలేని మనిషివయ్యావే!"

జగన్నాథం మనసులో కూతురి యీ మంచి గుణాలన్నీ ఒక్కసారి గిరగిరా తిరిగిపోయాయి. "ఈమె చెప్పేదానిలో అసత్యం యేమీ లేదు...... కానీ...అది నాకు నమ్మించి ద్రోహంచేసింది...... నన్ను ఖూనీచేసింది!" అనుకున్నాడు.

"అవునురా జగన్నాథం వాడేదో మోసం చెయ్యకపోతే...యీ పుత్తడిబొమ్మకి అంత సాహసంయేదీ? ఒకరోజు యిద్దరూ పోతుంటే కమలను పిల్చి మరీ వాణ్ణి చూశాను...పోనీ ఆఫీసరా? దీనికంటె హెచ్చుచదువుకున్నాడా? అందగాడా? ఏమీ లేదు—ఇందులో యేదో ప్రయోగం లేకపోతే యిలా జరుగుతుందని అనుకోను—యేమంటావ్? ఇప్పుడా దాని బతుక్కి, అన్నీ కట్టుబాట్లే—చివాట్లూ చీదరింపులూనూ? ఒక్కవాడూ పల్లెత్తిమాటాడడా? ఏంఖర్మవచ్చింది దానికి?"

జగన్నాథం మారుమాటాడలేదు. ఆమె వెళ్లిపోయినా ఆ పేమాటలు మనసులో పెనవేసుకుంటున్నాయి. ఎంత ప్రయత్నించినా ఆమె అన్నమాటలు మళ్ళీ మళ్ళీ మనసులో దొర్లుకపోతున్నాయి. చీకటి పడినా మనసు మహాసముద్రమైపోతోంది. అల్లునిమీద అంతర్గతంలోవున్న ద్వేషం రగుల్కొంది. అన్నం సహించలేదు. నిద్రపట్టటంలేదు. ఒక్కసారి దుఃఖం పెల్లుబికింది "యెంతబాధపడుతోందో?—ఇందులో యేదో మోసంలేకపోతే నాతల్లి యింత సాహసానికి ఒడిగట్టుకోదు! నా చేతులతో పెంచానే దానినుంచి నాకా తెలీదు?... నేను బ్రతికున్నానా? అసలు జగన్నాథం ఏనాడో చచ్చిపోయాడు......లేకపోతే యిన్నాళ్ళు దానిముఖం చూడకుండా యెలాగ బ్రతికాడు? నాతల్లిని యిలా వూరూపేరూ లేనికడజాతి వాడు కొట్టుకుతింటుంటే వింటూ వూరుకుంటున్నానా? "వలవల యేడ్చేశాడు. ఇప్పుడు అల్లుడు నల్లగా, కోరలతో రాక్షసుడిలా కనిపించాడు." అయినా నేను అల్లారుముద్దుగా పెంచిన నా కూతురిమీద చెయ్యివేయటానికి వీడికేం హక్కుంది? అసలు నా కూతుర్ని తాకడానికి వీడికేం విలువుంది? ఇలా దాని జీవితకాలం అవస్థలు పడవలసిందేనా? ఒక్కసారి తప్పుచేసిందని...అచ్చే నా కూతురు తప్పు చెయ్యలేదే—దాన్ని మందులు మాకులతో లోబరచుకున్నాడు—వీడి బంధంనించి విడిపించుకోలేదే..."

"ఒరే జగన్నాథం—నువ్విలాగా చిక్కి శల్యం అయిపోయావ్? ఇంకెంతకాలమూ బ్రతికేవ్...ఈ కొద్దికాలం బ్రతికి బాధపడటం తప్పించి ఇంకెవర్ని వుద్ధరిస్తావ్? నీ బంగారు తల్లికి బంధవిముక్తి చెయ్. యిదే నువ్వామెకు చేసిన మహోపకారం! లే...లే... యింకా ఆలోచిస్తావా? లే...లే..."

మనసులో మంటలు లేచాయ్. జగన్నాథం లేచాడు. తువ్వాలుతో ముసుగు వేసుకున్నాడు. మెల్లగా తలుపులు తీశాడు. రోడ్డంతా నిర్జనంగా వుంది. పౌరుషం సింహబలాన్ని తెప్పించింది. దిగువ పెద్ద అంగలు వేసుకుంటూ నడిచాడు. తను రక్షించడానికి ఉద్రిక్తుడై వూగుతున్నట్టు తలుపు దబదబా కొట్టాడు. తలుపు తీసిన అల్లుడు పంతో మంతో

"ఏరా! రండి:" అన్నాడు.

"నాన్నా..." అని కూతురు ఒక్క గంతు వేసింది.

మౌనంగా తలుపుగడియ వేసి అల్లుని వైపు పదునైన కత్తి చూపిస్తూ "వాతల్లినికాదు నిన్ను చంపడానికి ఆగు ఆగు!"

అల్లుడు ముందుకొద్దిగా జంకినా అతని ముఖం వైపు చూస్తూ ఒక్కసారి మొండి ధైర్యంతో "సరే! చంపండి" అంటూ ముందుకు వస్తుంటే కూతురు కెవ్వుమంటూ కేక వేసి తండ్రి కాళ్ళమీద పడిపోయింది. ఆ యెదరగావున్న ప్రశాంతమైన రెండు కళ్ళూ తన హృదయంలోనికి చూచి గిలిగింతలు పెట్టించాయ్. ఆ గంభీరత అతని చెయ్యిని గజగజలాడించింది. తడబడుతూ "చంపమంటున్నావ్... నీకు... నీకు... భయం లేదూ?"

"లేదు..."

నిల్చున్న కళ్ళు రెప్పలు పడలేదు. అలా ముఖం వైపు చూస్తూనే కత్తి క్రింద పడవేశాడు. కూతురు దబ్బున లేస్తూ "మానాన్న మా మంచివాన్న" అతను పట్టుకొని వెక్కి వెక్కి యేడవసాగాడు. కూతురు యేడుస్తుంటే కళ్ళు తుడుస్తూ.

"ఖూనీకోరునమ్మా...... నేనే తక్కువ జాతి వాణ్ణి...చాలా అదృష్టవంతురాలివి!"







# రఘుదేవనరేంద్రుని యోరుగంటి శాసనము

శ్రీ కె. హెచ్. వి. శర్మ

ఈ సంవత్సర మాదిని శిలాశాసన సంగ్రహణార్థము నేను వరంగల్లు ప్రాంతమునఁ దిరుగుచుండి ఓరుగంటి కోట పశ్చిమద్వారమున కిఱుప్రక్కలఁ జెక్కఁబడి యీ శాసనము కాన్పింప దాని ప్రతిబింబములను దీయించి తెచ్చితిని. ఎండవానల దెబ్బలకు గురియై శాసనాక్షరములు కొంతభాగము చెరగిపోయి శాసనము పూర్తిగ చదువ వీలుగానుండదు. కాని ఆంధ్రదేశ చరిత్రకు ముఖ్యముగ గజపతుల వంశక్రమ నిర్ధారణమున కత్యంతోపయుక్త మగుటచే దీనిని ప్రకటించుట యావశ్యకమని తలంచితిని.

రాజమహేంద్రవర, కొండవీటి రెడ్డి రాజ్యములు రెండును పరస్పర కలహములచే క్రీ. శ. 1428 ప్రాంతముల నే యంతరించి విజయనగర రాజగు రెండవ దేవరాయల వశమైనవి. ఉత్కలదేశపు రాజులగు గజపతులుకూడ వానిని కబళింపఁ జూచుచుండిరి. నూతనముగా రాజ్యాభిషిక్తుడైన సూర్యవంశ క్షత్రియుడగు కపిలేశ్వర గజపతి తన అధికారమును నిలవేర్చికొనెను. పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకాలోని పెనుగొండ పెద్ద నొక శాసనములో[1] కపిలేశ్వర గజపతి ఆ దేశమును క్రీ॥ శ॥ 1448 ప్రాంతమున నే పాలించుచున్నట్లు గలదు. మాదలాపంజీ,[2] జగన్నాథ కైఫీయతులను[3] బట్టి కూడ ఆ విషయమే స్పష్టమగుచున్నది. తాను జయించిన యాంధ్రదేశమును పాలించుటకుగాను నాతడు తన వంశీయులనే ప్రతినిధులుగా నియమించెను. ప్రస్తుత శాసనములోని రఘుదేవ నరేంద్రు డట్టివారిలో నొకడు.

శ్రీ డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు అంబీర దేవుని యోరుగంటి శాసనమును పరిష్కరించు నప్పుడు[4] ప్రప్రథమమున నీ శాసనపు ఉనికిని గూర్చి మెకంజిదొరగారి వ్రాతప్రతులలో 15.4.5 (P-106) నంబరుగా గలదని చెప్పిరి. తరువాత యువసంవత్సర జ్యేష్ఠమాస భారతిలో[5] శ్రీ గొడవర్తి రామదాసుగారీ వ్యాసముపై వ్యాఖ్యానము చేయుచు మెకంజిమాన్యుస్క్రిప్టులలో వ్రాసియున్న ప్రస్తుత శాసనము నింతవఱకు శాసనపరిశోధక సంఘమువారుగాని, తదితరులుగాని ఓరుగంటికోటలో కనిపెట్టలేదనియు "మెకంజీదొరగారు వ్రాసిన వ్రాతలు జనులు నుడివిన వాక్కులేగాని ప్రమాణ సందిష్టములు గావు. అట్టి వాఙ్మూలములను ప్రమాణములుగా భావింపవచ్చునా? మరియు నందులోఁ జెప్పిన దశమి శుక్రవారము లెక్కకు సరిపోద"ని యాక్షేపించుటచే గూడ నిది ప్రకటింప వలసినదాయెను.

మెకంజీదొరగారి వ్రాతల నాధారముగ నోరుగంటి రాతికోట పూర్వ పశ్చిమ ద్వారములకు గజపతుల శిలాశాసనములు రెండు గలవనుట సుస్పష్టము. అందు మొదటిది అంబీర (కుమారహంవీర) మహాపాత్రునిది భారతిలోను[4] దక్షిణ హిందూదేశ శాసన సంపుటమునందు,[6] తెలంగాణా శాసనములందు[7] గూడ ప్రకటింపబడినది. రెండవది ప్రస్తుతము ప్రకటింపబడు రఘుదేవ నరేంద్రునిది.

## శాసన స్వరూపము

ఈ శాసనము ఓరుగంటికోట పశ్చిమద్వారమునకు కుడి, యెడమల కుమారారదుల పొడవునను,

1. Mackenzie Manuscripts No. 15·4·4.
2. 'మాదలాపంజీ' edited by A. B. Mahanti, Cuttack Pages 44, 46.
3. Further sources of Vijayanagara History Vol II pages 83—85. (By Prof. K. A. N. Sastry and Dr. N. Venkataramanayya.)
4. భారతి సంపుటము 12. మొదటి భాగము, పేజీలు 426-432.
5. డిటో ,, ,, పేజీలు 851-855.
6. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 7. No 733 పేజి.
7. తెలంగాణా శాసనములు (ఇతర శాసనములు No. 1)- పేజి 155.

రెండువైపులనెడల్పునను చెక్కబడి మొత్తము 18 పంక్తులు గల్గియున్నది. శాసనలిపి అంబీరకేవుని శాసనలిపినే పోలియున్నది. విశేషమేమన 'అ' యను అక్షరము విచిత్రముగ 'క' విసర్గను బోలియున్నది. 'బో'కూడ ప్రస్తుత రూపముగాక కొంచెము భేదముగ గలదు. 'శ'కారము అచ్చు అక్షరములలోని 'క'వలె నున్నది.

భాష ఒరియాతో కూడిన సంస్కృతగద్య. తెలుగులో షష్ఠీ విభక్తి ప్రత్యయము 'యొక్క'కి బదులుగా ఒరియాలో "రాయాంకర పుత్ర," "దేవాంకర పుత్ర" అని చెప్పబడినది. "కృతి సమరోముఖో జేక, అష్టాబింశతి" అను నవికూడ గమనించదగినవి. శాసనము తుదిన 'సస్వస్త సహితస్య జీవదాన థిలా' అని గలదు. 'థిలా' అనగా ఒరియాలో 'ఉండెను' అని యర్థము. కాని సందర్భమును బట్టి యిచ్చట జీవదానము 'చేసెను' లేక 'ఇచ్చెను' అని చెప్పవలెను. రాజులందరికి 'మల్లినాథ దేవణ మంగళ చండీ చరణ శరణు' అని కపిలేశ్వరునకు పురుషోత్తమ పుత్ర, దుర్గాపుత్ర అనియు రఘుదేవునకు జగన్నాథ వరప్రసాద, దుర్గావరపుత్ర అను విశేషణములు గలవు.

## శాసనకాలము

శాసనకాలమును దెల్పుచు మొదట "విష్ణురాజ్య ప్రవర్థమానస్య!" అని యుండుటచే పురుషోత్తమ జగన్నాథ భక్తులు, వైష్ణవమతావలంబకులగు గజపతుల రాజ్య ప్రారంభమును సూచించుచున్నదనవచ్చును. సంకల్పమునందువలె విపులముగ దీనికాలము చెప్పబడి కల్యబ్దములు 4561 (వర్తమాన) ప్రమాథిసంవత్సర మాఘ శుద్ధపంచమి శుక్రవారము మృగశిరా నక్షత్రమని గలదు. శకాబ్దమిందుదాహరింపబడలేదు, కాని పై కల్యబ్దములనుబట్టి యీ ప్రమాథి సంవత్సరము శకాబ్దము 1381 నకు సరిపోవును. ఈ వివరములన్నియు సరిగా క్రీ॥ శ॥ 1460 ఫిబ్రవరి మొదటి తారీఖునకు సరిపోవుచున్నవి8. శుక్రవారము నారంభమైన పంచమితిథి, మృగశిరా నక్షత్రములు శనివారము .24, .22 ఘడియలవఱకు వరుసగా మిగులున్నవి. దీని కాలమునుగూర్చి పంచమి శుక్రవారము లెక్కకు సరిపోదని శ్రీ రామదాసుగారు వ్రాసినదికూడ పొరపాటే.

ఇట్లీ శాసనము శుక్రవారము, అంబీరకేవుని శాసనము మఱుదటిదినము శనివారము (వడ్డివారము)9 చెక్కబడినవి.

## చరిత్రాంశములు

ఓరుగల్లుకోటను గజపతులు ముట్టడించి స్వాధీనపరచుకొనుట దీని సారాంశము. ఆ గజపతుల వంశక్రమమిందు గలదు. జాగేశ్వరునకు పుత్రుడగు కపిలేశ్వరుని తమ్ముడగు పరశురాముని తనయుడు వీరభద్ర రఘుదేవ నరేంద్రుడు ఓరుగంటి కోటను జయించెనని యున్నది.

ఈ రఘుదేవనరేంద్రు డెవ్వటివాడు? ఇందుఁ జెక్కబడిన వంశక్రమ మెంతవఱకు సత్యమైనదను ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది.

ఈమధ్య నూతనముగ రెండు తామ్రశాసనములు 10 రాజమహేంద్రవరమున దొరకినవి. ఒకటి యాంధ్ర చారిత్రకసంఘ కార్యదర్శులగు శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారివద్దను, రెండవది శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారివద్దను గలవు. రెండును రఘుదేవనరేంద్రుని నివియే. మొదటిది ఆరురేకులుగల్గిన సంపూర్ణశాసనము. రెండవది యొకరేకు మాత్రమేగల యసంపూర్ణమైనది. మొదటిదానిని శ్రీ సుబ్బారావుగారు తమ ఆంధ్ర చారిత్రక సంఘ పత్రిక సంచికలో ప్రకటించినారు. 11 శాసనలిపి తెలుగు, భాష సంస్కృతశ్లోకములు. చారిత్రక విషయము లేమియుఁ దెల్పక, లేఖకుడు శాసనమును తప్పులతడకగా లిఖించెనని మాత్రము తెల్పి, తాము సరిగా నర్థము చేసుకొనని దోషములను గూడ వానికే యంటగట్టి అందరికిఁ దెలియవలెనను సదుద్దేశ్య

8. L. D. Swamikannu pillai, Indian Ephemeris Vol V page 122.

9. వడ్డివారమునుగూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి వ్యాసము, భారతి సంపుటము 18 రెండవ భాగము పేజీలు 95-98.

10. Copper Plate No. 4 and 5 of 1955-56 (Annual Reports on Epigraphy) and 'Indian Archaeology' a Review 1955-56. page 31.

11. Journal of the Andhra Historical Research Society Vol XXIII (1954-56) pages 163—172.

ములో రోమనులిపిలో రోకలిపాటగా ప్రకటించినారు. తెలుగు లిపిలో గలదుగాన తెలుగులో గాని, భాష సంస్కృతము గాన నాగరిలిపిలో గాని ప్రకటించిన అధమము కొంతమందికైన నంబలి విషయము తెలిసెడిది. ప్రస్తుత శాసనములో చెప్పబడిన వంశక్రమమే దీనిలో గూడగలదు. కాని శ్రీ సుబ్బారావుగారు వారియుద్దేశ్య ప్రకారము దీనిని కుమార హంవీర మహాపాత్రుని కుమారుడగు కపిలేశ్వరునితో ప్రారంభమునఁ దెల్పి క్రిందివిధమున పట్టిక జూపినారు.

విశుద్ధవృత్తైః కపిలేశ్వరో౽భూ
త్స్వాన్వయకో నాయక మాలికరత్నమ్. 1
[15]జాగేశ్వర స్తత్తనయో మహాశ్రా
రఘూత్తరివారో భువనైక శూరః
అభూ దభూద్వైరి భువాం భయానాం
కీర్తి ప్రతాపద్వయ భూర్గజాప్త్యైః. 2
[16]తస్యాత్మజ స్తనయాః ప్రసిద్ధ జిన యా
జాగేశ్వరస్యాభిధవ్
వీర ధృతి కీర్తయః కుశలమోల్లాసి
ప్రతాప శ్రియః

కపిలేశ్వరుడు II.
(హంవీరుని పుత్రుడు)
|
జాగేశ్వరుడు
|
బలరామ — వీరశ్రీ కపిలేశ్వర III — పరశురామ
వీరశ్రీ కపిలేశ్వర III → కుమారై కుమారుడు.
పరశురామ → కుమార రఘు దేవ (కపిలేశ్వర II దత్తుడు)

శ్రీ సుబ్బారావుగారీ కుమార హంవీర మహాపాత్రుడెవరు? ఏకాలము వాడనిగాని, ఈ శాసనకాల మెద్దియనిగాని యోచించలేదు. సుప్రసిద్ధ గజపతి రాజ్యస్థాపకుడగు కపిలేశ్వరుని పుత్రుడీ హంవీర మహాపాత్రుడుగదా! చిఱ్ఱవోలి తామ్రశాసనము[12]బట్టి తండ్రియగు కపిలేశ్వరుని పక్షమున నాతడు కృష్ణాతీరమును క్రీ. శ. 1416 ప్రాంతమున పాలించుచున్నట్లు సుస్పష్టము. మరియు నా ప్రాంతమున నాతని శాసనములుగూడ పెక్కు గలవు. [13]ఓరుగంటి కోటలో కుమార హంవీర మహాపాత్ర, రఘుదేవ నరేంద్రుల శాసనములు రెండును యొక కాలమున చే గలవే! దీనిని బట్టి కుమార హంవీర మహాపాత్ర, రఘుదేవనరేంద్రులు సమకాలికులని స్పష్టము కాగా శ్రీ సుబ్బారావుగారీ రఘుదేవనరేంద్రుని, హంవీరుని మనుమని మనుమనిగా పేర్కొనుట యెంతమాత్రము సమంజసము కాదు. నిజమున కానాటికి గజపతి పాలనమే యాంధ్రదేశమున నంతరించినది.

ఈ సందర్భమున మా ఆఫీసులోని ఈ శాసన ప్రతిబింబములను[14]బట్టి వారి వంశావళిని దెల్పు శ్లోకముల నిచ్చుట నుదాహరించి గజపతుల చరిత్ర క్లుప్తముగ తెల్పెదను.

"[15]తస్మాన్నర్క సోమాన్వయ భూమిపాల
వంశాగ్రజానాం నృపసన్మణీనామ్

తత్రాదౌ బలరామ ఇత్యుదయ
భూరన్వర్థ నామ్నా భిత
ఖడ్గ స్తంభిత శూర వైరి నికరః
కీర్తి ప్రతాపాశ్రయః. 3
[17]అసమ సమర సంపత్కంపితారి స్తదాయం
నిజ జనక సమేతో యుద్ధ సంబద్ధ వాహః
రణ భువి విజితారి స్త్యక్త దేహో విభిన్న
ద్యుమణి రగమ దిష్ట్య స్వర్వధూనాం
కుచాగ్రమ్. 4
[16]వీరశ్రీ కపిలేశ్వర స్తదనుజః
కీర్తి ప్రతాప ద్వయీ

---

12. భారతి సంపుటము 18, రెండవభాగము. పేజీలు 515-536.

13. Annual Reports on Epigraphy No 148 and 157 of 1913 and 833 of 1922 (See also South Indian Inscriptions Vol X No.s. 728 and 740.)

14. Copper Plate No. 4 of 1955—56 Office of the Govt. Epigraphist for India.)

15. ఉపజాతివృత్తము.

16. శార్దూల విక్రీడితము.

17. మాలభారిణీ.

శ్రీ విశ్వాళిత చక్రవాళ చరమో
 ద్దామాంగకారో భవత్
శౌర్యాపాదిత దంతిరాజ విధినో
 భూమండలాఖండలో
లీలా స్వీకృత దిగ్జయార్జిత మహీ
 పాలాఖిల శ్రీ ధరః. 5

18 తస్యానుజః పరశురామ ఇతి ప్రసిద్ధో
 నామ్నా పదేన హరిచందన వీర సాక్షాత్
యం ప్రాప్య యాని విబుధాః పరిపూర్ణ కామాః
 సంప్రార్థి తార్థ ఫలదం హరిదాప్త కీర్తిమ్ 6

19 ఆభివ విమలో గుణౌఘైః ఉదితః
 కీర్త్యా చ పరశురామ విభోః
ఉదయగిరేః శీతరుచీ రఘు —
 దేవ కుమా రవీరసింహో యమ్. 7

20 అమూతి సుత మంగనాకుల మల్లికా మల్లికా
ప్రభూత విమ మల్లికా ప్రసవ మిష్ట గంధం వ్యధాత్

గజపతి రాజ్యస్థాపకుడగు కపిలేశ్వరుని తండ్రి, తాతలు వారి చరిత్ర తెలియ కింతవఱకు నేక పుక్కిటి పురాణములు కల్పింపబడినవి. గత్యంతరము లేక చరిత్రలోనికి గూడ నివియే ప్రాకినవి. పై శ్లోకములలో నా విషయమంతయు చక్కగ వర్ణింపబడుటచే వానినిటఁ జేర్పవలసివచ్చెను.

కపిలేశ్వరుడు:—సూర్య సోమాన్వయ సంభూతుడు. నాయకశ్రేష్ఠుడు. విశుద్ధ చరిత్రుడు. నాయకశ్రేష్ఠుడని చెప్పియుండుటచే నీతడు తూర్పు గాంగవంశ రాజులవద్ద సైన్యాధ్యక్షుడుగ నుండవలయును. శ్రీకూర్మమునందలి రెండు శాసనములు21 క్రీ. శ. 1353 ప్రాంతమున కళింగదేశపు నాయకులను గూర్చి తెల్పుచున్నవి. గాన నీతడు వారిలో నొకడై యుండవచ్చును.

జాగేశ్వరుడు:—పై కపిలేశ్వరుని పుత్రుడు. మహాశూరుడు. మంచి కీర్తి ప్రతాపములు గలవాడు. గజసమూహముల కధిపతి. గజపతి రాజ్యస్థాపకుడగు కపిలేశ్వరుని తండ్రి. ఈతడే మోరుగంటి శాసనమున గూడ చెప్పబడినాడు. సింహాచలమువద్ద నొక శాసనములో22 క్రీ. శ. 1418 ప్రాంతమున తూర్పు గాంగవంశజుడగు నాలవ భానుదేవుని కాలమున నొక జాగేశ్వర మహాసేనాపతి పేర్కొనబడినాడు. ఈతడే పై జాగేశ్వరుడని నా యూహ.

బలరాముడు:—జాగేశ్వరుని జ్యేష్ఠ పుత్రుడు. సాత్త్విక నామధేయుడు. మంచి బల, పరాక్రమములు గలవాడు. తండ్రికనేక యుద్ధములలో సాయమొనర్చుచు తుదకాతనితోఁ గూడ యుద్ధములో మరణించి వీర స్వర్గము బొందెను.

కపిలేశ్వరుడు:—జాగేశ్వరుని ద్వితీయ పుత్రుడు, బలరాముని తమ్ముడు. తాత పేరింటివాడు ఉత్కల దేశపు సూర్యవంశ గజపతి రాజ్యస్థాపకుడీతడే. గౌడ, ఆంధ్ర, కర్ణాట, మాల్వ దేశములను జయించి23 దక్షిణాపథమున కంతకు సార్వభౌముడాయెను.

రాజ్యాభిషేకమునకుఁ బూర్వమీతని చరిత్రయింత వఱకు కట్టుకథలతోఁ గూడి యెంతమాత్రము నమ్ముటకు వీలుగాకున్నది. ఈతనిని గూర్చి బృహద్వ్యాసములు24 వ్రాసిన శ్రీ గొడవర్తి రామదాసుగారైన నా విషయమేమియు చెప్పరైరి. ఇక మాదలా పంజి యను గ్రంథములో25 గాంగవంశమున కడపటి రాజగు మత్తిభానుడు పుత్రులు లేక పురుషోత్తమ జగన్నాథుని వేడగా, రాత్రి కలలో నాతడు సాక్షాత్కరించి విమలాలయము కడ మరుసటి దినము పసుల కాపరి యొకడు కాన్పించు ననియు, నాతనినే వారసునిగా గైకొనవలయునని యానతిచ్చెనట! అట్లే మరుచటిదినము రాజా కపిలుడను వాని నక్కడ గాంచి దత్తునిగా స్వీకరించి సింహా

18. వసంత తిలకా.

19. గీతి.

20. పృథ్వీ ( రెండు పాదములు మాత్రమే )

21 దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 5. నం. 1204. 1205.

22 డిటో ,, సంపుటము 6 నం॥ 866.

23 "హంపాకంపము గాత్తి దాధిక ధరా ధారాచ భారాతురద్వారా కల్బరిగా విముక్తతరగా ఢిల్లీ చ ఖిల్లీ కృతా"—(వెలిగలని, చిట్ట్రవోలి తామ్ర శాసనము).

24. భారతి సంపుటము 12. భాగము రెండు. పేజీలు 763—773.

25. మాదలాపంజి Edited by A. B. Mahanti, Cuttack, pages 44—46.

సన మాతనికి నప్పజెప్పెనట! కటక రాజవంశావళి, జగన్నాథ కైఫీయతు26 లందుకూడ నిట్లే చెప్పబడినది.

గంగవంశాను చరిత్రలో27 మర్తి భానుడు దిగ్విజయార్థ మరిగినపుడు, కటక రాజధానిలోని మంత్రులందరు కూడి కపిలేశ్వరు నభిషిక్తుని గావించినట్లు గలదు ఇది కొంతవఱకు సత్యసన్నిహితముగ నున్నది.

పై శాసనములో వర్ణించబడిన కపిలేశ్వరునివంశావళిని జూడ వాని తాత, తండ్రి, సోదరు లనేక యుద్ధములలో పాల్గొని విజయములను గాంచి వీరస్వర్గము గాంచిరనుట విదితము. కాగా మాదలాపంజి మొదలగు గ్రంథములలో చెప్పబడిన ట్లితడెంతమాత్రము సామాన్య పసులకాపరి కాజాలడు. కేవల భగవదనుగ్రహమువలన రాజాయె ననుట యంతకంటె సరికాదు. సరియైన ఆధారములు లేనపుడు సుప్రసిద్ధ పురుషులనుగూర్చి పుక్కిటి పురాణము లిటువంటివెన్నియైనఁ గల్పించుట మన దేశాచారము. అన్నియు దెలిసిన మన చరిత్రకారులు కూడ కొన్ని సమయముల వీని నే నమ్మి తమ గ్రంథములలో నెక్కించుటకూడ గలదు.

ఇక నీ కపిలేశ్వరుడు సింహాసనము నెట్లధిష్ఠించె ననునది ప్రశ్న. వీని తండ్రి, తాతలనుబట్టి మొదటి నుండియు వీరిది క్షత్రియవంశముగ నే కన్పట్టుచున్నది. వారు తూర్పు గాంగవంశపు రాజులకు మొదటి సైన్యాధ్యక్షులుగనుండి తరువాత వారి సామంతులై చిన్న రాజ్యమునకు ప్రభువులుగ నుండవలెను. కనుకనే గాంగ రాజగు భానుదేవుని పరిపాలనము నచ్చని ప్రజలాతడు దిగ్విజయార్థ మరిగినపుడు కపిలేశ్వరుని రాజుగా నంగీకరించి యభిషిక్తునిఁజేసి యుండవలెను. లేదా యీ శాసనములో "శౌర్యసాధిత దంతిరాజవిభవో భూమండలాఖండలః"—అని చెప్పబడుటచేత నే స్వతంత్రించి తన బలపరాక్రమములచే భానుదేవుని సింహాసనమునుండి త్రోసిపుచ్చి రాజ్యమును లాగికొనియుండెననుట సమంజసము.

కపిలేశ్వరుని తల్లిదండ్రులను గూర్చి యాతని జెలిగలని తామ్రశాసనము28 బట్టి కూడ తెలియును. దానిలో "వెలిగలని నామకమదాగ్రామం స్వ పిత్రాఖ్యయా" యని గలదు. ఇచ్చట "పిత్రాఖ్యయా" యనునది కేవలము తండ్రియని గాక "మాతా చ పితా చ మాతా పితరౌ, పితరౌ"—గాన తల్లిదండ్రుల పేరని చెప్పవలయును. ఈ విషయము మా శాసనపు తెలుగు, ఒరియా భాగములనుబట్టి స్పష్టము, రెంట్లను "జాగేశ్వరపురము, విల్లమాంబాపురము" అని గలదు. దీనిని బట్టి కపిలేశ్వరుని తల్లి విల్లమాంబయని కూడ తెలియును. ప్రస్తుతపు ఓరుగంటి శాసనమున చెప్పబడిన జాగేశ్వర, కపిలేశ్వరులు వీరలే. చిఱువ్రోలి,29 అనంతవర 30 తామ్రశాసనములనుబట్టి యీ కపిలేశ్వరునకు హంవీర, పురుషోత్తమ గజపతులను నిరువురు కుమారులు గలరు. చాటుపద్యములను బట్టి తిరుమలప్ప యనువాత డొకడు కూడ నుండినట్లుఁ దెలియును.

పరశురామ హరిచందన :— పై కపిలేశ్వరుని తమ్ముడు. గొప్పదాత. ఈతని భార్య మల్లిక. ప్రస్తుత శాసనమున చెప్పబడిన పరశురాము డీతడే.

రాముడు :— శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు గారివద్దనున్న యసంపూర్ణ తామ్రశాసనములో 31 పై పరశురామ హరిచందనుని తమ్ముడుగా రాముడను వాతడొకడు గలడు.

"తస్యానుజో రామ ఇతి ప్రతీతో
రామత్రియం యో గుణ వైభవైః స్వైః"—

పై రఘుదేవపుర తామ్రశాసనమునందు గాని, ప్రస్తుతపు ఓరుగంటి శాసనమునందు గాని యీతని ప్రసక్తి గానరాదు.

రఘుదేవ నరేంద్రుడు : పరశురామ హరిచందనునికి మల్లికయందు జన్మించెను. మహాపరాక్రమవంతుడు. పెదతండ్రియగు కపిలేశ్వరుని దక్షిణదేశదిగ్విజయములలో వానికి సాయమొనర్చిన, మెప్పించి రాజమహేంద్రవరరాజ్యమున కంతకు పాలకుడాయెను. శ్రీ సుబ్బారావుగారు "పుత్రీకృతో మహిమ్నా కపిలేశ్వర దండిరాజ సింహేన" యని యుండుటచే గాబోలు రఘుదేవుని పెదతండ్రియగు కపిలేశ్వరునికి దత్తత చేసినారు! హంవీర మహాపాత్ర, పురుషోత్తమ గజపతి పుత్రులుండ ఆ కపిలేశ్వరుని కితనిని దత్తత

26. "కటక రాజవంశావళి మరియు జగన్నాథ కైఫీయతు" Published in further Sources of Vijayanagara History by Prof. K. A. N. Sastry and Dr. N.Venkataramanayya pages 83, 84 and 85.

27. కళింగదేశ చరిత్ర పేజి 647.

28. Copper Plate No. 17 of 1934—35.

29. భారతి సంపుటము 18 రెండవ భాగము 515-536.

30. ఆంధ్రపత్రిక విభవ సంవత్సరాది సంచిక.

31. Copper Plate No. 5 of 1955—56.

చేసికోవలసిన యవసరము లేదు. అదియుగాక యీ తామ్రశాసనముకంటె ౮ సంవత్సరములు తర్వాతిదగు నీ యోరుగంటి శాసనము ఈ రఘుదేవ నరేంద్రుడు కపిలేశ్వరుని తమ్ముడైన పరశురాముని తనయునిగ స్పష్టముగ చెప్పుచున్నది. కాన కపిలేశ్వరు డితనిని పుత్రవాత్సల్యమున జూచెననుటయే దీని యర్థము.

రఘుదేవుడు రాజమహేంద్రవరమునుండి సింహాచలము మొదలు కొండవీటి (గిరివ్రజ) వరకుగల రాజ్యమును పెదతండ్రియగు కపిలేశ్వరుని పక్షమున పాలించుచున్నట్లు క్రింది శ్లోకమునుబట్టి తెలియును.

"[32]తిష్ఠద్రాజ మహేంద్రనామనగరే సమ్యక్ప్రజాః పాలయన్నా సింహాచల మా గిరివ్రజ మిదం భూమిం తథాఽకంటకామ్ వీరశ్రీ కపిలేశ్వరస్య కృపయా కుర్వన్కుమారాగ్రణీ ర్ధీరశ్రీ రఘుదేవ రాజతిలకః శ్రీశ్రీప్రియో వర్తతే."—

ప్రస్తుతపు ఓరుగంటి శాసనమునందును రాజమహేంద్రవర రాజ్యమును పాలించుచున్నట్లే గలదు.

అదే సమయమున కొండవీటినుండి కపిలేశ్వరుని పక్షమున నాతని వంశీయుడే యగు గాణదేవుడనువాడు పాలించుచున్నట్లు కొండవీటి తామ్రశాసన[33]మును బట్టియు, చింతలపల్లిపాటి శాసనమును [34]బట్టియు తెలియుచున్నది,

పైన వివరీకరించిన శాసనములలోని చరిత్రనుబట్టి గజపతి వంశవృక్షము క్రిందివిధముగా జూపవచ్చును.

## గజపతి వంశవృక్షము

మొదటి కపిలేశ్వరుడు
(సూర్య సోమాన్వయ సంభూతుడు-నాయక శ్రేష్ఠుడు)

జాగేశ్వరుడు క్రీ. శ. 1418 ప్రాంతము.
(మహాసేనాపతి-మహా శూరుడు-వెల్లమాంబ భర్త-యుద్ధములో మరణించెను.)




32 శార్దూల విక్రీడితము.

33. Indian Antiquary Vol XX pages 390—393.

34. Annual Reports on Epigraphy No. 70 of 1917 and South Indian Inscriptions Vol X No. 587. (ఇచ్చట నీ శాసనము తప్పుగా "రఘురాయ మహాపాత్ర" యని చదువబడినది, దీనిని "గాణదేవ రవుతరాయ మహాపాత్ర" యని సవరించుకొన వలయును)

ఇప్పటికి ఉపలబ్ధమైన రఘుదేవ నరేంద్రుని శాసనములు మొత్తము నాలుగు. రెండు తామ్ర శాసనములు, రెండు శిలాశాసనములు.

(i) దోరపాలెము తామ్రశాసనము: 35 అసంపూర్తమైనది. దీని కాలము శకాబ్దము 1376 యువ సంవత్సర సోమగ్రహణమని మాత్రమే గలదు. ఆ సంవత్సరము సోమగ్రహణములు రెండుండుటచే క్రీ. శ. 1455 మే మొదటి తేదిగాని, లేదా 1456 మార్చి 22 గాని కాగలదు. రఘుదేవ నరేంద్రుడు దోరపాలెమను గ్రామమును పౌరాణికుడగు తిరుమల భట్టున కిచ్చెను.

(ii) రఘుదేవపుర తామ్రశాసనము: 36 ఆరు రేకులు గల సంపూర్ణ శాసనము. కాలము శకాబ్దము 1378 ధాత శుచి (జ్యేష్ఠముగాని ఆషాఢముగాని) శుక్లపక్ష ద్వాదశి, సరియగు క్రీ శ. 1456 జూన్ 15. తన పేర రఘుదేవపురమను అగ్రహారము చేసి 40 మంది బ్రాహ్మణుల కొసంగెను.

(iii) తిరుపతి శాసనము: 37 పశ్చిమ గోదావరి జిల్లా పెద్దాపురములో నీ గ్రామము గలదు. ఈ శాసనము శ్రీ రంగరాయాలయమున నొక స్తంభమునకు చెక్కబడియున్నది. దీని కాలము శకాబ్దము 1380 బహుధాన్య జ్యేష్ఠ బహుళ 13 సోమవారమునకు సరియగు క్రీ. శ. 1458 జూన్ 9 (శుక్రవారము).

కపిలేశ్వర మహారాయల రాజ్యాన రఘుదేవ నరేంద్ర మహాపాత్రులు రాజమహేంద్రవర రాజ్యమేలే కాలమందు శ్రీ రంగరాయాలపు క్షేత్రములు విశ్వేశ్వర పురోహితుల అధికారమందు తిరుపతి మహాజనాలవ్యాఖ్యముగ ననుభవించు చుండుటచే భండారు అధికారి త్రినేత్ర దేవగణ పేరు వాటిని విడిపించెను.

(iv) ఓరుగంటి శాసనము: ప్రస్తుత శాసనమే. కాలము కల్యబ్దములు 4561 ప్రమాథి మాఘ శుద్ధ దశమి శుక్రవారమునకు సరియగు క్రీ. శ. 1460 ఫిబ్రవరి మొదటి తేది. ఇంతవఱకు దొరికిన శాసనములలో నిదియే కాలమునుబట్టి యాఖరిది.

ఈ శాసన కాలమునకు వరంగల్లు రాజ్యము కలుబరిగె సుల్తానునకు 'ఉమైనుశహా' యధీనమున నుండినట్లు చెప్పబడినది. బహమనీ రాజగు అల్లాఉద్దీన్ సుల్తానుడు క్రీ. శ. 1457 ఏప్రిల్ మాసమున మరణింప, సరదారులలో కొంతమంది యాతని జ్యేష్ఠపుత్రుడగు హుమాయూన్ షహాకడు దుర్మార్గుడగుటచే వానిని రాజుగా నంగీకరించుట కిష్టపడక నాతని తమ్ముడగు హసన్ ఖానుని సింహాసనముపై నెక్కించిరి. దానితో రాజ్యమున కొన్ని అల్లరులు బయలుదేరినవి. కాని తుదకెట్లో హుమాయూన్ షహాయే సింహాసన మధిష్ఠించెను. వెంటనే తమ్ముడగు హసన్ ఖానుని చెరయందుంచి కుట్రదారుల నందఱిని క్రూరముగ శిక్షించెను. వారికి చేదోడుగ నుండిన వెలమరాజును శిక్షించుటకై దేవరకొండ దుర్గమును ముట్టడించెను. అతడు తన దుర్గ సంరక్షణార్థము కపిలేశ్వరుని సాయమపేక్షింప వెంటనే క్రీ శ. 1458 ప్రాంతమున వారికి తన కుమారుడగు హంవీరమహాపాత్రుని పెద్ద సైన్యమిచ్చి పంపెను. కంబముమెట్టవద్ద మొదటిసారి హంవీర మహాపాత్రుడు తురకదళముల నెదుర్కొని పరిమార్చెను.38

"యవనుల గెల్వఁడే యంబరాయలు చూడ
నెక్కైన కంబముమెట్ట బైట"

తనకు జరిగిన యీ పరాభవమునకు గాను మతద్వేషియగు హుమాయూన్ షహా మరల తెలంగాణమున నల్లరి ప్రారంభించెను. అప్పటికి కొండపల్లినుండి పాలించు గణదేవుడు మృతినొందుటచే హంవీర మహాపాత్రుడే దానికికూడ పాలకుడాయెను. ఇక లాభము లేదని దుర్మార్గుడగు సుల్తానుకు బాగ బుద్ధిచెప్ప నిశ్చయించి, తన పినతండ్రి కుమారుడును, రాజమహేంద్రవర పాలకుడునగు రఘుదేవ నరేంద్రుని సహాయమున అపార సైన్యములతో తెలంగాణపై వెడలి యోరుగల్లు దుర్గమును ముట్టడించెను. హుమాయూన్ షహా పూర్తిగ నోడిపోయి రాజధానికి పారిపోయి తిరుపరి కొలది కాలమునకే మరణించెను. ఇట్లు ఓరుగంటి దుర్గము కూడ గజపతుల వశమాయెను.

"కటకంబు లోపలి గజవాడ బెజవాడ
యొద్ది బండారిల్లు యోరుగల్లు"—

ఈ శాసనమును ప్రకటించుట కనుమతి నొసంగుటయే గాక యీ వ్యాసమును రచించుటకు నాకు అమూల్య సలహాలనొసంగిన శ్రీ డాక్టరు దినేశచంద్ర సర్కారు వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించు చున్నాను.

35. Copper Plate No. 5 of 1955—56.

36. Copper Plate No. 4 of 1955—56.

37. South Indian Inscriptions Vol. V. No. 100

## శాసన మూలము

### కుడివైపు

1. శ్రీ కృష్ణరాజ్య ప్రవర్ధమానస్య| అద్య బ్రహ్మణో| ద్వితీయ పరార్ధే| స్వే(శ్వే)త వరాహ కల్పే|

2. వైవస్వత మన్వంతరే| అష్టావి[ంశ] స(తి)తమే (మే)| చతుర్యుగాంగన 39 కలే [|]| ప్రథమ పాదే| దేవఃశకాద 40

3. ధిక| పంచశతోత్తర| చతుస్సహస్ర పరిమితే| ఆవర్తో (ధా) ప్రమాధి సంవత్సరే| ఉత్తరా—

4. యణే| శిశిర(ఋ)తౌ 41| మాఘమాసే| శుక్లపక్షే| దశమీ తిథౌ| భృగువాసరే| మృగ సి(శి)రా

5. నక్షత్రే| ఇహపృథివ్యాం| జంబూద్వీపే| భారత వర్షే| ఆంధ్ర దేశాంతర్గత [పశ్చిమ]

6. దిశాభాగ|కలబరెగ సుర(త్రా)ణ| ఉపైమశాహ| వోరుంగల్లు రాజ్య......

7. శ్రీమల్లి నాథ దేవగణ మంగళ చండీచరణ శరణ| శ్రీజాగేశ్వర దేవమహా

8. దేవాంకర పుత్ర| శ్రీచతుస్సముద్రాధిపతి| శ్రీమహా| శ్రీపురుషోత్తమస్య అ

9. దేశాదుత్కళ దేశ| కృత సమరముఖో జెక రిపు దర్పణ మర్దన| భుజబల పరాక్రమ

10. ....రాజ్య పత్తిమ| మహేశ్వర పుత్ర|...... జగన్మోల కారణ| శ్రీపుర—

### ఎడమవైపు

11. షోత్తమ పుత్ర| శ్రీదుర్గా పుత్ర| శ్రీయా వసుంధరా. సముద్ధరణ ప్రతాప ప్రచండ| దోర్దండ మహా ... మా| శ్రీమన్మహా రా

12. జాధిరాజ పరమేశ్వర| వైభవ రాజ్య ప్రణుతి రత్న దత్త...... ......| శ్రీ కొవ్వగుణ

13. అలంకృత| శ్రీ సూర్యవంశాలంకార| శ్రీ వీరగజపతి గవుడేశ్వర| విజిత నవకోటి కర్ణాటకేశ్వర| ప్రతా—

14. ప కపిలేశ్వర దేవమహారాయాంకర| తస్య అనుజో| శ్రీమల్లినాథ దేవ మంగళ చండీ చరణ శరణు| శ్రీపరు—

15. శ రామ42 దేవాంకర పుత్ర| శ్రీమల్లినాథ దేవగణ మంగళ చండీ చరణ శరణు| శ్రీజగన్నాథదేవ—

16. వరప్రసాద| శ్రీదుర్గా వరపుత్ర| రిపుదర్ప మానమర్దన| యేకవీర| శ్రీరాజమహేంద్ర

17. వరరాజ్య| శ్రీపరశురామ43 దేవరాయ తనయ| శ్రీ వీరభద్ర రఘునాథ నరేంద్ర| వోరుంగల్లు...

18. ...............యిహార సమస్త సహిత్య శివ దాన శిలా[||]

---

38. Indian Artiquary Vol. 28 pages 242—247.

39 'చతుర్యుగానాం' అని చదువవలెను.

40 'వహ్య' ,,

41. 'శిశిరఋతౌ' అని చదువవలెను.

42. 'పరశురామ' అని చదువవలెను.

43. 'పరశురామ' అని చదువవలెను.

# దుష్ట సమాసం

## శ్రీ మధురాంతకం రాజారాం

చుట్టూరా ఉష్ట్రాగ్రతను పునికొలిపి, లోపల లక్షణంగా అత్తెసరు పెట్టివున్న బస్సులోనుంచీ బయటపడ్డాను. చండమార్తాండుడు నిప్పులు గ్రక్కుతున్నాడు. గంట సరిగ్గా పన్నెండు.

బస్సు నిలిచిన చోటికి స్కూలు కూతవేటు దూరంలోనే వుంది. కానీ ఛాత్రులందరూ స్కూలులోనే వున్నట్టు నేను భావించలేకపోయాను. కొందరు చెట్లకింద చేరి కొమ్మలు ఆధారంగా 'పులప్స్' తీస్తున్నారు. మరికొందరు గోడల నీడల్లో తచ్చాడుతున్నారు. కొందరు కాలూ, చేయీ ఆడించుకుంటూ గ్రామాభిముఖులై వెళ్ళిపోతున్నారు.

అందరిలోనూ సాధువుగా కనిపించిన విద్యార్థి నొకణ్ణి దాపుకు పిలిచి "ఇదిగో అబ్బాయ్! ఇప్పుడు యింటర్వెల్లేమిటి?" అని ప్రశ్నించాను.

"ఇంటర్వెల్ ఎప్పుడో పోయింది. ఇది మూడో పీరియడు" అన్నాడా ఛాత్రుడు.

లోపల పాఠాలు జరుగుతుండగా వీళ్ళు బయట వెలగబెడుతున్న రాచకార్యాలేమిటో! నాకు కాస్త ఆశ్చర్యం కలిగింది. ఆశ్చర్యపడుతూనే మెట్లెక్కి వరండాలో ప్రవేశించాను. వరండాకు ఓ వైపున ఆఫీసు రూములో ఏవో లెక్కలమధ్య కొట్టుమిట్టాడి పోతున్న గుమాస్తా "ఎవరండీ" అని పలకరించాడు.

పరిచయం చేసుకున్నాను.

"కూచోండి, కూచోండి. ఇప్పుడే బస్సు దిగారేమిటి? ఇదిగో చెంచయ్యా! మేష్టరుగారికి ఓ గ్లాసు మంచినీళ్ళు తెచ్చిపెట్టు" అంటూ అతడు వీలున్నంతలో ఉపచారాలు పచరించాడు.

కుర్చీలో కూర్చుంటూ "హెడ్మాష్టరు గారున్నారు గదండీ" అన్నాను.

"హెడ్మాష్టరుగారా! సార్! సార్! మీరే లోకంలో వున్నారు? అదిగో ఆ బోర్డు చూడండి" అన్నాడు గుమాస్తా.

ఆఫీసు గదికి అంతర్భాగంగా, గర్భగృహంలా వున్న ఓ చిన్నగది ద్వారబంధానికి 'హెడ్‌మిస్ట్రెస్' అన్న బోర్డు వ్రేలాడుతోంది.

ముద్దార చెప్పిస్తే ముదితలు నేర్వగరాని విద్యలేవట్లే, బాధ్యత ఒప్పగిస్తే వాళ్ళు చేయలేని ఉద్యోగముకూడా లేదని నాకు తెలుసు. కానీ నడుస్తున్న బాట ప్రక్కన యితఃపూర్వం ఎన్నడూ వూహించని దృశ్యం కనిపించినప్పుడు, చదువుకున్న వరలలో యిదివరకు ఎక్కడా పొసగనిపని పరిణామం సంఘటించినప్పుడు మనం కాస్త విభ్రాంతికి లోనుగావడం అసహజమేమీ గాదు. 'కలయో, వైష్ణవ మాయయో' అన్నంత విభ్రాంతి గాకపోవచ్చు. కానీ ఆ బోర్డువైపు చూస్తూ నేను నాలుగైదు క్షణాలపాటు కుర్చీలో కొయ్యబారిపోయినమాట మాత్రం నిజం!

"మంచినీళ్ళు తీసుకోండి సార్" అన్న గుమాస్తా మాటలతో వులికిపడి, "అహాఁ, అదికాదండీ! మరి... నాకిచ్చిన ఆర్డరులో హెడ్మాష్టర నే వుంది" అన్నాను.

"ఓహో, అదా! ఆ టైపిస్టుకు రేయింబవళ్ళు చేసినా తెమలనంత పని వుంటుంది. ఒక మానవుడు ఎంతకాలమని రాత్రుల్లో గూడా నిద్ర పోకుండా పని చేయగలడు చెప్పండి! అందుచేత అతడు యిటుపనీ, అటు నిద్రా రెండూ ఒకసారిగానే నిర్వహిస్తుంటాడు."

ఈ ఆఫీసుకు సంబంధించిన పరమసత్యాలు ఈ గుమాస్తాకు బాగా విదితమైనట్లున్నాయి. అలాగే అక్కడ ఎవరినైనా కదిపితే యితడి బండారం బయట పడకపోదు. అందుకే కాబోలు, 'గొల్లలా గోత్రాలు గొర్రెలా కెరుక, గొర్రెలా గోత్రాలు గొల్లోళ్ళ కెరుక' అంటాడు ఆసాది వాడు!

గవాక్షాల్లోనుంచీ చల్లటిగాలి వీస్తోంది. పైకప్పు నుంచీ మొదలుపెట్టి గోడలపైన వ్రేలాడుతున్న క్యాలెండర్లనీ, పాత హెడ్మాష్టరుల ఛాయాచిత్రాల్ని

చూడసాగాను. ఉన్నట్టుండి నాచూపు కుర్చీకి దగ్గరగా వ్రేలాడుతున్న గ్రూప్ ఫోటో పైన ఆగింది. పై వరుసల్లో విద్యార్థులు నిల్చున్నారు. క్రింద విద్యార్థినులు కూర్చున్నారు. మధ్యగా కుర్చీలో కూర్చున్న ఉపాధ్యాయవర్గానికి నట్టనడుమ హెడ్‌మిస్ట్రెస్ ఆసీనురాలైంది. ఆకారాన్ని గురించి ఓ అభిప్రాయం కలిగీ కలగకముందే ఆమె పేరు తెలుసుకోవాలన్న ఆసక్తి నాకెందుకు కలిగిందో చెప్పలేను. బహుశా అందుకిది కారణమైతే కావచ్చు. ఒకప్పుడు పేరు మాత్రమే మొదటవిని, ఆ తరువాత తెప్పుడో మనం మనిషిని కలుసుకోవటం తటస్థిస్తుంది. మరొకప్పుడు మనిషిని చూచిన తర్వాత కొంత కాలానికిగానీ, మనకు పేరు తెలియకపోవటంజరుగుతుంది. ఈ రెండు సందర్భాల్లోనూ నామరూపాలు ఒకదానికొకటి పొసగక పోవటంచేత మన అంచనాలు తిరగబడి పోవటం కద్దు. ఇందుకొక్క తరణోపాయం మాత్రం కనిపిస్తుంది. పేరుతో బాటే ఆకారాన్ని, ఆకారంతో బాటే అభిధేయాన్నీ, రెండిటినీ ఒక్కసారిగా తెలుసుకోడమే ఆ ఉపాయం!

ఫోటో క్రింద ముద్రింపబడిన పేర్ల జాబితాలో హెడ్‌మిస్ట్రెస్ గారి పేరును యిట్టే పట్టేశాను

ఆమె పేరు ప్రమీలాదేవి.

వయస్సు ముప్పై అయిదుకు తక్కువుండదు. ఫోటో కోసం పెట్టిన పోజులో ఆమె కుర్చీలో తీర్చి దిద్దిన శిల్పంలా వుంది. పొడుగరి కాదు. పొట్టి అని చెప్పడానికి కూడా వీల్లేదు. కానీ ఆమె స్థూలశరీర మాత్రం కాదు. ఔచిత్యం జారిపోని వేషధారణ, విప్పారిన నెమలి పింఛంలాంటి కబరీభరం ఆ ఆకృతికి గాంభీర్యాన్ని ప్రసాదిస్తున్నాయి. కర్ణభూషణాలు వెదజల్లుతున్న వెలుగులు, మెడలోని మామిడి పిందెల దండ చిమ్ముతున్న మెరుగులు, ఆమె పలుచని పెదవుల పైనుంచి ప్రసారమవుతున్న మందహాసద్యుతులతో కలిసిపోతున్నాయి.

ఒక్కొక్క రకమైన వృత్తికి ఒక్కొక్క రకమైన విగ్రహమూ, అందుకు తగిన హావభావాలు అవసరం. సబ్ యిన్స్‌పెక్టరు గిరీ అవలీలగా చలాయించగలిగిన దృఢకాయుడు పంచకట్టుతో జుబ్బాతో అంగవస్త్రాన్ని సరిచేసుకుంటూ తరగతిగదిలో ప్రవేశిస్తే ఛాత్రబృందం గొల్లున నవ్వేసినా నవ్వేయగలరు. వ్యాపారాలకు ట్రేడుమార్కుల్లా ఉపాధ్యాయవృత్తికి సముచితంగా గుర్తింపబడిన ఆకారాలు కొన్ని వున్నాయి. సన్నగా, పొడుగ్గా తోటకూర కాడలాంటి స్వరూపం ఒకటి. పొట్టిగా, గుమ్మటంలాంటి ఆకారం మరొకటి. ఇక ప్రధానోపాధ్యాయుడన్న ప్రసక్తిరాగానే పొడుగాటికోటు, బుర్రమీసాలు, మందరగిరిని చుట్టుకున్న వాసుకిలా నడుముకు రెండంగుళాల వెడల్పుతో బెల్టు, యిలాంటి హంగులతోగదా, మహిషము నెక్కని యమధర్మరాజు విగ్రహం మదిలో మెదలుతుంది. సమవర్తి సింహాసనం ఓ నాలుకాళ్ళ ఆకారంతో, అగ్నిగుండం పైన వ్రేలాడుతుంటుందని చెబుతారు. కుర్రాళ్లు రేపే కల్లోలాలు, ఉపాధ్యాయులమూలంగా వుత్పత్తిలే చెచ్చెగవులు, స్థానికప్రముఖుల వాదాలు, పై అధికారుల శాసనాలు, మున్నగువాటిదృష్ట్యా హైస్కూలు హెడ్మాస్టరుగారి స్థానం అంతకన్నా భిన్నమైందిగా తోచదు. ఎంతగా ప్రయత్నించినా ప్రమీలాదేవిని ఆపీఠం పైనకూర్చున్నట్టుగా వూహించుకోవటం నామట్టుకు నాకు అసమంజసంగానే భాసించింది.

ద్వారందగ్గరనుంచీ పాదరక్షల చప్పుడు వినిపించింది. వెనుదిరిగిచూచేసరికి ముక్కలు ముక్కలుగా వదనమండలమంతటా క్రమ్ముకుంటున్న చెమటను చేతిరుమాల్తో తుడుచుకుంటూ ప్రమీలాదేవి లోపలికి వచ్చేస్తోంది.

"ఈయనేనండీ మన కొత్త టీచరు. కృష్ణమూర్తి గారు" అన్నాడు గుమాస్తా.

"నమస్తే సార్!" అంటూ చేతులు జోడించాను.

హెడ్‌మిస్ట్రెస్ ప్రమీలాదేవి హేళనగా నవ్వుతూ "సార్ అనకూడదండీ! మేడమ్ అనాలి" అనేంతవరకూ నా పొరబాటు నాకు తెలిసిందిగాదు.

"రండి, కూచుందురుగానీ" అంటూ ప్రమీలాదేవి గదిలోపలికి దారితీసింది. అది చాలా చిన్నగది. బీరువాలలోపలా, పైన అరలవాటి చెక్కలపైనించి పైకప్పుదాకా దొంతరలు దొంతరలుగా అనిపోయి వున్న పాతకాగితాలు తప్పితే మరేమీ కనిపించని ఆ గదిలో ప్రమీలాదేవి తనకుర్చీలో తనుకూర్చుంటూ, నాకో కుర్చీ చూపించింది.

ఐదారునిమిషాలు నీరసంగా దొర్లిపోయాయి. అర్జెంటుపేపర్లపైన సంతకాలు ముగించి, ప్రమీలాదేవి

పైకెత్తేసరికి నేను ఆ గదిలోపలి వాతావరణంలో గిలగిలలాడిపోతున్నాను.

"ఈ దుర్వాసన నాకైతే అలవాటయిపోయింది. కొత్తవారు గనుక మీకు కొస్తా యిబ్బందిగానే వుండవచ్చు" అంది ప్రమీలాదేవి.

"పెద్దపెద్ద ఆఫీసుల్లో పాతబడి, నిరుపయోగమైపోయిన కాగితాలను సంవత్సరానికోసారి కాల్చేస్తారని విన్నాను" అని ఓ వుపాయాన్ని సూచించబోయాను.

"అకామిడేషన్ చాలడంలేదని వెయ్యిపాట్లు విన్నవించుకోడం జరిగింది. ఆఖరుకు ఆరునెలల క్రిందట ఓ బ్లాకు నిర్మాణానికి డబ్బు మంజూరు చేశారు. ఈపాటికి ప్లాను సిద్ధమైవుంటే, పైనెల్లో పనికూడా ప్రారంభం కావచ్చు. కాని కృష్ణమూర్తిగారూ! ఇక్కడ మనపనికి ఈ కాగితాలొక్కటేనా ప్రతిబంధకం?"

"నేనీ ప్రాంతానికేగాక, ఉద్యోగానికి కూడా కొత్తవాణ్ణి మేడమ్! అన్ని విషయాలూ మీరే చెప్పాలి." అన్నాను.

ప్రమీలాదేవి బరువుగా నిట్టూర్చింది. "ఏం చెప్పమంటారు! ఉద్యోగరీత్యా నేనీ వూరికి వచ్చి ఆరేళ్లు గడచిపోయి యిప్పటికి ఏడో సంవత్సరం జరుగుతోంది. ఈ ఏడేళ్లలో నాకొక్కరోజు కూడా విశ్రాంతిగా గడవలేదంటే బహుశా మీరు నమ్మరేమో!"

హెడ్‌మిస్ట్రెస్‌లో నేను అధికార ధోరణిని మాత్రమే ఎదురు చూచాను. కానీ అందుకు వ్యతిరిక్తంగా పరిచయమై యింకా పదినిమిషాలు గాకముందే తన కష్టనష్టాలు వెళ్లబోసుకుంటున్న ప్రమీలాదేవి, నాకెంతో కాలంనుంచీ పరిచితురాలైన ఆప్తబాంధవిలా గోచరించింది. నిస్సహాయత ధ్వనిస్తున్న ఆమె పలుకుల్ని వింటున్నకొద్దీ, దైన్యం తాండవిస్తున్న ఆముఖాన్ని చూస్తున్నకొద్దీ ఒకానొక విషాదగాథలో పీఠికాప్రాయమైన ప్రథమాధ్యాయాన్ని చదువుతున్నట్టుగా నా రూపపాకాశమంతటా ఓ వింత శ్రానుభూతి అలుముకుపోయింది.

"ఇది విద్యాలయం! అవును గదండీ! ఇక్కడ కుర్రాళ్ళు చదువుకుంటారనీ, సిలబస్ మేరకు పాఠాలు చెప్పడంతో మన కర్తవ్యం తీరిపోతుందనీ మీరనుకుంటున్నారు. నేనూ అలాగే అనుకునేదాన్ని. కానీ ఈ పది పదిహేనేళ్ళ అనుభవంలో నేను ఆ అభిప్రాయాన్ని మార్చుకోవలసి వచ్చింది. ఎందుకంటారా..."

ఎందుకో తెలుసుకోవాలన్న ఆసక్తితో నేను సావధానంగా కూర్చున్నాను. కానీ ప్రమీలాదేవి అంతలోనే తన వుద్దేశం మార్చుకుని "పోనివ్వండి. ఇప్పుడా గొడవెందుకు! మీరు ఉదయం ఎనిమిదిగంటలకెప్పుడో బస్సెక్కి వుంటారు. ఉండండి, ఫ్లాస్కులో కాఫీ వుందేమో చూస్తాను." అంటూ లేచింది.

మనిషిని ఒక తోలు తిత్తితో వుపమిస్తే, ఆ తిత్తిలోపలికి జీవనోత్సాహమన్న గాలిని పూరించే పానీయ విశేషం కాఫీ! ఆ పరిస్థితిలో నాకు కాఫీ అత్యవసరమే! ఫ్లాస్కులోంచీ కాఫీని గ్లాసులోకి వంచుతూ "మీ అదృష్టం మంచిదే. మా మురళి యింకా స్కూలునుంచీ వచ్చాడు కాదు. ఇంటిదగ్గర నుంచి తెచ్చుకున్న కాఫీ అలాగే వుండిపోయింది" అంది ప్రమీలాదేవి.

నేనావిడ ప్రసంగ ధోరణికి అడ్డుపడ దలచుకోలేదు గనుక మౌనంగానే కూర్చున్నాను.

"అన్నట్టు మా మురళి మీతో నేస్తం కట్టేస్తాడనుకుంటాను—కొత్తగా వచ్చిన ప్రతి టీచరుకూ ఎన్ని పాటలు వచ్చునో, ఎన్ని కథలు వచ్చునో పరీక్షించడం వాడి వాడుక. మీ బొక్కసంలో పాటలూ, కథలూ ఖాళీ అయిపోయేంతవరకూ వాడు మిమ్మల్ని వదిలిపెట్టడు..."

"పాటలకు నాకూ చాలాదూరం మేడమ్! కానీ ఎన్నిరోజులు చెప్పినా ఎడతెగని కథలుమాత్రం, నాకు కొన్ని తెలుసు" అన్నాను.

"కానీ మా మురళి అసాధ్యుడండోయ్! వాడితో వేగడం చాలాకష్టం. మళ్ళీ మా సుశీల వుంది చూచారూ, వెర్రి బాగులపిల్ల అది నోరు విప్పడమే బ్రహ్మాండం— అదిగో, పిల్లలొచ్చేస్తున్నారు...చూడండి, కృష్ణమూర్తి! వాడు సుశీలనెలా ఏడిపిస్తున్నాడో! దొంగ వెధవ, రానివ్వండి, వాడిపని చెబుతాను..." ప్రమీలాదేవి చరచరా వెళ్ళికిటికీ దగ్గర నిల్చుంది.

మురళి తారాజువ్వలా వచ్చిపడ్డాడు. రాగానే భుజానికి తగిలించుకున్న పుస్తకాల సంచినితీసి కేల

పైకి విసరి, తల్లిపాదాలకు చుట్టుకుంటూ" "చూడమ్మా! మరి, రాత్రి నేను చదువుకోలేదని అక్కయ్య మేష్టరు గారితో చెప్పేసింది. మేష్టరుగారు చేయిచాచమని పేం బెత్తంతో రెండు దెబ్బలంటించేశారు" అంటూ ఏడుపులంకించుకున్నాడు.

"అలాగా! నీపైన చాడీలు చెప్పడమే! ఉండు, దానిపని చెబుతాను" అంటూ ప్రమీలాదేవి కుర్రాణ్ణి చేతుల్లోకి తీసుకుని వూరడింపసాగింది.

"నేనెక్కడ చాడీలు చెప్పానమ్మా!" వెక్కుతూ, తూలుతూ వరండాదాకా వచ్చిన సుశీల అక్కడే నిల్చుని బెదురు చూపులతో తల్లివైపు చూస్తూ అంది. "రాత్రి మురళి చదువుకున్నాడేమిటి?"

"చదువుకోకపోతే మాత్రం? నిన్నా విషయం తీసుకెళ్ళి మేష్టరుగారితో చెప్పమన్నా రేమిటి?" చిరుకోపంతో కుమార్తెను చురచుర చూచింది ప్రమీలాదేవి.

మాతృహృదయం తప్పొప్పుల తారతమ్యాన్ని అంతగా పట్టించుకోదేమో ననిపించింది నాకు!

ప్రమీలాదేవి ఊహించినట్టుగా అయిదు నిమిషాలుగడిచీ గడవకముందే మురళి నాతో జతకట్టేశాడు. నాజేబులోని పెన్నా, చేతికున్న గడియారమూ, అంతలోనే వాడికి చిరపరిచితాలైపోయాయి. ఇంకో అరగంటలో ఏదోకకథ చెప్పమని పీడించడానికి కావలసినంత చనువును వాడు క్షణక్షణానికీ ప్రోదిచేసుకుంటున్నాడు!

ఆఖరుకు ఉదయం బయల్దేరింది మొదలు, ఆ క్షణందాకా నన్నెదుర్కొంటున్న సమస్యనుకూడా ఆ కుర్రవాడే పరిష్కారం చేశాడు. గంట మోగింది. హెడ్‌మిస్ట్రెస్ ద్వారా ఒక్కొక్కరే నన్ను పరిచయం చేసుకుని అధ్యాపకులుకూడా యిళ్ళకు వెళ్ళిపోయారు. ఓ ఎనిమిదేళ్ళ కుర్రాడికి కలిగిన ధర్మసందేహం వాళ్ళకెందుకు కలగలేదన్న విషయం నాకప్పటికీ, యిప్పటికీ అనూహ్యంగానే వుండిపోయింది. అందరూ వెళ్ళిపోయిన తర్వాత యింటికి సాగబోతున్న తల్లిచేతిని పట్టుకుని "మేష్టరు గారెక్కడ భోజనం చేస్తారమ్మా" అన్నాడు మురళి!

"చేస్తే చేస్తారు. లేకపోతే వూరుకుంటారు. నీకేం?" అంది ప్రమీలాదేవి.

"మరి, ఈ వూళ్ళోనుంచి హోటళ్ళుకూడా లేవుగా!" అమాయకంగా తల్లికళ్ళల్లోకి చూచాడు మురళి.

బిడ్డల మంచితనం లోకానికి వ్యక్తమౌతున్నప్పుడు తల్లికి అమందానందం కలగడం సహజమే! ప్రమీలాదేవి సగర్వంగా నావైపు చూచింది.

కుర్రాడి ప్రతిపాదనను తల్లి ఏకగ్రీవంగా బలపరచడంవల్లనైతే నేమి, గత్యంతరం లేకపోవడంవల్లనైతే నేమి, నేనా ఆతిథ్యాన్ని స్వీకరించక తప్పింది కాదు. మండుటెండలో తలవంచుకుని నేను ప్రమీలాదేవిని వెంబడించాను. భోజన సదుపాయం కల్పించడంతో తృప్తిపడక నాకు కొత్తవినోదాన్ని సైతం సమకూర్చదలచుకున్నారేమో, అందాకా వెనుకబడిపోయి సుశీలతో మంతనాలు జరుపుకున్నవాడు, ఒక్క పరుగుతో ముందుకువచ్చి "అమ్మా, అమ్మా! అక్కయ్య మేష్టరుగారినికూడా పుష్పవల్లికి తీసుకెళ్దామంటోంది" అన్నాడు మురళి.

"అబ్బే, నేనలేదు. వాడే తీసికెళ్దామని నాతో చెప్పాడు" అంది సిగ్గుపడిపోతూ సుశీల.

"నేను చెప్పానుగదండీ! మా వాడింక ఒక్క క్షణంకూడా మిమ్మల్ని వదిలిపెట్టడు" అంది ప్రమీలాదేవి.

తల్లీ బిడ్డల నాటకంలో నా మూగపాత్రను చాలించుకుని "పుష్పవల్లి ఎక్కడండీ?" అని ప్రశ్నించాను.

"ఇక్కడే లెండి. జట్కాలో వెళ్తే ఓ గంటసేపు ప్రయాణం. ఈ ప్రాంతానికంతా అదొక పెద్ద వేడుక. పోయిన సంవత్సరం వెళ్ళొచ్చాము. ఈ సారికూడా వెళ్ళాలని వీళ్ళు నా ప్రాణం తీసేస్తున్నారు."

"అదిగోనండీ మేష్టరుగారూ! అదే మా యిల్లు, అక్కే, అదే" అన్నాడు మురళి.

* * *

ఫిరంగిపురం ఉప్పునీళ్ళ పుణ్యమా అని సాయంత్రానికల్లా రొమ్ముపడిశెం ముమ్మరంగా పట్టింది. గొంతుక కరకర రాచుకుంటూ, పొడిపొడిగా బయట పడుతున్న దగ్గుతో సతమతమౌతూ వరండాలో వేసుకున్న మంచంమీద పడుకుని చిమ్మచీకటిలోకి చూస్తూ కాలహరణం చేయసాగాను. అకల్లాడని నీరవ నిశ్శ

బంధంలో నిశీథరాత్రి తన సామ్రాజ్యంలో కొలువుతీర్చిన నన్ను సన్మానించడంకోసం చీకటిగలతో పాటకచ్చేరీ ఏర్పాటు చేసింది. తలపోటుతో తీగలు జారి పోతున్న జిలి కూజలకు చేతి గడియారం టిక్ టిక్ మంటూ వదుస్తున్న ధ్వనికూడా సమ్మెట్ల వేటులా వినిపిస్తోంది. 'జన్మకల్లా శివరాత్రి' అన్నారు. ఆ శివరాత్రినాడీ విధంగా సాక్షాత్కరింపగలదని మాత్రం నేనెన్నడూ అనుకోలేదు.

అంధకారంలో మిలమిల మెరుస్తున్న తారకలను చూస్తున్నకొద్దీ నాకు ప్రమీలాదేవి ఆతిథ్యం జ్ఞప్తికి రాసాగింది. ఆనాడు ఆదరమే గనుక లభ్యంగాకపోయి వుంటే నాపాలిటికి ఫిరంగిపురం చీకటి కుహూర్యరంగా తోచివుండేదేమో!

తెలిసినంతవరకే చాలునని వూరుకోక, మరికొంత స్వకపోల కల్పన సాగించి ఎదుటి వ్యక్తిపట్ల లేని పోని ఊహాపోహాలు కల్పించుకోడం మానవుడి చిత్తప్రవృత్తిలోని దౌర్బల్యాల్లో మొట్టమొదటిది. కాకపోతే ప్రమీలాదేవిని కేవలం సౌజన్యమూర్తిగా భావించడంతో ఆగిపోక, ఆమెను గురించి నా అంతరాంతరాల్లో వెయ్యి ప్రశ్నలెందుకు చెలరేగాలి? ఆమె దేవూరు? ఆమెకు బంధువులు లేరా? ఉంటేవాళ్ళెక్కడున్నారు? అన్నింటికన్నా ముఖ్యమైంది — ఈమెను సహధర్మిణిగా బడసిన అదృష్టవంతుడెవడు?...

ఏ వైపునుంచో గానీ ఓ గాలి రివ్వునవచ్చి పరిసర తరువుల్ని గిలిగింతలు పెట్టడంతో కాస్త వూపిరి త్రిప్పుకోడానికి వీలయింది. గడియారం చూసుకున్నాను. గంట పన్నెండు కావస్తోంది. నిద్ర పోదలచుకుంటే యింతకంటే మంచి తరుణం దొరకదు. ఎక్కడి ఆలోచనలను అక్కడే వదిలిపెట్టి, గట్టిగా కళ్ళు మూసుకున్నాను...

ఒకటి... రెండు... మూడు. నిండుగా అయిదు నిమిషాలు కూడా గడిచి వుండవు. పైకప్పు విరిగి తల పైన పడినట్టుగా ఓశబ్దం వినిపించింది. ఉలికిపడి, లేచి మంచంపైన కూచున్నాను. ఉండినా ఒకటే, పూడినా ఒకటే అన్నంత విసురుతో ఎవరో తలుపును దబదబ బాదుస్తున్నారు.

"ఎవరక్కడ?" తీవ్రంగా ప్రశ్నించాను.

"నువ్వెవరు?" అవతలి వ్యక్తి నాకంటే వెయ్యి రెట్లు కర్కశంగా ప్రశ్నించాడు. తన గుహ ముందర అడుగు జాడల్ని పసిగట్టిన సింహం అలా ప్రశ్నించి వుంటుంది.

నేను సైతం మేకపోతు గాంభీర్యాన్ని విడిచి పెట్టదలచుకోలేదు.

"మీరలాగే తలుపును బాదదలచుకుంటే నా ఆక్షేపణేమీ లేదు. కానీ కాస్త తమాయించుకుని పరిశీలించినట్టయితే తలుపు తాళం వేయబడివుందని మీరు గ్రహించగలరు" అన్నాను.

"తాళం చెవెక్కడ?"

ఒకానొక పిండారి దొంగలనాయకుడు యింటి యజమానుణ్ణి అలా ప్రశ్నించి వుంటాడు!

ఓరి, వీడి తెంపరితనం కాలిపోనూ! వీడు యింటిలోవాళ్ళు ఏ మయ్యారని అడగడు. ఎక్కడికి పోయారని అడగడు. తలుపుకు తాళంవేశారని తెలియగానే తాళంచెవికోసం మాత్రం 'డిమాండ్' చేయగలడు!

అతడిపట్ల నాకు సదభిప్రాయం కలుగలేదు. అందుచేత అతనికి తాళంచెవి యివ్వడమన్న ప్రసక్తే లేదు.

మళ్ళీ పడుకోడానికోసం పడకను సర్దుకుంటూ "మొదట మీ రెవ్వరో తెలుసుకోనివ్వండి" అన్నాను.

అతడు జేబులోనుంచి అగ్గిపెట్టె తీశాడు. చరాలున ఓ పుల్లనుగీసి వెలిగించాడు. రెండడుగులు ముందుకు వేసి వెలుగుతున్న అగ్గిపుల్లను నా ముఖం దగ్గరికి తెచ్చాడు.

ఆ అగ్గిపుల్ల నాలుగైదు క్షణాలు మాత్రం వెలిగి వుంటుంది. ఆ స్వల్ప వ్యవధిలోనే అతడి వాలకం నన్ను హడలగొట్టేసింది. అతను తనలాంటి మనుష్యులు యిద్దరు ముగ్గురు సులభంగా దూరిపోడానికి వీలున్నంత వదులుగావున్న సిల్కు పైజమా వేసుకున్నాడు. మోకాళ్ళదాకా వ్రేలాడుతూ క్రింద అంచులదగ్గర చేటల్లా రెపరెప లాడుతున్న జుబ్బా తొడుక్కున్నాడు. మెడకు రెండు మూడు చుట్లు చుట్టుకున్న మఫ్లరును జుబ్బాక్రింద ఎక్కడో అణగారిపోయిన రొమ్ముపైనుంచి క్రిందికి వ్రేలాడదీశాడు. ఆ ఆకారంలో చెప్పుకోదగ్గ విశేషం అతడి శిరోజ సంస్కారం. ఉవ్వెత్తుగా పైకిలేచి, లేచినంతవరకూ అంగుళానికి అయిదు వంకరలుతిరిగి, అక్కడనుంచీ

పేటవాలుగా క్రిందికి జారి మహాసముద్రానికి సింధు శాఖల్లా అవి వెనుకవైపున చెల్లాచెదరై వున్నాయి. పీల్చుకపోయిన దవడలపైన, కొంచెపేటులా నిటారుగా నిల్చున్న ముక్కుక్రింద అతడి పిల్లికళ్ళు మిణుగురు పురుగుల్లా మెరుస్తున్నాయి!

తలగడ క్రిందినుంచీ అప్రయత్నంగా తాళంచెవిని పైకితీశాను. ఎడమచేతితో తాళంచెవిని పూస లాక్కొని, తాళం తెరచి, తలుపు నొక తిన్నతిన్న అతడు లోపలికి వెళ్ళిపోయాడు.

మళ్ళీ నేను అంతూ పొంతూ లేని ప్రశ్నావాహినిలో బడి కొట్టుకపోసాగాను. పకలంతా కనిపించని మనిషి, యితడీ అర్ధరాత్రివేళ ఎక్కడినుంచీ వూడిపడినట్టు? కొంపదీసి నిశాచరుడు కాదుగదా! ఈ యింట్లో యితడి హోదా ఏమిటి? ఇతడెక్కడుంటాడు? ఏం చేస్తుంటాడు?

ఎంతసేపాలోచించినా, నా శ్రమ చిట్టచివరకు ఊహాగానంలోనే పర్యవసించబోతుంది గనుక, నిజం నిలకడమీద తేలక పోదన్న నిర్ణయానికి వచ్చేసరికి గడియారంలో చిన్నముల్లు అర్ధ రాత్రి తర్వాత కూడా రెండంకెలు దాటింది. అప్పటికే కళ్ళు మండుతున్నాయి. ఎరుపు తిరిగిన కళ్ళతో, నిద్ర మత్తులో జోగుతున్న ముఖంతో రేపటిపుదయం క్లాసులో నిల్చుంటే పుత్రళ్ళు అష్టోత్తర శత నామావళితో పూజించినా పూజించగలరు. ప్రప్రథమంగా పుత్రాళ్ళపైన 'యింప్రెషన్' సృష్టించే లక్షణం యిది గాదు. అబ్బే, యిదేమీ బాగుండడం లేదు.

కళ్ళు మూసుకుని, దుప్పటి బిగదన్నుకుని మళ్ళీ ఒక సారి నిద్రపోవడానికి ప్రయత్నించాను. కానీ నిద్రాదేవతను ఎంత చిత్త శుద్ధితో ఆరాధింపబూనుకున్నప్పటికీ, నామనసులో మాత్రం అపిల్లికళ్ళు నిరంతరాయంగా మెదులుతూనే వుండి పోయాయి.

ఆఖరుకు తెల్లవారు జామున ఎప్పుడో కునుకు పట్టింది. కానీ అకలత నిద్రలో గన్న కలలోకూడా నాకు భూదేవిని చాపగా చుట్టుకపోతున్న హిరణ్యాక్షుడే కనిపించాడు!

* * * *

నిద్రలేచేసరికి రెండు బారల ప్రొద్దెక్కింది. పరుపును చుట్టి మంచంపైనేవుంచి, మెట్లుదిగుతున్నాను. "మేష్టరుగారూ! మురళి యింకా నిద్రపోతూనే వున్నాడు" అందికిటికీలోనుంచీ సుశీల.

"పుష్పపల్లకినుంచి ఎప్పుడొచ్చారు?" అన్నాను.

"మేం వచ్చేసరికి మీరు నిద్రపోతున్నారు."

"అలాగా! ఇప్పుడే వస్తాను" అంటూ ముందుకు సాగాను. ఊరి బయటికి వెళ్ళేసరికి గంట ఎనిమిదిన్నరయింది. పది గంటలకు పది నిమిషాలముందుగా మొదటి గంట మ్రోగుతుంది. ఆలోపల టీచింగ్ నోట్సు వ్రాసుకోవాలి. ఊరికి మధ్యగా పాతకాలపు నాటి రచ్చబావున వున్న అయ్యరుగారి పూరిపాకలో కాఫీ దొరికింది. 'కెలకులనున్న తంగేటి జున్ను గృహమేధి' అనుకున్న కాలం గతించింది. ఆగృహమేధి ఔదార్యంలో యింకా ఏ కొంతాంశమో మిగిలివుంటే ఆ ఔదార్య లేశం ఈ అయ్యరుగారి సొత్తే ననిపించింది. నెలకు ముప్పై రూపాయలు ముట్టజెబితే అతడు రెండు పూటలా భోజనం పెట్టడానికి సమ్మతించాడు. ఒక కూర, ఒక రసం, ఒక తాలింపు, మజ్జిగ యింతకంటే మరేమీ అశించడానికి వీలుండదని ఆ సమ్మతి క్రింద ఓషరా పెట్టాడు. నా భోజన ప్రియత్వాన్ని కొలిస్తే ముందువాళ్ళకు దాచుకుంటాను. ఇప్పుడు ఖాద్య పదార్థంలాంటిదేది దొరికినా చాలనన్నాను.

టీచింగునోట్సు వ్రాసి ముగించి, టైమ్ టేబిల్ నోట్ చేసుకోడానికి ఆఫీసురూంలో ప్రవేశించాను. యథాప్రకారం తన పనిలో నిమగ్నుడైవున్న గుమాస్తా నీలకంఠం "మా వూరెలా వుందండీ?" అన్నాడు.

"ఒకమాదిరిగావుంది. ఉద్యోగం దొరికిన ప్రతి వూళ్ళోనూ మనకు సమస్త సౌకర్యాలెక్కడనుంచీ లభ్యమౌతాయి? పరిస్థితులకు అనుగుణంగా అలవాట్లనూ, ఆచారాలను సర్దుబాటుచేసుకోడమేగదండీ జీవితం" అని నాకు తెలిసిన వేదాంతం వెళ్ళబోసుకున్నాను.

నాతో కాసేపు తీరిగ్గా మాట్లాడదలచుకున్నాడేమో, అతను కలం టేబిలుపైనవుంచి "మేష్టరుగారూ, కూర్చోండి. తొందరేముంది?" అన్నాడు.

కుర్చీలో కూర్చుంటూ లోపలిగదివైపుచూచి "ఇంకా హెడ్ మిస్ట్రెస్ గారు వచ్చినట్టు లేరే" అన్నాను.

"ఇంకెక్కడ వస్తారులెండి?" అన్నాడు నెమ్మదిగా నీలకంఠం.

"ఏం! ఎందుకంటారు?" నా ప్రశ్నలో విస్మయం ధ్వనించింది.

ఈ ప్రశ్నకు నా వెనువెంటనే లోపలికివచ్చి టీచర్ల అటెండెన్సులో సంతకం పెడుతున్న శర్మగారు ప్రత్యుత్తరమిచ్చారు. "చైత్రయాత్రను ముగించుకుని సార్వభౌములు రాజధానికి విచ్చేశారుగదండీ! శ్రీవారికి గోజ్జంగి పూనీటిస్నానాలు, ధూపదీప నైవేద్యాలు పూల పానుపుసేవలు మున్నగు సకలోపచారాలూ నిర్విఘ్నంగా నెరవేరాలిగదా!"

"సార్వభౌముడేమిటి, చైత్రయాత్రేమిటి? నాకంతా అయోమయంగావుంది. కాస్త వివరంగా చెప్పండి మేష్టరుగారూ!" అంటూ ప్రాధేయపడ్డాను.

"అదేమిటండీ! మీరు రాత్రి ఆ యింటి వరండాలో నేగదా పడుకున్నారు? అతడిరాకను మీరు గమనించలేదేమిటి?" అన్నాడు నీలకంఠం.

"గమనించకేం బాబూ! గమనించాను. అప్పటి నుంచీ అతడెవరో వూహించుకోలేక బుర్ర పాడుచేసుకుంటున్నాను" అన్నాను.

నీలకంఠం శర్మగారివైపు చూచాడు. శర్మగారు నా అమాయకత్వానికి జాలిపడుతున్నట్టుగా మెల్లగా నవ్వుతూ నా టేబిలుకు దగ్గరగా వచ్చి "సాక్షాత్తు ప్రమీలాదేవిగారి భర్త, పిలిశెళ్ళ ప్రేమానందగారి నెరుగరా కృష్ణమూర్తిగారూ!" అన్నారు.

ఊహించిన విపరీతం యదార్థమని తేలినప్పుడు తనలోని చైతన్యం నశించిపోగా మానవుడు స్తంభీభూతుడైపోతాడు కాబోలు! ఒక నిమిషంపాటు నేను నోరువిప్పలేక పోయాను. శర్మగారు భుజంపైన చేయి వేసినంతలో తెప్పరిల్లి "కానీ అతడు ఎక్కడినుంచీ వచ్చినట్టండీ?" అన్నాను.

"వదినగారు ఎక్కడ ఉద్యోగిస్తున్నారో నిర్దిష్టంగా చెప్పగలమా కృష్ణమూర్తిగారూ? ఇతడూ అంతే! ఎక్కడో వుంటాడు. ఇష్టమైనప్పుడు యిక్కడికి వచ్చి వ్రాలిపోతాడు. ఈ రోజుల్లో పాదలేపనాలు లేవనుకోండి. బస్సులున్నాయిగా!"

ఐతే యితడు బస్సులో వచ్చాడన్నమాట! ఇంటిదగ్గర నేను బయల్దేరిన వేళావిశేష మెలాటిదో గానీ, మరొక్క విషయంకూడా సూటిగా తెలిసిరావటం లేదు. అంతలోనే మళ్ళీ ఒక సందేహంతోచి "ఐతే ఈ వూరికి అర్ధరాత్రప్పుడుకూడా బస్సులున్నాయటండీ" అన్నాను.

"అది తొమ్మిదిగంటల బస్సు. మార్గమధ్యంలో చెడిపోయి వుండవచ్చు. అందుచేత లేటైవుంటుంది" అన్నాడు నీలకంఠం.

ఎలాగైతేనేం, యింతసేపటికి వివరాలొక్కొక్కటిగా బయటపడుతున్నాయి. అవకాశాన్ని సద్వినియోగం చేసుకోదలచి "ఇంతకూ అతడి వుద్యోగమేమిటో చెప్పారుకారు" అంటూ మరొక సందేహం ప్రకటించాను.

"ఉద్యోగం! మరే వుపాయమూ లేని మీకూ నాకూ వుద్యోగంగానీ అతడికేం వుద్యోగమండీ! ప్రమీలాదేవి అంటే ఏమిటనుకున్నారు! అతడి పాలిటికి రూకలు కాసే చెట్టు. కావలసినప్పుడిలా వచ్చి దులుపుకుంటాడు. రాలిన రూకలు చేతబట్టుకుని మళ్ళీ బయల్దేరాడంటే, యిక జేబు ఖాళీ కావాలి, అయ్యగారికి ఈ ప్రపంచంలో అమ్మగారొకరున్నారన్న విషయం జ్ఞప్తికిరావాలి. ఇదీ కథ!" అని సంచీవాలు సర్దుకుంటూ శర్మగారు బయటికి వెళ్ళిపోయారు.

గంట మ్రోగడంతో నీలకంఠంతో బాతాఖానీ కూడా ముగిసింది. ఆరు బయట జరుగుతున్న ప్రార్థనా సమావేశంలో ఆయిదు నిమిషాలసేపు నిల్చునేసరికి నీరెండకు కళ్ళు గిర్రున తిరిగాయి. లోపలికివెళ్ళి ఓ టంబ్లరు మంచినీళ్ళు త్రాగాను. ఒక అరగంటసేపు కదలకుండా పడుకుంటే నిద్రమత్తు వదిలిపోవచ్చు. కానీ వరుసగా మూడో పీరియడుదాకా క్లాసులున్నాయి. కుర్రాళ్ళమీద ప్రయోగించదలచుకున్న 'యింప్రెషన్' మాట దేవుడెరుగు! ఒకటి చెప్పబోయి మరొకటి చెప్పకుండా పాఠ్యాంశాన్ని సూటిగా వివరించి, మాట దక్కించుకోగలిగితే చాలు! ఈ ప్రయత్నంలో నేనెంతవరకూ కృతకృత్యుణ్ణి కాగలిగానో చెప్పలేను. ఒక నిమిషంకూడా ఎడతెరిపిలేకుండా, గ్రామఫోను రికార్డులా తెగవాగినమాట నిజమే! కానీ ఈ వాగుడుకు వస్తువును సరఫరా చేయవలసిన తలలో మాత్రం ప్రమీలాదేవిని గురించిన తలపులు, ప్రేమానందాన్ని గురించిన వూహాలు కలగాపులగంగా రంగుల రాట్నంలా గిర్రున తిరిగిపోయాయి!

ఫోర్తుఫారం సెక్షనుకు సైన్సుపాఠంలో ఒక చిన్న ప్రయోగంచేసి చూపించవలసి వచ్చింది. వత్తిలా

కొరకు అట్టముక్కకు ఓ వైపున చిలకబొమ్మ, మరో వైపున పంజరం బొమ్మ చిత్రింపబడి వుంటాయి. ఆ అట్టను గిర్రున త్రిప్పినట్టయితే చిలుక పంజరంలో వున్నట్టు కన్పిస్తుంది. ప్రయోగాన్ని చేసి చూపిస్తున్నంత సేపు నేను నా దూరవసిక సందలనాన్నే కుర్రాళ్ళ ఎదుట ప్రదర్శిస్తున్నానేమో అని భ్రమింపవలసి వచ్చింది!

మూడు పీరియడ్లూ మూడు యుగాల్లా గడచిపోయాయి. గడచి స్టైక్కవంటి సంతృప్తితో టీచర్స్ రూములో ప్రవేశించాను. గదిలో శర్మగారు, మేథ్స్ యల్. టి. వెంకటసుబ్బయ్యగారు తప్పితే మరెవ్వరూ లేరు. వెంకటసుబ్బయ్యగారు పేపరు చూస్తున్నారు. శర్మగారు ఎర్రసిరా కలంతో కాంపోజిషన్ పుస్తకాలపైన శస్త్రచికిత్స గావిస్తున్నారు.

ఐదు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఉన్నట్టుండి శర్మగారే నోరు తెరిచేశారు.

"ఆహాహా, ఏం కుర్రాళ్ళండీ! మన అదృష్టం కొద్దీ దొరికిన మణి పూసలు గదండీ! ఒక ప్రబుద్ధుడు వ్రాస్తున్నాడు కుధిమాటట, 'కుధిమాట!'"—శర్మగారు కలం టేబిలు సొరుగులో పారవేశారు. సులోచనాలు తీసి టేబిలుపైన వుంచి మళ్ళీ ప్రారంభించారు. "అసలిక్కడే కాదు. నేను వెయ్యిచోట్ల చూపిస్తాను. ఒకాయన 'ప్రథమ కిరాణ్ప' అంటాడు. ఇంకొకాయన మొంగమాటం లేకుండా 'కుంపివృష్టి' అని వ్రాసేస్తాడు. ఇలాటి సమాసాల్ని ఏమంటారో ఎరుగుదురా కృష్ణమూర్తిగారూ?"

ఏమంటారని నేనడగలేదు. వెంకటసుబ్బయ్యగారు అడిగారు.

"దుష్ట సమాసమంటారు." ముదలంకించుకున్నారు శర్మగారు. "నాకు తెలియక అడుగుతాను. తాత చార్లకూ, పీర్లపండుగకూ ముడి పెట్టాలంటే కుదురుతుందటండీ? ఐతే ఒకటి, యిలాటి స్నేహితాలు, దాంపత్యాలూ ప్రపంచంలో లేవా అని మీరు అడుగవచ్చు. నిజానికి వుండకూడదు, కానీ వున్నాయి, మహాకవులుగూడా—వాళ్ళ విజ్ఞతను శంకించడం కాదుగానీ, ఎందుచేతనో మరి 'కపిలగడ్డము' అన్నారు. 'కలకంఠకుం' అన్నారు. చెప్పవచ్చిందేమిటంటే వెంకటసుబ్బయ్యగారూ, మహాకవుల్లాగా నే భగవంతుడు కూడా అప్పుడప్పుడూ పొరబడుతున్నాడేమో అనిపిస్తుంది."

"ఎంత మాటెంతమాట? కానీ ఈ ఉపోద్ఘాతమంతా ఎందుకండీ?" అన్నారు వెంకటసుబ్బయ్యగారు. సుబ్బయ్యగారికి శర్మగారి సమాసాల గొడవేమీ తలకెక్కినట్టు లేదు. పోనీ, ఉపాధ్యాయ వృత్తిలో తల బట్టగట్టి పోతున్నప్పటికీ, తెలియకపోయినా తెలిసినట్టు ప్రవర్తించగల నటనా కౌశలంకూడా ఆయనకి వచ్చినట్టు లేదు!

"మీకే మాటగానీ స్పష్టంగా చెప్పకపోతే బోధపడదు సుబ్బయ్యగారూ! ఆ పిల్లకి ప్రేమానందం మళ్ళీ వచ్చి వూళ్ళో దిగబడిపోయాడు" అని, అంతటితో తన పని తీరిపోయినట్టు శర్మగారు టేబిలులో నుంచి పొడిడబ్బీ పైకి తీశారు.

"వచ్చాడా! వాడు! వాడికి ముఖమెలా చెల్లిందండీ! అయితే అందుకే నన్నమాట కౌజాబల్ లీవు! ఆ మానాభిమానాల్లేని పచ్చి మోసగాడు, దమ్మిడీకి కొరగాని దవట, వాడు రావడమున్నా ఈ మొగారు మళ్ళీ వాణ్ణియింట్లో చేరనివ్వడమూ నా! గోహత్య చేయవచ్చుగదండీ వాడి ముఖం చూడ్డంకంటే! వాడూ ఒక మనిషే, అది ఒక బ్రతుకే! ఛీ..."

వెంకటసుబ్బయ్య గారిలో అతి విచిత్రమైన పరిణామం ప్రారంభమైంది. ఆయన హ్రస్వకాయుడు. సంధ్యారాగంలాంటి శరీరచ్ఛాయ. ఎప్పుడు చిరునవ్వుతో కందగడ్డలాంటిముఖం. చంద్రబింబానికి మల్లే కోపానికి కూడా పదహారు కళలనుకున్నట్టయితే, ఆయన ఒక్కొక్క మాట అంటుండగా ఒక్కొక్క కళ ఒకోక నీడలా ఆ ముఖంలో హత్తుకోసాగింది. ఆ కోపం తాకిడికి ఆయన వేడి నూనెలో వేసుకున్న తినుబండంలా అపాదమస్తకమూ కంపించి పోసాగాడు.

"అయినా, పనికాదు. రెండువందల రూపాయలు. ఇటు స్కూల్లో చాకిరీచేసూ, రాత్రుల్లో మేలుకుని పేపర్లు కరెక్టు చేయగా ముట్టిన ప్రతిఫలమండీ! ఆమె చెక్కు మార్చిందో లేదో, వీడు డబ్బు చేతబట్టుకుని పరారీ చిత్తగిస్తాడా? చిన్న చేతులకు గాజులు చేసి పెట్టాలని ఆమె చెబితే, రేపే తీసుకొస్తాను లెమ్మన్న పెద్దమనిషికి రెండు నెలల తర్వాత ఈ నాటికి దోవ తెలిసిందా? కట్టుకున్న భార్యమీద లేకపోతే పోయె, కన్నబిడ్డపైనకూడా మమకారం లేకపోతే వాడిని మనిషి అని ఎందుకనాలండీ? ఏం, ఎందుకు పశువనకూడదు? ఐనా యింతటి నైచ్యమూ? ఇంత దారుణమా? ఇంత..."

వెంకటసుబ్బయ్యగారు పళ్ళు పటపట కొరుకుతూ పైకి లేచారు. ఆయన మనోవీధిలో వరుసగా మూడు స్వరాలు పరుగెత్తుతున్నాయి. మొదటిది ఆవేశం. రెండోది ఖేదం. మూడోది భయం. మొదటి స్వరం శరవేగంతో పరుగెత్తుతోంది. రెండో స్వరం మొదటిదాని అడుగుజాడల వెంబడే దౌడు తీయగలుగుతోంది. మూడో స్వరం మాత్రం బాగా వెనకబడిపోయింది. ఈ పరుగుపందెం తాలూకు సంక్షోభానికి ఆయన ముఖమంతటా సన్నసన్నని చెమట క్రమ్ముకుంటోంది.

"మీరు నమ్మితే నమ్మండి, నమ్మకపోతే పోండి. ఆమెకు రెండంటే రెండు చీరలు మాత్రమే వున్నాయి. మీరు కావలిస్తే వాకబు చేసి చూడండి, ప్రతినెలా చాకలక్కకు బాకీ! పాలవాడికి బాకీ. ఇంటద్దె బకాయి. సంపాదనంతా వీడు తన వాత గొట్టుక పోతుంటే ఆమె సంసారాన్ని ఎలా ఎలా ఈదగలదో చెప్పండి"

"మీకేం చెప్పగలనండీ! అసలు నేను ప్రపంచంలోనే సంచరిస్తున్నానా, లేకపోతే ఏదైనా నాటకాన్ని చూస్తున్నానా అని నాకే తెలియకుండావుంది" అన్నాను.

వెంకటసుబ్బయ్యగారు మళ్ళీ కుర్చీలో కూర్చున్నారు. ఆవేశం కాస్త తగ్గుముఖం పడుతుందేమోనని కళ్లుమూసుకున్నారు. కానీ చెప్పవలసిందంతా చెప్పేస్తేగానీ ఆవేశం ఉపశమించే సూచనలు లేవు.

"ఏమనుకుంటున్నారో, వాడు నీటిలో చేపకు ఈత నేర్పించే ఘటమండీ! ఈ రోజు నిమిదో తారీఖు. ఎంత ఆలస్యమైనా పదో తేదీలోగా జీతం రాక తప్పదని వాడికి బాగా తెలుసు. చూడరా, సమయానికి ఆటెండెన్సు యిచ్చేశాడు. డబ్బు చేతికిరాగానే బస్సెక్కేస్తాడు. నేను వున్నదీ లేనిదీ కల్పించి చెబుతున్నాననుకుంటున్నారేమో! అబ్బే, నాకెందుకొచ్చిందండీ! అదిగో వినండి, గంటకూడా మ్రోగింది. సరేనా కృష్ణమూర్తిగారూ!"

ఎదుటివారి బాధను తనలో పలకరించగల చిత్తశుద్ధి చాలా తక్కువమందికి వుంటుంది. అందుచేతనే గావచ్చు జగన్నాటకంలో వెంకటసుబ్బయ్యగారి లాంటి 'కారెక్టర్' నటులు అరుదుగా కనిపిస్తారు.

ఇంతలో మరపురచ్చేవిగావు ఆయన మాటలు! నేను అయ్యరుగారి పూరిపాకకు వెళ్ళి భోజనంచేశాను. మళ్ళీ స్కూలుకు తిరిగి వచ్చాను. మధ్యాహ్నానంతరం రెండు పీరియడ్లు క్లాసు తీసుకున్నాను. కానీ ఆయన మాటలు మాత్రం చెవుల్లో రింగురింగుమని మారుమ్రోగిపోతూనే వున్నాయి.

సాయంత్రం అయిదుగంటల వేళ. నిర్జనంగా వున్న పాఠశాల పరిసరాల్లో ఓమూలగా వెళ్ళి యిసుకలో కూర్చున్నాను. "ఇక్కడున్నారా మేష్టరుగారూ! మీకోసం ఎక్కడెక్కడ వెదికానని!" అంటూ పరుగునా వచ్చి మురళి యిసుకలో దూరాడు.

"అక్కయ్యేది?" అని ప్రశ్నించాను.

"నాతోనే వచ్చిందే! ఏదీ! అదిగో! రావే అక్కయ్యా! మన మేష్టారేగదూ! సిగ్గెందుకూ" అంటూ మురళి సుశీలను చెట్టువెనకనుంచీ వాడిగిరికి లాక్కొచ్చాడు.

పిల్లలతో కలిసి యిసుకలో పిచ్చుక గూళ్ళు కట్టకోవాలనిపించింది. కానీ పిచ్చుక గూళ్ళు కట్టకోవలసిన పిల్లలే నాకంటే గంభీరంగా కూర్చున్నారు. మురళి నాజేబులోనుంచీ డైరీతీసుకుని దీక్షగా పరిశీలిస్తున్నాడు.

"ఊరినుంచీ నాన్నగారొచ్చారటగా మురళీ!" అన్నాను.

మురళి తలపైకెత్తి నాకళ్లల్లోకి చూశాడు. వెంటనే ఏదో నేరంచేసినవాడిలా తల దించేసుకున్నాడు.

అయ్యో పాపం! నా ప్రశ్నవల్ల వాడి లేత మనసుకు బాధకలిగిందేమో! ఐనా కుర్రవాళ్ళింత 'సెన్సిటివ్'గా వుండకూడదు.

కాసేపు ముగ్గురమూ మౌనంగా కూర్చున్నాము. "ఇంటికి వెళ్దాంరా మురళీ" అంది సుశీల.

"అప్పుడే యింటికెందుకు? ఇందాకా ఏడ్చింది చాలదూ!" అన్నాడు మురళి.

"ఏడవడం ఎందుకూ? ఏం జరిగింది మురళీ?" అన్నాను.

"ఏడవకేం చేస్తుంది? గాజులు తెస్తారులే, తెస్తానులే అని అమ్మ ఆశ పెట్టింది. తీరా చూస్తే గాజులూ లేవు, గీజులూ లేవు. ఎక్కడ అని అడిగితే

కొట్టుకోయారు. గాజులు లేకపోతే మానె, కొట్టకుంటే చాలు..."

"ఊరుకోరా మురళీ!" సజల నేత్రాలను వాడు కనిపించకుండా ముఖం అటుకి త్రిప్పుకుంది సుశీల.

"చూడండి మేష్టరుగారూ! మళ్లీ ఏడుస్తోంది" అన్నాడు మురళి.

"ఛా, ఏడవక మెంగుకు సుశీలా! తప్పు కాదూ" అంటూ ఆ అమ్మాయిని దగ్గరికి తీసుకున్నాను. వాడిన మల్లెపువ్వులా క్రుంగిపోతూ ఆ పిల్ల వెక్కి వెక్కి ఏడువ సాగింది.

ఏడ్చి, ఏడ్చి తనకు తానే పూరడిల్లింది సుశీల. కళ్ళు తుడుచుకుంటూ దూరంగా జరిగి యిసుకలో నిశ్చలంగా కూర్చుంది.

కన్నీరు విడవడం, కష్టాలు భరించడం—యిదే గదా భారతదేశపు సతీత్వం అన్నాడు రవీంద్ర కవీంద్రుడు. సుశీలను చూస్తుంటే ఆమె బాధాసహిష్ణుతను తరిచిచూపుతున్నట్టు తోచింది.

ప్రొద్దుపోయి చీకటి పడబోతుండగా పిల్లలు యింటికి వెళ్ళిపోయారు.

హెడ్‌మిస్ట్రెస్ గారు మరునాడుకూడా లీవును పొడిగించారు. మూడోరోజు వుదయానగానీ ఆమెను కలుసుకోవడం తటస్థించలేదు.

"రెండు రోజులుగా కనిపించారు గారే!" అంటూ ఆమె పలకరించింది.

"మీరు స్కూలుకు రాలేదుగదండీ!" అన్నాను.

"అవును. రాలేదు. ఇంటిదగ్గర పనులుండి నిలిచిపోయాను" స్వగతంలా మెల్లగ చెప్పుకుంది ప్రమీలాదేవి.

ఆరోజు సాయంత్రం పికారుకు తప్పకుండా వస్తానని మురళికి మాట యిచ్చాను. కాఫీత్రాగి అయ్యరుగారి పాకలోనుంచి బయటకు వచ్చేసరికి రోడ్డులో శర్మగారు తారసిల్లారు.

'అతగాడింట్లో లేడండీ! మధ్యాహ్నమే వెళ్ళిపోయినట్టున్నాడు" అన్నారు శర్మగారు.

"అలాగా! మీ రెక్కడికి వెళ్తున్నారేమిటి?" అని ప్రశ్నించాను.

శర్మగారు జేబులోనుంచీ తూమిడిపిందెల పొట్లపు పైకితీశారు. ఓక్షణంపాటు నన్ను చూడనిచ్చి, మళ్ళీ దాన్ని జేబులో వేసుకుంటూ "దీన్ని తాకట్టుపుంచి నూరురూపాయలు తెచ్చిపెడమని అజ్ఞ. కాకపోతే వేడికోలు" అన్నారు.

నా తల దిమ్ముతిరిగింది.

"ఎందుకూ?" అప్రయత్నంగా అడిగాను.

"పైసా చేతిలో లేకపోతే ఈ నెలంతా ఎలా జరుగుతుందండీ?" పిచ్చిగా నవ్వుతూ అన్నారు శర్మగారు.

* * * *

వెంకటసుబ్బయ్యగారు తమ పలుకుబడిని వినియోగించి చెరకు బెల్లం గిడ్డంగిగా వుపయోగంలో వున్న మంటి మిద్దెలో ముందుభాగాన్ని ఖాళీ చేయించి నాకిప్పించారు. నాకు పూర్వం ఆ మంటి మిద్దెలో పందికొక్కులు కాపురముండేవి. ఇప్పుడుకూడా పుట్టింటిపైన మోజును విడవాడుకోలేక అవి ఏ అర్థరాత్రిప్పుడో వచ్చి, జీవాలవా, పాలవా విచారించి పారిపెట్టి పంపలేక పోతుండడంచేత రుసరుసలాడుతూ వెళ్ళిపోతున్నాయి. కూర, చారు, మజ్జిగ అని ఓ చిన్న జాబితా యిచ్చి, అంతకంటే మరేమీ ఆశించడానికి వీలుండదన్న అయ్యరు తన మనసును తానే అతిక్రమించి అన్నంతో కలిపి రాళ్ళను, కూరతో కలిపి చింతగింజలనూ వడ్డిస్తున్నాడు. స్కూల్లో గడియారాన్ననుసరించి గంట మ్రోగుతోంది. పిలలను మేరకు పాఠాలు జరుగుతున్నాయి. ఐతే ఎవరికోరకు గంట మ్రోగుతోందో, ఎవరికోసం పాఠాలు బోధింపబడుతున్నాయో ఆ కుర్రకుర్రమాత్రం చదువుసంగతి అంతగా పట్టించుకోవడంలేదు. వాళ్ళు మాటి మాటికీ అడ్డుదగిలి ప్రశ్నలతో విసిగిస్తారు. లేదా తమంతట తామే యిదివరకెక్కడా లేని క్రొత్తసిద్ధాంతాలను ప్రతిపాదిస్తారు. ఆ ప్రశ్నలకు బదులు చెప్పలేక, ఆ సిద్ధాంతాలను పూర్వపక్షం చేయలేక ఉపాధ్యాయులు సతమతమౌతున్నారు.

అన్నింటికన్నా ముఖ్యమైన విషయం, ఈ మధ్య ఫిరంగిపురానికి ప్రేమానందంగారి దర్శన భాగ్యం కలుగలేదు. ఎక్స్‌ప్రెస్ డెలివరీలో వుత్తరం వ్రాసి టి. యం. ఓ. ద్వారా ఏభైరూపాయలు గుంజుకున్నాడన్న వార్తమాత్రం విశ్వసనీయ వర్గాలద్వారా తెలిసింది.

గానుగ చక్రంలా జీవితం ఒకగాడిలో పడిపోయినతర్వాత రోజులు ఒళ్ళు తెలియకుండా వెళ్ళి

పోయేటట్టున్నాయి! చూస్తూ చూస్తూ వుండగానే రెండు మూడు మాసాలు చల్లగా కాలగర్భంలోనికి దొర్లిపోయాయి.

ఆరోజు సోమవారం. పది పదిహేను రోజుల్లో క్వార్టర్లీ పరీక్షలు జరుగనున్నాయి. ప్రశ్నపత్రం 'సెటప్' చేయటంలో కలిగిన సందేహాలను నివృత్తి చేసుకోదలచి కొంత త్వరగా స్కూలుకు బయలుదేరాను. నేను వెళ్ళేసరికి టీచర్స్‌రూములో ఎవరూ లేరు. కేవలం పోలికకోసమే చెబుతున్నాను, ఎవరుండినా ఎవరుండకపోయినా గోడదగ్గర గంట వక్కలా నీలకంఠానికి ఆఫీసురూములో కూర్చుని పని చేయకపోతే తీరదు. నేను ద్వారందగ్గర కనిపించగానే "ఈ సంగతి విన్నారా కృష్ణమూర్తీ!" అన్నాడు నీలకంఠం. ఏమిటన్నాను.

నీలకంఠం చేతులు పైకెత్తి, ఒళ్ళువిరుచుకుంటూ "హెడ్‌మిస్ట్రెస్ గారు నాలుగురోజులు సెలవు పెట్టేశారు" అన్నాడు.

"కొంపదీసి మళ్ళీ ఆతడొచ్చిపడలేదు గదండీ!" ఈ మాటల్ని నేను బహుశా నిద్రలో కలవరించినట్టుగా అనివుంటాను.

"ఏమో ఎవరికి తెలుసును? ఒకవేళ వచ్చేశాడేమో! లేకుంటే రాబోతున్నాడేమో! రాదలచుకుంటే అతణ్ణి ఆపేవాళ్ళెవ్వరు? పోదలచుకుంటే పట్టేవాళ్ళెవ్వరు?"

ఆశ్చర్యమేమిటంటే ఊళ్ళో పిల్లి ప్రసవించిన వార్తనుకూడా ముందుగా పసిగట్టగల శర్మగారు సైతం హెడ్‌మిస్ట్రెస్ గారి సెలవుచీటీనిచూచి ఆశ్చర్యాన్నే ప్రకటించారు.

"వచ్చేశాడేమోనండీ! లేకపోతే యిప్పుడీ సెలవెందుకు? వాడు ధూమకేతువు. ఫలానప్పుడు, ఫలానా చోట కనిపిస్తాడని మనం వూహించలేము. కానీ ఎక్కడెక్కడైతే వాడు కనిపిస్తాడో అక్కడల్లా అరిష్టమే!" అంటూ శర్మగారు ఆ వార్తపైన సంగ్రహంగా వ్యాఖ్యానించారు.

ఇక వెంకటసుబ్బయ్యగారి సంగతి సరేసరి! ఆయన టీచర్స్‌రూములో ఉగ్రనరసింహావతారమే అయిపోయారు.

కానీ తోకగూడా సరిగ్గా కనిపించకముందే పులినిగురించి వూహించుకున్నందుకు మేమందరమూ సమిష్టిగా కించపడవలసి వచ్చింది.

ఆరోజు సాయంత్రం యింటికి వెళ్ళేసరికి, స్కూలునుంచీ సరాసరి అక్కడికివచ్చి నాకోసం వేచివున్న మురళీ కనిపించాడు.

"అరేంమురళీ! నువ్వొక్కడివే వచ్చావు" అన్నాను.

"అక్కయ్య స్కూలుకు రాలేదు. అమ్మకు జ్వరంగా వుందిగా!... అన్నాడు మురళీ.

"జ్వరంగావుందా? నిజంగా" అంటూ తెల్లబోయాను.

"రాత్రంతా జ్వరం కాసిందట. నాకు తెలీదు. అక్కే చెప్పింది. మధ్యాహ్నం నేనుకూడా చూచాను. ఒళ్ళు పెనంలా కాలిపోతోంది."

నిజమే! ఆ వచ్చినజ్వరం మురళి చెప్పినంత తీవ్రంగానే వచ్చింది. సూదిలోనికి మందెక్కిస్తున్న స్థానిక హోమియోపతీ డాక్టరు "వీలైతే మీరామెకు కొంత ధైర్యంచెప్పండి మేష్టరుగారూ! ఇది నిమోనియా! మనిషిని పీల్చి పిప్పిచేసే వాటిల్లో అన్నిజబ్బులూ దీనితరువాతనే. అందులోనూ ఆమె చాలా బలహీనంగావుంది" అన్నాడు.

తెల్లటిదుప్పటిపరచిన పట్టెమంచంపైన, తుంచి ఎండలో పారవేసిన ఆకులా శోషిల్లిపడిపోయివున్న రోగిని చూచేసరికి నాకు గుండె గుభేలుమంది.

"కూచోండి" అంది ప్రమీలాదేవి. ఆమాటబావి లోపలినుంచీ వచ్చినట్టుంది.

"ఇదేమిటి మేడమ్! ఒక్కరోజు జ్వరానికే యిలాగైపోతారా ఎక్కడైనా" అంటూ కుర్చీలో కూర్చున్నాను.

పైకప్పువంక చూస్తున్న ప్రమీలాదేవి ముఖం నావైపుకు త్రిప్పింది. త్రిప్పగానే నాడి చేతబట్టుకుని పైకొస్తున్న డాక్టరు ఆమె చూపు కెదురయ్యాడు. గట్టిగా పళ్ళు బిగపట్టుకుని, కళ్ళు మూసుకుంది ప్రమీలాదేవి.

ఇంజక్షను వేసి మందు తీసుకోవలసిన విధానాన్ని వివరించి డాక్టరు వెళ్ళిపోయినతరువాత చాలాసేపటి వరకూ నేనలాగే కూర్చుండిపోయాను. ఓపరికం

లేకపోవడం చేత వుండీ వుడిగీ అప్పుడొక మాటగా, ఇప్పుడొక మాటగా మాట్లాడుతోంది ప్రమీలాదేవి.

"వంటలమ్మని నాకు తోడుగా వుండిపొమ్మన్నాను. ఆమె అప్పుడప్పుడూ లేచి మందిస్తుంది. ఇప్పుడు పిల్లలు దిగులుపడిపోతారేమోననే నా బెంగ!"

"మీరు మరేం బెంగ పెట్టుకోకండి మేడమ్! నాకింతకంటే పనేముంది? మీ కారోగ్యం కుదిరేంతవరకూ నేనూ యిక్కడే వుంటాను" అన్నాను.

"అంతకంటేనా కృష్ణమూర్తీ! మీరు దగ్గరుంటే మరి ధైర్యంగా వుంటాదు."

ఆపూట నేనుకూడా అక్కడే భోజనం చేశాను. పిల్లలకు పడుకోగానే నిద్రపట్టింది. నేనూ నిద్రపోయే ప్రయత్నంలో వున్నాను.

"కృష్ణమూర్తీ!" పిలిచింది ప్రమీలాదేవి.

గదిలోపలికి వెళ్ళాను. "నిద్రొస్తున్నదేమిటి?" ఆమె ప్రశ్నించింది.

"అబ్బే, లేదు మేడమ్! పది పదకొండుగంటల దాకా చదువుకోడం నావాడుక" అన్నాను.

"ఐతే కూచోండి." పళ్ళమని కాస్తున్న జ్వరం కుష్కి భూతమైన ఆమె శరీరంలో ఒదిగివుండలేక నిగనిగలాడుతున్న అగ్గిమీద సెగలా నిట్టూర్పులరూపంతో బయటపడుతోంది. కదులుతున్న ఆ పెదవులకు వెనుక, విషాద విశదమౌతున్న ఆ ముఖానికి వెనుక ఆమె హృదయంలో ఏదో తుపాను చెలరేగుతోందని నేను పోల్చుకోగలిగాను.

"ఇది నాకు కొత్తకాదు. ప్రతిసంవత్సరమూ ఇలా ఏదోఒకటి ముంచుకొస్తుంది. ఉన్నట్టుండి నేను కళ్ళుమూసుకు పోతాననుకోండి కృష్ణమూర్తీ! ఈ పిల్లలగతేం కావాలి?" ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు క్రమ్ముకున్నాయి.

"ఊరుకోండి మేడమ్! ఇలాంటి ఊహలలో మీరిప్పుడు మనసును పాడుచేసుకోడం మంచిదికాదు" కాసేపు తటపటాయించి మళ్ళీ అన్నాను "ఆయన కొక జాబు వ్రాయకూడదా మేడమ్?"

"చిరునామా లేని మనిషికి జాబెలా వ్రాస్తారు? మీరు లోకంలో ఎన్ని విచిత్రాలనయినా చూచి వుంటారు. కానీ యిలాంటివిడ్డూరం మాత్రం మీకు కనిపించివుండదు. మనం ఉద్యోగాలు చేయడం మిద్దెమీద మిద్దెకట్టడానికి కాదు. కానీ లోకంలోవున్న దుర్వ్యసనాలన్నీ ఈ ఒక్క మనిషిదగ్గరే వుంటే నా సంపాదన ఎక్కడికి చాలుతుంది? ఒక్క సిగరెట్లు కాదు. ఒక్క పేకాట కాదు. ఒక్క గుర్రప్పందాలు కాదు. వంద రూపాయలిచ్చినా చాలదు అప్పుచేసి రెండువందల రూపాయ లిచ్చినా చాలదు. ప్రయత్నలోపం జరిగిందనుకోకండి కృష్ణమూర్తీ! ప్రాధేయపడ్డాను. ప్రతిమాలుకున్నాను. గోడకు తలకొట్టుకున్నాను లాభం లేకపోయింది. ఇచ్చిన వాగ్దానాలు, చెప్పిన నమ్మకాలు అన్నీ గంగపాలు. త్రాగను త్రాగనని ఒట్టు పెట్టుకుని కల్లుపాకలో ప్రవేశించినవాడి కథ మీకు తెలిసేవుంటుంది."

"ఆఖరుకు చెడిపోయేదెవరు కృష్ణమూర్తీ?" అగ్నిపర్వతం చీల్చుకుని పైకివెలువడిన లావాద్రవం లాంటి ఈ ప్రశ్నల తాకిడికి వులికిపడ్డాను. ప్రమీలాదేవి దీనంగా ప్రశ్నిస్తోంది "నాబిడ్డలేగదూ?"... భగవంతుడి దయవల్ల నాకింకా నూకలు బాకీవున్నాయనుకోండి. కానీ ఇంక పదేళ్ళుగడిచినా, యిరవయ్యేళ్ళు గడిచినా చివరకు నన్నెదుర్కోబోయే ప్రశ్న యిదేగదూ?"

నెమ్మదిగా వుండటంపోయి, ఉద్రేకం తెచ్చుకోడం వ్యాధికి మరింత దోహదం చేకూరుస్తుంది. పొగిలి పొగిలి రగులుకుంటున్న వుంపటిని నేను నా మాటలతో కలచివేయదలచుకోలేను.

పది పదిహేను నిమిషాలు మౌనంగా గడచిపోయిన తర్వాత "దీనికేదైనా వుపాయం చెప్పగలరా కృష్ణమూర్తీ" అంది ప్రమీలాదేవి.

నేనేదో చెప్పబోయాను. కానీ అంతలోనే ఆమె అడ్డుతగిలింది.

"ఇప్పుడే వద్దు. ఆలోచించి చెప్పండి."

నేనాలోచించాను. ఒకటికాదు, రెండుకాదు. వారంరోజుల పొడుగునా ఆలోచించాను. ఈ వారం రోజుల్లో జ్వరం తిరుగుముఖం పట్టింది. కానీ ఆమె మదిలోనూ, ఎదలోనూ తీవ్రకల్లోలం మాత్రం అలాగే వుండిపోయింది.

"ఏమాలోచించారు, ఏమాలోచించారు" అని ప్రమీలాదేవి నాలుగైదుసార్లు అడిగింది. ఆ ప్రశ్నలకు

నా మూకభావం మాత్రమే ఆమెకు సమాధానంగా లభించింది.

పరీక్షలు జరుగుతున్నాయి. మధ్యాహ్నంపైన క్లాసులకు వెళ్ళవలసిన అవసరం లేనందున యింట్లో పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటున్నాను. "అమ్మ పిలుమకి రమ్మంటోం"దని గసబోసుకుంటూ పరుగెత్తి వచ్చాడు మురళి.

"ఏమిటి మురళీ? ఏం జరిగింది" అన్నాను.

"వాడెవడో బానునుంచీ వచ్చాడు!"

"ఎవరు? ఎందుకొచ్చాడు?"

"ఎవరో మరి! పొడుగ్గా కోటు వేసుకున్నాడు. తలపాగా చుట్టుకున్నాడు. కళ్ళకు నీలం ఫోగద్దాలున్నాయి. ముక్కుకింద యింతింతలేసి మీసాలు కూడా వున్నాయండీ మేష్టారుగారూ!" అంటూ మురళి వచ్చినవాడి ఆకార విశేషాల్ని వర్ణించాడు.

ఆ అమీనా వేషధారి ఎవరో తెలియక విస్తుపోయాను. నేను వెళ్ళేసరికి అతను వరాండాలో తారట్లాడుతూ కనిపించాడు. ఓక్షణం అతణ్ణి ఎగాదిగా చూచి లోపలికి వెళ్లాను. ప్రమీలాదేవి తన చేతిలో వున్న చీటీని టేబిలుపైన వుంచింది.

ఆ చీటీలో ముక్తసరిగా నాలుగైదు వాక్యాలు మాత్రమే వున్నాయి.

"మైసూరులో దసరా వేడుకలు జరుగబోతున్నాయి. ఇదే ఆఖరుసారి...

(ఈయన దేశంపైకి బయల్దేరడానికి గాదు. మైసూరులో దసారా వేడుకలు జరగడానికి!)

"పాంట్లు, చొక్కాలు కావలసివచ్చాయి. బిల్లు నూరు రూపాయలదాకా తేలింది. డబ్బు యితనికి ముట్టచెప్పవలసినది..."

నా ప్రయత్నం లేకుండానే చీటీ ప్రేళ్ళ మధ్య నలిగిపోయింది. కోపంతో ఒళ్ళు మరచిపోవలసిన అవసరం నాకెన్నడూ కలుగలేదు. కాని ఈ సంఘటన నన్ను పునాదులనుంచీ కదలించి వేసింది. కొత్త దుస్తులతో ముస్తాబై మగడు పూలరంగడికిమల్లే మైసూరు వేడుకలకు బయల్దేరితే, ఓగ్లాసుడు పాలుగూడా త్రాగడానికి త్రాగలేక మంచంపైన పడివున్న భార్య అతను డాబుసరికోసం చేసిన బాకీ చెల్లించడమా! ఇది అన్యాయం. అక్రమం.

దరదరా బయటికి వెళ్ళి ఆ చీటీని అగంతకుడి ముఖాన విసరికొట్టాను. "చీటి యిచ్చాడు గదా అని పనిగట్టుకుని యిలా పరుగెత్తి రావడం మీ తెలివితక్కువ. ఎవరికిచ్చారో వారిదగ్గరే మీరు డబ్బు వసూలు చేసుకోవచ్చు" అన్నాను.

"వద్దోదు. మీరిలా రండి కృష్ణమూర్తి!" కిటికీ తలుపులు తీసి మళ్ళీ నన్ను లోపలికి పిలిచింది ప్రమీలాదేవి.

"మీరనే దేమిటి మేడమ్! ఒకదసారా సంబరాలేగావు దేశంలో జరిగేవి! బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. తెప్పతిరణాళ్ళు జరుగుతాయి. ఎగ్జిబిషను జరుగుతాయి. ఆయన వాటిని చిత్తగించదలచుకున్నప్పుడల్లా మీకిలా పర్వానా జారీ చేసేస్తాడు. ఎక్కడినుంచీ తేగలను మీరు డబ్బు?"

"ఆ చీటీలోని మాటలలోనే చెబుతున్నాను కృష్ణమూర్తి! ఇదే ఆఖరుసారి. నా దగ్గర ఏభై రూపాయలున్నాయి. మిగిలిన యాభై రూపాయలను శర్మగారి నడగండి."

ప్రేమానందంగారి చెక్కు ప్రమీలాదేవిగారి బ్యాంకులో మారిన తక్షణం అమీనా వేషధారి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

"చివరకు మీరు చేయదలచుకున్న దేమిటి మేడమ్?" నిక్కచ్చిగా అడిగేశాను.

"మీ రేమాలోచించారు?" అంది ప్రమీలాదేవి.

ఆ అంతిమోపాయ మేదో ఆమెకూ తెలుసు. నాకూ తెలుసు. కానీ ఆమాట నా నోటనుంచే రాబట్టాలని ఆమె ఆమె నోటినుంచె రాబట్టాలని నేనూ, వారం రోజులనుంచీ విశ్వప్రయత్నం చేశాము. ఆఖరుకు ఈ ప్రయత్నంలో ఆమె గెలిచింది, నేనే ఓడిపోయాను.

"తరతరాల సాంప్రదాయంపట్ల నాకు గౌరవం లేదనుకోకండి మేడమ్! కానీ పెద్దలేమన్నారు? దుష్టాంగాన్ని ఛేదించి మిగిలినవాటిని రక్షించుకోడం అవశ్యకర్తవ్యమన్నారు. మన విశ్వాసాలకూ, మన సంఘవ్యవస్థకూ విడాకులచట్టం సరిపోదని నేను భావించేవాణ్ణి. కానీ ఈ లోకం మన మనుకున్నంత మంచిది గాకపోవడం అటుంచెగా, మంచిని గానీ పెట్టే ప్రవృత్తిగూడా యిక్కడ విద్యల విడిగా కనిపిస్తోంది. అందుచేత నేనీ రోజున ఆ చట్టంయొక్క అవశ్యకతను

గుర్తిస్తున్నాను. ఎటొచ్చినాసరే, కొన్ని కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో దాని ఆవశ్యకతను గుర్తింపక తీరదేమో ననే నా వుద్దేశం..."

"నా నిర్ణయమూ అదే" అంది ప్రమీలాదేవి.

నాకు పట్టరానంత ఆనందం కలిగింది. వరదల్లో కొట్టుకపోతున్న ప్రాణిని ఒడ్డుకు చేర్చినప్పుడు కలిగే ఆనందం ఎలాటిది? సరిగ్గా నాకలాటి ఆనందం కలిగింది.

వివాహం ఆచారం ప్రకారం జరిగితే, విడాకులు చట్టాన్ననుసరించి రూపొందుతాయి. ఆరునెల మునుపటినుంచీ వివాహానికి సన్నాహం అవసరమైనట్టే, విడాకులకుకూడా చట్టరీత్యా ఎంతో కొంత తతంగం జరుగవలసివుంటుంది. అక్కడ శుభకార్యానికి సూత్రధారి పురోహితుడైతే, యిక్కడ పౌరోహిత్యం వకీలు గారిది!

"నామిత్రుడొకడు బి. యల్. చదివి యిటీవలే ప్రాక్టీసు ప్రారంభించాడు. అతడితో మాట్లాడమంటారా మేడమ్" అని అడిగాను.

"ఎలాగు మీరు సెలవుల్లో వూరికి వెళ్తున్నారు గదూ! అతడితో మాట్లాడి రావడానికి మరచిపోకండి" అంది ప్రమీలాదేవి.

* * *

ఇరవైరోజుల దసరా సెలవులు యిట్టే గడచిపోయాయి. మరునాటివుదయం స్కూలు తెరువబోతున్నారనగా క్రితంరోజు మధ్యాహ్నం బస్సెక్కు బయల్దేరాను—బస్సు గమ్యస్థానం చేరుకునేసరికి వృద్ధభానుడు పడమటి కొండచాటున క్రుంకుతూ క్రుంకుతూ వున్నాడు.

పెట్టెనూ, పరుపునూ బసలో దించి సరాసరి హెడ్ మిస్ట్రెస్ గారి యింటికి దారితీశాను. చూచి రమ్మంటే కాల్చివచ్చినంతపని చేసినందుకు అభినందనలతోపాటు నాకు కాఫీకూడా దొరక్కపోదని నమ్మకం.

వీధి మెట్లెక్కాను. వరండా దాటుకున్నాను, హాల్లో ప్రవేశించాను. నిలువునా ముస్తాబై షికారుకో, సినిమాకో వెళ్ళబోతున్న వేషంతో, అరమోడ్పు కన్నులతో ఈజీ చేర్ లో పవ్వళించిన ప్రమీలాదేవి నాకు హాల్లో ప్రత్యక్షమయింది.

"నమస్తే మేడమ్" అన్నాను.

ఆమె వులికిపడి కళ్ళు తెరిచేసింది. నేను పొరపాటు పడలేదనుకుంటాను, ఆమె ముఖం వెలవెల పోయింది.

"ఒంటరిగా కూర్చున్నారేం మేడమ్! పిల్లలేరీ?" అంటూ ఓ కుర్చీని ఆమెకు దగ్గరగా వేసుకున్నాను.

"పిల్లలు తోటలో ఆడుకుంటున్నారు."

ఊళ్లో విశేషాలేమిటని ఆమె అడుగుతుందని నేను కాసేపు వేచి చూచాను. ఎంతకూ ఆమె పల్లు పలకరించకపోయేసరికి, నేనే అలా ప్రశ్నించవలసి వచ్చింది.

"విశేషాలా! ఏమున్నాయి? ఏమీ లేవు" ప్రమీలాదేవి నవ్వడానికి ప్రయత్నించింది. ఎంతో ప్రయత్నంమీద పెదవులదాకా ప్రాకి వచ్చిన ఆ నవ్వు ఎంత కృత్రిమంగా తయారు కావాలో అంత కృత్రిమంగా తయారై ఆమెలో రేగుతున్న ఆందోళన నాకు సువ్యక్తం కావడానికి మాత్రమే తోడ్పడింది.

మళ్ళీ నేనే సంభాషణకు ఉపక్రమించాను.

"నేను లాయర్ని కలుసుకున్నాను మేడమ్..."

"ఊరుకోం డూరుకోండి." తొట్రుపాటుతో, తడబడుతున్న గొంతుకతో ఆమె నన్ను ఊరుకోమని అపహరించడం పూర్తి కానేలేదు. గదిలోనుంచీ సన్నగా ఈల వినిపించింది!

నేను కుర్చీలో స్తంభించిపోయాను.

"వచ్చెడివాడు ఫల్గునుడు. ఆ శింఖారావం మరొకరిది కాదు. దచ్చి సేయంగల విన్నపాలతో యింతదూరం తరుముకొచ్చిన ఆలమందలు మనవిగావు." అనుకుంటూ మ్రాన్పడిపోయిన కారణసేన నామదిలో మెదలుతూంది.

"మరొక విశేషమేమిటంటే ప్రమీలా, మైసూరులో......"

అతడు హాల్లోకి వచ్చి నేనొకణ్ణి కళ్లబడగానే ప్రసంగం ఆపి "యితడెవరు" అన్నాడు.

"ఈయన కృష్ణమూర్తి అని, మా స్కూల్లో అసిస్టె......"

"సర్లే, మరి మైసూరులో బృందావన్ గార్డెన్సున్నాయి ప్రమీలా! హబ్బ. వండర్ ఫుల్ !

ఆ లోకంనుంచీ నందనవనం అలాగే క్రిందికి అవతరించిందంటే నమ్ము! ఎందుకూ, కాశ్మీర్ లో షాలిమార్ ఉద్యానవనాలు యింకా బాగుంటాయట! మనమింకా పెళ్లి కేదనుకో, ఈ మధ్య ఒక సినిమాలో చూచాను. అన్నట్టు సినిమా అంటే జ్ఞాపకం వచ్చింది, బెంగుళూర్ లో ఓ థియేటరుంది ప్రమీలా! దానికదే సాటి! ఇంకొక విచిత్రం విన్నావూ, ఆ థియేటర్లో టికెట్టిచ్చేవాళ్లందరూ ఆడవాళ్ళే! అందరూ ఆంగ్లో యిండియన్లు! నువ్వేమైనా చెప్పు ప్రమీలా, సోయగమంటే వాళ్లది సోయగం! ఎందుకూ, పార్సీలు కూడా బాగానే వుంటారు..."

నా శరీరంపైన తేళ్ళూ జెర్రులూ ప్రాకుతున్నాయి. అంతకుపైన అక్కడ కూచోలేకపోయాను. 'వెళ్ళొస్తాను మేడమ్' అంటూ పైకి లేచి 'వెళ్ళిరండి' అని ఆమె సెలవిచ్చేంతవరకూ ఆలస్యం చేయకుండా బయటికి వచ్చేశాను.

పాకలో పొగ నిండించుకుని, చెంపలవెంట కన్నీరు కార్చుకుంటూ, పొయిమండక అవస్థపడుతున్న అయ్యరు "ఎప్పుడొచ్చారు బాబూ?" అని పలకరించాడు.

"ముందుకాఫీ! తరువాత తీరిగ్గా కుశల ప్రశ్నలకు సమాధానం" అన్నాను.

"పచ్చిపాలు, యిప్పుడే పొయిమీద పెట్టాల బాబూ! కాసేపాగాలి" అంటూ అయ్యరు కట్టెల కోసం పెరట్లోకి వెళ్ళారు.

సమయానికి నా బుర్ర తీవ్రంగా పనిచేసింది. జేబులోనుంచి విడాకులకు సంబంధించిన కాగితాల్ని పైకి తీశాను. శ్రద్ధగా అనుకుంటున్నాడు కదా అని నా మిత్రుడు సేకరించి యిచ్చిన ఆ కాగితాలన్నింటినీ పొయిలోపలికి విసిరాను.

ఒక నిమిషంలో పొయి మండింది. రెండు నిమిషాలకు పాలు కాగింది. మూడో నిమిషాలకల్లా అయ్యరు వేడివేడిగా కాఫీ కలిపేశాడు!

# కథాద్వయ కావ్యములు

శ్రీ విక్రాల శేషాచార్యులు

జాతే జగతి వాల్మీకౌ
కవి రిత్యభిధాఽభవత్
కవీ ఇతి తతో వ్యాసే
... ... ...
* * *

వాల్మీకి మహర్షి తొలుత శ్రీరామచంద్రుని నాయకునిగా జేసి శ్రీమద్రామాయణమును రచించి యాదికవియని కీర్తికిం బాత్రమై వెలిగె. పిదప వేదవ్యాస మహర్షి పెక్కు యుగములయందలి యనేక రాజర్షుల యొక్క చరిత్రములను ప్రతిపాదించు మహాభారతమును పదునెనిమిది మహాపురాణములను రచియించి కవులలో ద్వితీయ స్థానము నాక్రమించెను. అనంతరము కాళిదాస మాఘాదులు ఆ రామాయణ భారత పురాణములనుంచి యుపయుక్తములైన కథారత్నములం గ్రహించి తమ మనీషా నికషమునందు సంస్కరించి కావ్యాలంకార యోగంబుచేసి రసికుల కభిలషణీయ తమంబులుగ నొనర్చిరి. ఇట్లు చిరకాలము బహుమంది కవులు కొబ్బర పలుకును బెల్లపు పాయసము వేరువేరుగ భుజించినట్లు పుణ్యకథలను వేరువేరుగ మహాకావ్యములుగ రచియించి యానందించుచుండ కవిరాజసూరి మొదలగు కొందరు కవీంద్రులు కొబ్బరికురుమును పటికబెల్లపు (కలకండ) పొడిని రెంటిని యాలకకాయల పొడిని కూడా కలపి కజ్జాయముం జేసి యొక్కమారుగ రెండు మూడు స్వాదు పదార్థములయొక్క రుచిని యనుభవించినట్లు యిరువురు లేక మువ్వురు మహాపురుషుల యొక్క పుణ్యకథలను ప్రతిపద్యమునందు కలసివచ్చునట్లు విచిత్రములైన ప్రబంధముల రచియించి యానందించిరి. ఇట్లు రెండుమూడు కథలుగల కావ్యములను కథాద్వయ కావ్యములని చెప్పదగును. ప్రతిపద్యమునందు రెండుమూడు కథలు అనుబద్ధములై యుండుటకు రెండువిధములైన రచనలు ప్రాచీనులచే నేర్పఱుపబడి యారచనలచేత ననేక గ్రంథములు రచితములై యున్నవి. అందొకటి శ్లేష. రెండవది యనులోమ విలోమము అనునవి. ఆంధ్రములో మాత్రము నూతనముగ గర్భకవిత్వమను మఱియొక రచన రెండుకథలను వర్ణించునది వెలువడినది.

శ్లేష — శ్లోకమును గాని పద్యమును గాని మామూలుగా యెడమనుండి కుడివైపునకుం జదివి యొక్కొక్కమాఱు ఒక్కొక్క విధముగ పదచ్ఛేదము నొనర్ప తరచుగా నా పదచ్ఛేదభేదముచేత రెండుకథలు వచ్చుచుండును. మఱికొన్ని శ్లేషవిశేషముల చేతను రెండు కథలు కలుగుచుండును. ఇట్టి శ్లేషరచనతో నేర్పడినవి యుభయభాషలయందు ద్వ్యర్థి కావ్యములు అనగా రెండర్థములుగల కావ్యములు. త్ర్యర్థి కావ్యములనగా మూడర్థములు గల కావ్యములు. ఇవి వరుసగా నుభయభాషలయందలి రాఘవపాండవీయము, రాఘవ పాండవయాదవీయము మున్నగునవి. నలరాఘవ పాండవ యాదవీయమును చతురర్థి (నాలుగర్థముల) కావ్యమును గలదని కొందరు చెప్పెదరు. ద్వ్యర్థి కావ్యములయందలి కథలు క్షీరోదకములవలె పరస్పర పృథక్త్వములు ఎఱుంగ వలనుగానియట్లు కలిసి (శ్లిష్టములై) యుండి హంసలకే యాక్షీరోదకములు వేరు వేరుగ గ్రహింప వలనయినట్లు పండితులకే రెండు కథలు వేరువేరుగ గ్రహింపదగి యుండును. త్ర్యర్థి మున్నగు కావ్యములలో మూడేసి నాలుగేసి కథలం ప్రతిపాదించు శ్లిష్టశబ్దములు పంచీకరణము నొందిన సమష్టి సృష్టియందు పంచభూతములవలెనె యత్యంత ప్రయత్నముచేత గాని యెఱుంగ శక్యముగాని యన్యోన్య సంశ్లిష్టత్వము గలిగి ప్రయత్నాతిశయముచే పండితులకు వేద్యములై యానందము గొల్పుచుండును. త్ర్యర్థి ప్రబంధములలో రామాయణ భారత భాగవతముల యొక్క శ్లేష త్రివేణీ సంగమమువలె కడు దుర్వగాహంబై యుండు. ద్వ్యర్థి కావ్యములయందు రామకృష్ణావతారములయొక్క కథాశ్లేషము శర్కరా నవనీతముల సంపర్కమువలె కడు హృద్యముగ నుండును.

ఇట్లు త్ర్యర్థి చతురర్థి కావ్యములు పైతము ఉండగా శ్లేష ప్రబంధములని సమిష్టిచే చెప్పబడియుండ పైన కథాద్వయ కావ్యములని నుడువ కారణంబేమన కొంత ప్రయత్నములు సలుప శ్లేషతో రెండేసి యర్థములు వచ్చునట్లు కావ్యముల విరచింప శక్య మగును* గాని అనులోమ విలోమముల రెండు కథల కన్న నెక్కుడు కథలను రచింప వలనుకాదు. ఇట్యను లోమ విలోమ రచన కడు దుష్కరము కనుకనే శ్లేషయమకచక్రవర్తి యా॥ శ్రేయ వేంకటాధ్వరి స్వకృత రాఘవయాదవీయాఖ్యమైన అనులోమ కావ్యమునకు స్వయముగ వ్యాఖ్య రచించుచు అందు మొదట "అనులోమ్యేనపాఠే రామకథా ప్రతిపాదకైః ప్రాతిలోమ్యేన పాఠే కృష్ణకథా ప్రతిపాదకైశ్చ శ్లోకైః పరిష్కృతం రాఘవయాదవీయాఖ్యం అతి దుష్కరం ప్రబంధ మారభమాణః" అని వాకొనెను. అనులోమ విలోమమనగా మామూలు ప్రకారము పై నుంచి క్రిందుకుం జదువ నొకశ్లోకము. దానినే చివర నుండి పైకి జదువ మఱియొక శ్లోకమున్ను వచ్చును. ఇటు జనించిన రెండు శ్లోకములలో రెండు కథలు ఇముడును గాని మూడవది యిముడింప శక్యము గాదు. అయ్యెవేని అనులోమ శ్లోకమును విలోమ శ్లోకమును ద్వ్యర్థులుగా రచింప నాలుగు కథలు యిముడును గదా! యన్నచో చేయుచో సాకల్యము తెలియును కాని యింతవరకు నా యెఱింగినంతలో రెంటి కన్న నెక్కుడు కథలను ప్రతిపాదించు యనులోమ విలోమ కావ్యములు కానరావు. కాన నీయనులోమ విలోమ కావ్యములను పేర్కొనుటకై యిట కథా ద్వయ కావ్యములని చెప్పబడియె.

అయినచో నట్టి ద్వ్యర్థి త్ర్యర్థి శ్లేష కావ్యము లకు ననులోమ విలోమ కావ్యములకు చిత్ర ప్రబంధ ములని సంజ్ఞయున్నదే! దానిని వాడరాదా? యనిన*, చిత్ర ప్రబంధములయందు యమక కావ్యములను చేరియున్నవి కనుక చిత్ర ప్రబంధములనిన కాళి దాసుని 1. నలోదయము కూచనాథమిశ్రుల 2. యమక రత్నాకరము. ఆనంద తీర్థుల 3. యమక భారతము. గోపాలరాయని 4 రామచంద్రోదయము మున్నగు యమక ప్రబంధములను చెప్పవలసియుండును. యమకములను శ్లేషానులోమ విలోమములవలె శబ్దాలంకారము లైనవే యైనను యమక కావ్య ములు ఒక్కొక్క నాయకుని కథనే వక్కా ణించును గాని యిరువురు ముగ్గుర నాయకుల కథ లను వాకొనవు గావు. ఇటు రెండు మూడు కథలను నుడివెడి ప్రబంధములనే నుడువ దలంచినందున చిత్ర కావ్యములనెడి పేరు వదలి కథాద్వయ కావ్యములని చెప్పవలసి వచ్చినది. ఇట్లు కథాద్వయ కావ్యము లనినచో వివిధమైన శ్లేష ప్రధాన లక్షణములైన త్ర్యర్థి చతురర్థి కావ్యములును స్థాలీపులాక న్యాయముచే గ్రహింపదగును. (స్థాలీపులాక న్యాయమనగా వంట తపేలాయందలి ఒక్క అన్నపు మెతుకును పట్టిచూచి కడమ అన్నమంతయు (అన్నపు మెతుకులన్నియు) నుడికినదియు లేనిదియు ఎఱుంగుట.) ఎట్లన? "ఏక స్తపో ద్విరధ్యాయీ త్రిపంథాః" అనుచోట ప్రయోగ విషయము మెట్లున్న చదువున కిరువురు త్రోవ (నడచు టకు) ముగ్గురు అని యర్థము. ఇట్లనుటచే చదువుకు నడకకు ఇద్దరు ముగ్గురు ఉండి అంతకన్న నెక్కువ మందియు నుండవచ్చునని గ్రాహ్యమైనట్లు కథా ద్వయ కావ్యములనుటచే త్ర్యర్థి చతురర్థి మున్నగు కావ్యములున్ను ఉపలక్షణముచే గ్రహింప బడును.

ఇట్టి తావులందు ద్వి శబ్దము లక్షణముగా నుపలక్ష ణమై రెండు మొదలు పై సంఖ్యలకు వాచకముగ నుండును. కనుక (సంస్కృతములో) నైషధ మహా కావ్య ప్రముఖ గ్రంథకర్తయగు శ్రీ హర్షమహా కవియు ౧-౨-౩-౪-౫ కూడా రూపభేదములుగల శబ్దములను ప్రతిపాదించు నిఘంటువు రచియించి దానికి ద్విరూప కోశమని నామకరణ మొనర్చెను.

"ద్విరూపకోశో రచితో విచార్య
బహుప్రబంధ స్థితశబ్ద భేదాన్"

అని తొలుత నుడివెను. ఇట్లే ద్విరూపదర్పణ మని మరియొక నిఘంటువును ఉన్నట్లు వ్యాఖ్యాన ములవలన తెలియుచున్నది.

ఈ ద్వ్యర్థి త్ర్యర్థి ప్రబంధములను చదువు నప్పుడు ఒక్కొక్క మారొక్కొక్క కథయందే మనస్సునిలిపి యర్థవిచార పూర్వకముగా జదివినచో

* చిదంబరకవి రాఘవ పాండవ యాదవీయ మనెడి త్ర్యర్థి కావ్యమునకు తొలుత "వాచం వో రచ యతు" అను పది యర్థములు గల శ్లోకమును మంగళా చరణముగా రచియించి యున్నాడు. అన్ని యర్థ ములు తద్వ్యాఖ్యలో చెప్పబడియున్నవి.

శ్రీకాంతుండైన సర్వేశ్వరుండు కృష్ణుండు నాకు రక్షకుండగు గాక అని.

ఇది సంస్కృత ద్వ్యర్థి శ్లేష కుదాహరణము. ఇట్లు మంగళాచరణ మొదలు ప్రతి శ్లోకంబున కథాద్వయమును జోడించి శ్లేషప్రధానముగా రచించిన ప్రబంధములు ద్వ్యర్థి కావ్యములు. ఇట్లే త్ర్యర్థి కావ్యములున్ను గలవు

ఇక యాంధ్ర శ్లేష కుదాహరణము :—

పింగళి సూరన రాఘవ పాండవీయము ౧వ ఆశ్వాసము కథాప్రారంభము.

ఆ. వెలయు నఖిల భువనములలో నవారణ
నగరి పురమతల్లి వాఁడనర్చి
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్య నా
రాజ వినుతిఁ గనిన రాజధాని.

ఇది యయోధ్యా హస్తినాపురముల వర్ణనము. అందు తొలుత రామాయణ పరముగా అయోధ్యాపుర వర్ణనము.

అఖిల భువనములలోన్ = అన్ని లోకములయందు, అవారణ నగరిపు రమతల్లి వాన్; అవారణ = అడ్డులేని, నగరిపు = ఇంద్రునియొక్క, రమ తల్లి వాన్ = లక్ష్మిని పోషించునదియో యనునట్లు, తివర్చి = ప్రకాశించి, రాజ్యలక్ష్మి మిగుల ప్రబలగా, అయోధ్యనాన్ = అయోధ్యయను పేరుగల, రాజవినుతి గనిన రాజధాని, వెలయున్, అని.

ఇక భారతార్థములో హస్తినాపురవర్ణనము—

అఖిల భువనములలోనన్, వారణనగరి, పురమతల్లి = పురశ్రేష్ఠమైనది, వాన్ = అనఁగా, తివర్చి = ప్రకాశించి, రాజ్యలక్ష్మి మిగుల ప్రబలన్, అయోధ్య యుద్ధము చేయనలవిగానిది వాన్ = అనఁగా, రాజ వినుతి గనిన. రాజధానిగా, వెలయున్—అని.

ఇచ్చట పూర్వార్థములో అఖిలభువనములలోన్ అవారణ నగరిపు రమతల్లిన్. (సమస్తభువనములలో అనర్గళమైన యింద్రుని సంపదకు తల్లియో యనునట్లు) అని రామాయణపరముగా అయోధ్యా వర్ణనములో నున్న పదములు భారతమునందు అఖిల భువనములలోనన్. వారణ నగరి పురమతల్లి వాన్ (సర్వలోకములలో హస్తినాపట్టణము పట్టణోత్తమమైనది.) యని హస్తినా పురవర్ణనములో నైనవి. ఉత్తరార్థములో అయోధ్యనాన్ అనగా రామాయణ పక్షములో అయోధ్యయని పేరు గలదియని భారతపక్షములో యుద్ధముజేయ నలవిగానిది యని పేరొందిన యని యర్థము. కడమపదము లన్నియు రెండర్థములలోను సమానములే. ఈ రెండు విధములైన యర్థములకు పై పద్యమునందలి పదములను విద్యార్థులకు మఱింత సుబోధార్థము పట్టికా రూపములో వ్రాయుచున్నాను.

రామాయణ పరములో పదములు.
అఖిల భువనములలోన్
అవారణ
నగరిపు
రమతల్లి వాన్
భారతపరములో పదములు.
అఖిల భువనములలోనన్.
వారణనగరి
పురమతల్లి వాన్

ఇట్లు గ్రంథము నందంతటను ప్రతిపద్యము శ్లేషతో రెండేసి కథలను ప్రతిపాదింపు చుండును. ఇట్లే త్ర్యర్థి కావ్యములు మూడు అర్థముల నొప్పారు చుండును.

* శ్రీ రామాయణములో రాముడు సీతకు హనుమంతునిపరముగ పంపిన సందేశము కాళిదాసుని మేఘసందేశ రచనకు పురిగొల్పినట్లు రాఘవ పాండవీయము వంటి రెండర్థముల కావ్యమును రచింప కవిరాజసూరిని రేపినది యేమైయుండునని యాలోచించినచో ఆ శ్రీరామాయణములోనే "మా నిషాద ప్రతిష్ఠాంత్వ" మ్మను యర్థద్వయవంతమైన శ్లోకమై యుండవచ్చును. శ్రీరామాయణము వ్రాయ సంకల్పించిన వాల్మీకి ముఖమునుండి మొదట వెలువడిన శ్లోకమిదియే. ఈ శ్లోకమట్లు వెలువడిన కారణము!—

సంగ్రహముగ నారదోక్తమైన రామకథను విరివిగ రచింపదలంచియున్న వాల్మీకికి వనమందు పెంటితో రతిక్రీడాపరవశమైయున్న క్రౌంచపక్షి మిథునమునుండి యొక (మగ) పక్షిని నిషాదుడు నేలఁగూలఁగొట్టుట యాదృచ్ఛికముగ కంటబడెను. హృదయములో జాలి పొడమెను. అటి యకార్యమునొనర్చిన నిషాదుని మహాముని రోషావేశములో శపింప సన్నద్ధుడయ్యెను. అప్పుడే బ్రహ్మప్రసాదమున భారతీదేవి వచ్చి (రామాయణమును పలికింప) అమ్మహాముని జిహ్వాగ్రమున నాసీన యయ్యెను. ఆ కారణముచేత నిషాదునికూర్చిన శాప వచనము కావ్యారంభోచితమైన మంగళాచరణము రెండును కలసి ఒక్కటిగా ఆయన నోట శ్లోకరూపమున

* కాళిదాసు మేఘసందేశమును రామాయణమందలి హనుమత్సందేశమును మనస్సునందిడికొని రచించెనని "కశ్చిత్కాంతా" అను మే. సం. ప్రథమ శ్లోకవ్యాఖ్యయందు "సీతాం ప్రతిరామస్య హనుమత్సందేశం మనసినిధాయ మేఘసందేశం కవిఃకృతవానిత్యాహుః" అని మల్లినాథసూరి నుడివి యున్నాడు.

ద్రిమునందు, కోణబలమునందు, ఆపంతుండెను, గ్రంథము లోని శ్లోకములన్నియు నిట్టి అనులోమములోఁ (పైనుంచి క్రిందకుం జదువ) రామాయణ కథయు, విలోమములోఁ (క్రిందనుంచి పైకెంజదువ) భాగవత కథయుం బ్రతిపాదించు చుండును.

ఈ శ్లోకరచన కడుదుష్కరమైనను శ్లోకముల యందు రెండు మూడుతప్ప కఠినపదములన్నియు ప్రసిద్ధములైనవియే.

ఇట్లు గ్రంథమంతయు ననులోమ విలోమముల రామాయణ భాగవత కథలను ప్రతిపాదించు కావ్యములు సంస్కృతభాషయందు నా యెఱింగినంతలో నాలుగు కనుపించుచున్నవి. వాటి పేళ్ళను చివరన పట్టికయందు పేర్కొనియుంటి.

ఇట్లు ఆంధ్రములో కథాద్వయబద్ధములైన అనులోమ విలోమ పద్యములతో నే రచితమైన గ్రంథము కనపించదు. కాని ప్రాచీనకవులు కొందఱు ప్రబంధములయందచ్చటచ్చట ననులోమ విలోమ పద్యములను చమత్కారార్థము రచియించియున్నారు. అందొక్క దానిని యిచ్చుచూపెదను.

అప్పకవీయము చతుర్థాశ్వాసము ౩౬౪.

క. దా మో ద ర మా ధ వ న త
౪౬ ౪౫ ౪౪ ౪౩ ౪౨ ౪౧ ౪౦ ౩౯
రా మా స ర సా క ర ద శ ర థ హా రి రా ధా
౩౮ ౩౭ ౩౬ ౩౫ ౩౪ ౩౩ ౩౨ ౩౧ ౩౦ ౨౯ ౨౮ ౨౭ ౨౬ ౨౫ ౨౪
కా మా స ద యా త ప ర మ
౨౩ ౨౨ ౨౧ ౨౦ ౧౯ ౧౮ ౧౭ ౧౬ ౧౫
ధా మా వ ర యా ద వ సు ల దా ర క రా సా.
౧౪ ౧౩ ౧౨ ౧౧ ౧౦ ౯ ౮ ౭ ౬ ౫ ౪ ౩ ౨ ౧

ఈ పద్యము నే విలోమముగాఁ గడనుంచి మొదటికిఁ (క్రిందినుంచి ౧. వ అంకె మొదలు యంకెల వరుసప్రకారము ౪౬ వ వరకు చదివిన నీక్రింది పద్యము వచ్చును.

క. సారాకర దాలసువద
యారవ మాధామ రపత యాదసమాకా
ధారారిహా థర శదరక
సారస మారాధవ తమ సారదమోదా.

అని. ఈ పద్యము నే క్రిందినుండి పైకిం జదువ క్రమ్మఱ తొలి వ్రాసిన "దామోదర మాధవనత" యనుపద్యమే వచ్చును.

ఇట్టి యనులోమ విలోమ పద్యములు కొన్ని యాంధ్ర ప్రబంధములయందు ఒకటి రెండు లేసిమాత్రము. యవియేని సంబోధనాంత పదములే. ఆ సంబోధనము లైనను విష్ణువుయొక్క రామావతారమో కృష్ణావతారమో హయగ్రీవావతారమో లేక మరియేదని యొక్క అవతారమునందలి కథాక్రమము గలవిగాక సూపశాకచోష్య (పులుసు) హారికా (గారె) వటకాది బహువిధ భక్ష్యభోజ్యముల గలపిచేసిన కదంబమువలె కలిసి గుమ్మటముగా నానావతార విషయకములైన సంబోధనములతో నున్నవి. సృష్టియందు జంతుకోటి వలె నసంఖ్యమైన వివిధ పదజాలముగల సంస్కృత భాషలో నే అందునను అత్రేయ వేంకటాచార్యులు (అలంకార కౌస్తుభ సుభాషిత కౌస్తుభ విశ్వగుణాదర్శ లక్ష్మీ సహస్ర శ్రీనివాస సహస్రాది పరశ్శత ప్రబంధ ప్రణేత) యంతటి మహా విద్వత్కవి మూర్ధన్యమే యనులోమ విలోమ కావ్యరచన యొనర్చి తద్వ్యాఖ్యలో నారచన యత్యంత దుష్కరమని నుడువగా భాషాంతరములో అన్యకవుల విషయమును వేరుగనుడువ వలెనా? అయినను నిట్టి దుష్కర విచిత్ర కావ్యమాంధ్రములో లేదను కొఱత హయగ్రీవానుగ్రహమునె శీఘ్రముగ శమించుగాత (ఇట్టియనులోమ విలోమ కావ్యము ఆంధ్రములో సంస్కృతములో వలె కథారూపముగ రచింప శక్యము గాకున్నను రామకథా క్రమముతో రచితములైన సంబుద్ధి పదములు అనులోమము లోను కృష్ణకథాక్రమముతో రచితములైన సంబుద్ధి పదములు విలోమములోను కూర్చి రచించినను కొంత కొరంత తీరెడి.

ఇక గర్భకవిత్వమున రెండవ కథం జెప్పుట యెట్లన?

కొన్ని పెద్ద పద్యములయందు కొన్ని చిన్న పద్యముల గణములు వరుసగ నుండును వాటిని కనిపెట్టి పెద్ద పద్యములో ముందుగాని వెనుకగాని లేక యిరు ప్రక్కలగాని కొన్ని యక్షరములను విడిచి చదువగా చిన్నపద్యము వచ్చును. ఆ చిన్నపద్యము ఒక్కొక్కప్పుడు పెద్ద పద్యముయొక్క పద మధ్యములో నందుకొని పద మధ్యములో నే ముగియుటయు గలుగును. కాని యట్టియెడ యర్థము చెడనివిధముగ పదముల గూర్పవలెను. పింగళి సూరనామాత్య ప్రకారము ఛందములో నెన్ని భేదములు గలవో ఈ గర్భకవితయందును అరచుగా నన్ని భేదములు గలవు. ఇట్టి గర్భకవితకు దొలుత సంస్కృతములో నొక శ్లోకము నుదహరింతు నన్న నా భాషలో తాదృశ రచనాపూర్ణమైన గ్రంథము కాదుగదా! ఒక్క శ్లోకమేని కనిపించదు. సంస్కృ

తములో నీలోపముం దీర్చ "శ్రీనివాస స్తోత్రామృత" మనెడి స్తుతి కావ్యమునందు నాకు తెలిసినంతమట్టుకు పదునొకండు (11) రీతుల గర్భకవిత్వమును రచియించి యా లోపమును కొంత బాపగలిగితిని. కావ్య గ్రంథమునుంచి సంస్కృతములో గర్భకవిత కొక్క శ్లోకము నుదాహరించెదను.

"శ్రీరామకృష్ణ కమలాక్ష నృసింహ విష్ణో
భూ శ్రీశ కేశవ ముకుంద మురఘ్న శౌరే
నాకేశవందిత పదాంబుజ దేహి నిత్యం
త్వద్భక్తి భాగ్యమయి చింతిత మేవ మహ్యం."

నా "శ్రీనివాసస్తోత్రామృతము"
చిత్రముక్తకము శ్లో ౭౦.

ఇది వసంత తిలకావృత్తము. దీనిలో ప్రతి పాదముయొక్క మొదటి నొక్క యక్షరమును చివరి రెండక్షరములను వదలి నడిమి యక్షరములం జదువ స్వాగతావృత్తము వచ్చును. ఎట్లన ?

"రామకృష్ణ కమలాక్ష నృసింహ
శ్రీశ కేశవ ముకుంద మురఘ్న
కేశవందిత పదాంబుజ దేహి
త్వద్భక్తి భాగ్యమయి చింతితమేవ." యని.

ఇందు పెద్దదైన వసంత తిలకలో మూడవ పాదమునందలి "నాకేశవందిత (ఇంద్రునిచే నమస్కృతుడైనవాడా) యను పదములోని మొదల నుండు "నా"ను తీసి చదివినచో గర్భములోని స్వాగతావృత్తముయొక్క మూడవపాదము మొదలు "కేశవందిత" (క-బ్రహ్మచేతను, ఈశ=శివునిచేతను, వందిత=నమస్కృతుడా) యనియగును.

ఆంధ్రములో గర్భకవిత్వము-అనేకమంది పూర్వులచేతను నవీనుల చేతను ప్రబంధములయందు ఆటవటను ఆశ్వాసాంతపద్యములయందు విశేషముగను వ్రాయబడి యున్నది. అప్పకవీయములో నాశ్వాసాంతముల గొంత విరివిగను, ప్రబంధరాజ శిరోభూషణ ప్రఖ్యాత బలరామ చరిత్రములో చాలా విరివిగను నంతకన్నను మిక్కిలి విరివిగ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము నందునుగలదు. ఇట్లు ప్రబంధములలో నచ్చటచ్చట నేగాక నీగర్భచిత్రకవిత్వముతో భారతగర్భ రామాయణమను గ్రంథమే ఆంధ్రములో రచియించి ముద్రితమై యున్నది. ఈ పుస్తకముయొక్క పేరే తదరచనా రీతిని చెప్పక చెప్పుచున్నది. గ్రంథములో గ్రంథకర్త.

తే. రామకథ నిర్వచనముగ వ్రాయుదుఁ బ్రతి
పద్యమందున వేరొక్క పద్యముండు
నట్టి గర్భితములగు పద్యముల నెల్ల
వరుస తోడుతఁ జదువఁగా భారతము.

వని నుడివియున్నారు. మచ్చున కొక పద్యమును వ్రాసెదను.

కథా ప్రారంభము పురవర్ణనము.

ఉ. శ్రీరమణీయమై (పిరులఁ
జెంది వెలుంగును జిష్ణువీటి) నిన్
మీఱి, యయోధ్య నా (గరిమ
మించుచు బృథ్వి నఖండహాస్తి) ర
క్షోరి గృహంబె యా (పురియు
నచ్చటి మేడలు వ్రాయు మంటు) మేల్
తోరపు ఖ్యాతితో (నగరి
దూగుఁదులన్ హరిఁ బట్టుతోఁడ) నాన్॥

ఈ యుత్పలమాలా పద్యముయొక్క ప్రతి పాదము మొదట ఆఱు అక్షరములను తుదనొక్క యక్షరమును వదలి చదువ క్రింది గీతపద్యము వచ్చును.

తే. పిరులఁ జెంది వెలుంగును జిష్ణువీటి
గరిమ మించుచు బృథ్వి నఖండహాస్తి
పురియు నచ్చటి మేడలు వ్రాయు మంటు
నగరి దూగుఁదిలక్ హరివట్టు తోఁడ.

పెద్ద పద్యమంతయు రామాయణకథ. అయోధ్యాపుర వర్ణనము. గర్భస్థ గీతపద్యము భారతకథ. హస్తినాపుర వర్ణనము. సాకేతవర్ణనమైన పెద్ద పద్యము యొక్క హస్తినవర్ణనమైన గర్భస్థ పద్యము యొక్కయు యర్థములు సులభముగానే యున్నవి. గ్రంథమంతయు నిట్లే రెండు కథలను నడుపుచుండును. ఇందింకను నానావిధ పద్యములందు అనేకవిధముల గర్భకవిత్వ (గర్భిత పద్యముల) వైచిత్రి గాంచనగును.

పింగళి సూరన రాఘవ పాండవీయములో రెండు కథల జోడింపులో తానెన్నిమార్గముల విధముల శ్లేషల నవలంబించినదియు నీ క్రింది పద్యములందొక పద్యములో తెలిపియున్నాడు.

* సీ. ఆంధ్రభాషా సంస్కృతాభి భాషా శ్లేష
యొక్కచోట, నొక్కచోట
నుచిత శబ్దశ్లేష, యొక్కచోట న
ర్థశ్లేష, యొక్క తావున ముఖ్య
గౌణవృత్తి శ్లేషఘటన, యొక్క తావ
ర్థాన్వయము జేసి యడుగు నునికి
శబ్దాన్వయ విభేదసంగతి యొక్క
తావున యొక్క తావున రెండు

తే. మూఁడు కూడుట యవసమునర్థమునగాఁగ
నాకుఁదోచినగతిఁ జెక్కఁబోక లమర

---

* ఈ శ్లేష భేదముల యుదాహరణములు శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రుల వారి రాఘవ పాండవీయ పీఠికోపోద్ఘాతములో చూడదగును.

## వ్యంజన చ్యుతకం

సత్యశీల దయోపేతో దాతా సుచిర మశ్వరః
జన స్సర్వాత్మనా సేవ్యః సదముష్మై రభీప్సితా.

ఇందు జనులకు నొక శ్రీమంతుడును వాచ్యములు. విశేషణములైన సత్య శీలదయోపేతత్వాదులు గుణ సామ్యముచే నిర్వాహకు సమానములు. ఇః విశేష్యము జనః అనబడును. వ్యంజన చ్యుతకముగ న విశేష్యమైన * జనశబ్దములో జకారమును తీసి ఇనః అగును. అనగా ప్రభువు.

## చ్యుతదత్తాక్షరము

పూర్ణచంద్ర ముఖీ రమ్యా కామినీ నిర్మలాంబరా
కరోతి కస్య నహ్యంత మేకాంత మదనాతురం.

ఇందులో కామినీయామినీలు వర్ణితములు. పూర్ణచంద్రుని వంటి ముఖముగలది. తెల్లని అంబరము (చీర) గలది కామిని. ఇది చ్యుతదత్తాక్షరము శ్లో. 'స్ఫోటయిత్వైకాక్షరం కించి త్స్వర రవ్యస్య దానతః ప్రాత ఉత్పత్తి ద్యత్ర చ్యుతదత్తాక్షరం హితత్' అను లక్షణము ననుసరించి ఒక అక్షరమును తొలగించి యా స్థానములో వేరొక యక్షరమును అన్వయము కుదురునట్లు చెప్పదగినది గనుక యామిని వచ్చునట్లు కామినిలో "కా"ను తొలగించి "యా"ను చేర్చవలయును అప్పుడు యామిని యగును.

కాగా పూర్ణచంద్రుడు ముఖముగా అరంభము నందు గలది. అందుచేత వెన్నెలచే తెలని అంబరము అనగా ఆకాశము గలది యామి ముందటి విశేషణముల కర్థము. ఇక అటువంటి యామినియు కామినియు ఎవ్వారియొక్క హృదయమును కామాతురము గావించదు.

ప్రతిశ్లోకములో వీటు బిందుచ్యుతి యొనర్ప కృష్ణకథయు, బిందువ్యాదిచ్యుతి యొనర్పక రామకథయు వచ్చునట్లు నా యొనర్ప సమకట్టిన కావ్యము శ్రీహయగ్రీవ కృపావీక్షణంబున శీఘ్రంబ నెఱవేరి మహాలోకమున బఱయఁగలదని ధైర్యముతో నున్నాడ.

ఇన్ని విధముల చ్యుతకచిత్రము సాంప్రదాయములో జూపెడివన్నను. అప్పకవీయము చతుర్థాశ్వాసములో వర్ణలోప మొక్కటిమాత్రము కనుపించు చున్నది. దాని నిట నుదాహరించెదను.

క. రవి కవ్య సుందరకర
మవలంబన మొప్ప యాచె నచ్యుతుఁడని యే
నవ వర్ణలోపముగా
నవనిం బఠియింపవలయు నార్యులు నలరన్:

ఇందు అయిదవ వర్ణమును లోపింపజేయుమని నాడు గనుక తొలినుంచి అయిదవ వర్ణము "సుం" క్రమ్మర దకారము మొదలు అయిదవ యక్షరము "మ". ఈ రెంటిని లోపింపజేయు రవి కవ్యదరకర మవలంబనమని యగును.

ఇంత వ్యాసములో మధిలభాషలయందు ప్రతి పద్యమునందు నానేక కథల (నొక్కమారే) విరచించుటకొరకు చేర్పడిన యే ప్రాచీనమార్గములు రెండు నవీన మార్గ మొక్కటియు గలసి మొత్తము మూడు 'లవో ఆశ్లేష అనులోమ విలోమ గర్భ కవితా మార్గములను తెలుపుదు రెండు భాషలలోను మూడు రకములయిన రచనలకు నొక్కొక్క శ్లోకమును పద్యమును అర్థవివరణ సహితముగ నుదహరించి చూపితిని. ఇక నట్టి గ్రంథము లెవ్వ రెవ్వారు రచించినవి కలవో చదువరుల కెఱుంగ గోరికగలుగుట సహజము. కావున నట్టి గ్రంథములను వ్యాఖ్యానములతో టీకా తెలిపిన వాటిని నీక్రింద పేర్కొనుచున్నాడ.

అందు తొలుత సంస్కృతములో ౧. రాఘవ పాండవీయమును రచియించి కవిరాజసూరి ద్వ్యర్థి కావ్య నిర్మాణమునకు మార్గదర్శకుఁడయ్యె. దీనికి శశధరకృతియైన ప్రకాశనామ టీకగలదు. పిమ్మట దశరూపక కర్తకన్న భిన్నుడు నెఘంటుకర్తయైన ధనంజయుడు. ౨. రాఘవ పాండవీయ మను పరనామము గల ద్విసంధాన మహాకావ్యమును రచించెను దీనికి బదరీనాథకృత టీక కలదు. ఈ రెండు గ్రంథములు రామాయణ భారతకథల శ్లేషతో రచితములైన ద్వ్యర్థి కావ్యములు. క్రీ. శ. ఏకాదశాబ్దిలో సంధ్యాకరనంది యనుకవి ౩. రామచరితమను ద్వ్యర్థి కావ్యమును రచించెను తిరువాతి ౧౬-వ శతాబ్దిలో హరదత్త సూరి. ౪. రాఘవ నైషధీయమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. దీనికి కర్తయే టీకయొనర్చెను. క్రీ. శ. ౧౭-వ శతాబ్దిలో చింజమూరి సోమేశకవి సహాయముగా ౫. రాఘవ యాదవీయమను ద్వ్యర్థి కావ్యమును రచించెను ఇవి రామాయణ భాగవతముల కథల శ్లేషములో రచించిన ద్వ్యర్థి కావ్యము. ఇవి ద్వ్యర్థి కావ్య

---

సంగ్రహముగా వ్యంజనముల యొక్క బోధము.

* క, ఖ, మొదలయిన వ్యంజనములు అ, ఆ, మొదలయిన స్వరములతో చేరకముందు క్, ఖ్, మొదలగు విధముగ అపూర్ణములుగ నుండును. అ, ఆ, మున్నగు స్వరములతో చేరినచే క, ఖ, కా, ఖా మొదలగు రీతిని పూర్ణాక్షరములగును. అట్లే జకారమును ఇకారము చేరకముందు జ్ అని అర్ధాక్షరముగ నుండి ఇ చేరి జి అని పూర్ణవర్ణ మొందెను. ఈ "జి" అక్షరములోని జ్ ను తీసివేయగా ఇకార మేయుండును. అటువలచే జన అనునది ఇనయని యగును. యా. మాపితామహులు మహాంగ వేదజ్ఞ శ్రీమాన్ కళత్రాల విక్రాల రాఘవాచార్యుల వారి రచితము వర్ణలోపము.

ములు:— ఒక త్ర్యర్థి కావ్యములు. కమలినీ కలహంస కావ్యదర్పణాది బహుగ్రంథ నిర్మాతయగు రాజచూడామణి దీక్షితుడు. ౨. రాఘవయాదవ పాండవీయమను త్ర్యర్థి కావ్యమును రచించెను అభినవ కాళిదాస బిరుదాంచితుడైన చిదంబర కవి. ౩. రామాయణ భారత భాగవత సారమను పేరుగల రాఘవ పాండవ యాదవీయమను త్ర్యర్థి కావ్యమును రచించెను. దీనికి కవియొక్క తండ్రి అనంతనారాయణ సుమతి యే యర్థప్రదీపికయను వ్యాఖ్యానమును రచించెను. ఈ రెండు త్ర్యర్థులు రామాయణ భారత భాగవతముల కథా శ్లేషము గలవి.

ఆంధ్ర సారస్వతమున వేములవాడ భీమకవి ౧ రాఘవపాండవీయమును రచించినట్లు నది పింగళిసూరనకు బూర్వమే ఖిలమైనట్లును పింగళిసూరన రాఘవ పాండవీయమువలన తెలియుచున్నది. కావునాంధ్రములో వేములవాడ భీమకవియే ద్వ్యర్థి కావ్య రచనకు ప్రథమాచార్యుడని చెప్పనగియున్నను లభ్యమానమైన ౨ 'ఆంధ్ర రాఘవపాండవీయమునకు గర్తయైన పింగళి సూరనయే మన మెరింగినంతలో యాంధ్రద్వ్యర్థి కావ్య నిర్మాణమార్గ ప్రథమ పథికుడు. దీనికి ముద్దరాజు పెదరామ ధీమణి రచితమైన రాఘవ పాండవీయార్థ్యమను నదియు, వి(క్కొ)ల నరసింహాచార్య రచితమైన రాఘవ పాండవీయార్థ దీపిక యనునదియు, వి. వి. నరసింహం పంతులగారిచే రచితమైన కవిభావప్రకాశిక యనునదియు మూడు వ్యాఖ్యానములు గలవు. తెనుగాతి రాయ రాజభూషణుడు ౩. హరిశ్చంద్ర నళోపాఖ్యానమను ద్వ్యర్థి ప్రబంధమును రచించెను. దీనికి చిత్రకవి అనంత కవి రచితమైన వ్యాఖ్యానము గలదు. పిమ్మట కృష్ణాధ్వరి 4. నైషధ పారిజాతీయమను పేరి ద్వ్యర్థి కావ్యమును రచించెను. 18 వ శతాబ్ది ప్రారంభములో నీ అప్పయ్యదీక్షిత వంశీయుడైన విక్కొల శ్రీనివాసాచార్యకవి 5. సౌగంధిక పారిజాతీయమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. ఇది భారత భాగవత కథా శ్లేషగల ద్వ్యర్థి కావ్యము దీనికి ఆమోదవామక టీక గలదు. పిండిప్రోలు లక్ష్మణకవి 6. లంకావిజయమను నామాంతరము గల రావణదమ్మీయమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. దీనికి కొమారి కృష్ణమాచార్య కృతవ్యాఖ్య గలదు. క్రీ. శ. 18వ శతాబ్దిలో శ్రోత్రిలంక మృత్యుంజయకవి 7. ధరాత్మజా పరిణయమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. పిమ్మట బుక్కపట్టణము తిరుమల వెంకటాచార్య కవి పై ప్రబంధపద్ధతిని 8. అచలాత్మజా పరిణయమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. దీనికి యతిక్కర్త పేరు తెలియని యొకటీక కలదు. ఏడూరి పెదరామకవి 9. శివరామాభ్యుదయమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. ఈ మూడు ప్రబంధములు హరిహరకథలను జోడించి రచించిన ద్వ్యర్థి కావ్యములు. మంత్రి ప్రగడ సూర్యప్రకాశకవి 10. కృష్ణార్జున చరిత్రమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. కౌసల్యాపరిణయముకర్త శ్రీపాద వెంకటాచలకవి 19 వ శతాబ్దిలో 11. రామకృష్ణోపాఖ్యానమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. దీనికి వారణాసి లక్ష్మీపతి చేసిన టీక గలదు. చిత్రరత్నాకర బిల్హణీయాది ప్రబంధకర్త చిత్రకవి సింగరాచార్యులు 12. రాఘవ వాసుదేవీయమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. మైనముపాటి కామేశ్వరామాత్యకవి 13. యాదవ రాఘవీయమను ద్వ్యర్థి కావ్యమును రచించినట్లు పత్రికలం గనవచ్చుచున్నది. ఈ మూడును రామాయణ భాగవత కథాశ్లేషముగల ద్వ్యర్థి ప్రబంధములు. శేష ధటర్ అప్పళాచార్యులు తిగువెంగళదాసు అను ఇద్దరు కవులు రచియించిన రామకృష్ణ విలాసములను రెండు ప్రబంధములు వినవచ్చుచున్నవి. అవి పై జెప్పిన రామకృష్ణోపాఖ్యానమువలె ద్వ్యర్థి ప్రబంధములో, లేక యా పేరిట నొకానొక వ్యక్తి యొక్క చరిత్రములో గ్రంథములను చూచినగాని యవి కావ్యములో జెప్ప వలనుపడదు అయినను పేరులో రామకృష్ణశబ్దములు రెండును నుండుటంబట్టి ద్వ్యర్థి కావ్యములుగా నుండునేమోయని తలంచి వాటి పేరు యిచ్చుట స్వీకరింపబడెను. ఆంధ్రములో త్ర్యర్థి కావ్యమునకు ముందంజ వేసినవాడు మహామహోపాధ్యాయ బిరుదాంచితుడు ఏలకూచి బాలసరస్వతి. ఇతడు రాఘవ యాదవపాండవీయము పేర త్ర్యర్థి కావ్యము నిర్మించెను. క్రీ. శ. ౧౭ వ శతాబ్దిలో నెల్లూరు వీరరాఘవకవి ౧౪ యాదవ రాఘవపాండవీయమను త్ర్యర్థి కావ్యమును నిర్మించెను. ఇందలి ప్రథమాశ్వాసమునకు ఆచార్య వరిగొండ విష్ణునాథ శాస్త్రిలు యం. ఏ. గారు రచియించిన యానంద జ్యోత్స్న యను టీక యచ్చైయున్నది. అయ్యగారి వీరభద్రకవి ౧౫. రాఘవ పాండవ యాదవీయమను త్ర్యర్థి కావ్యమును నిర్మించెను ఓరుగంటి సోమశేఖరకవి రాఘవ పాండవ యాదవీయార్థముల నిచ్చు ౧౬. రామకృష్ణార్జున రూప నారాయణీయమను త్ర్యర్థి కావ్యమును నిర్మించెను. ఈ నాలుగు త్ర్యర్థి కావ్యములు రామాయణ భారత భాగవత కథాశ్లేషముగలవి. ఈ శతాబ్దియందు కవిసింహ పోకూరి కాశీపతి యనువారు ౧౭. సారంగధరీయమను త్ర్యర్థి కావ్యమును రచించినట్లు పత్రికలం గనుపించుచున్నది. ఒక కవి ౧౮. నల రాఘవ పాండవ యాదవీయమను చతురర్థి కావ్యమును రచియించెనని చరిత్రములం గానవచ్చుచున్నది.

ఇవి ద్వ్యర్థి త్ర్యర్థి చతురర్థి (శ్లేష) కావ్యములు.

ఇక అనులోమ విలోమ కావ్యములు—

సంస్కృతములో కాళిదాసు ౧. హరిచంద్ర నళోపాఖ్యానమను అనులోమ విలోమ కావ్యమును

రచించెను. దైవజ్ఞసూరి ౨. రామకృష్ణ విలోమ కావ్యమును రచించెను. దైవజ్ఞ సూర్యకవి మఱియొక ౩. రామకృష్ణ విలోమకావ్యమును రచించెను. భానుకవి మఱియొక ౪. రామకృష్ణ విలోమ కావ్యమును రచించెను. వరదాభ్యుదయ శ్రీనివాస విలాస లక్ష్మీసహస్ర విశ్వగుణాదర్శ సుభాషితకౌస్తుభాలంకారకౌస్తుభాది బహుప్రబంధకర్త యాత్రేయ వేంకటాధ్వరి ౫ రాఘవయాదవీయ మను మఱియొక యనులోమ విలోమ కావ్యమును రచించెను. వీటిలో హరిశ్చంద్రనళోపాఖ్యాన మొక్కటి తప్ప కడమ నాలుగు కావ్యములు రామకృష్ణావతారముల కథలతోనే రచింపబడినవి. ఇట్టి అనులోమవిలోమ కావ్యముల యర్థము కడు దుర్బోధము గాన తరచుగా మూలకర్తలే వ్యాఖ్యానముల నొనర్చియున్నారు.

ఆంధ్రములో అనులోమ విలోమ కావ్యములు లేవు.

సంస్కృతములో గర్భకవిత్వ కావ్యములు లేవు.

ఆంధ్రములో నీ శతాబ్దియందు శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ కవితాకోవిదులు భారత గర్భ రామాయణమను కావ్యమును రచించిరి. దీనికి స్వకృతి లఘు టీక గలదు.

సూచన :—సంస్కృతములోని హరిశ్చంద్రనళోపాఖ్యానము అనులోమవిలోమ కావ్యమనియు ఆంధ్రములోనిది ద్వ్యర్థికావ్యమనియు పాఠకులు జ్ఞాపక ముంచుకొనవలెను.

ఇందు కొందఱ ద్వ్యర్థి త్ర్యర్థి కావ్య కవుల యొక్క కాలనిర్ణయము ఆంధ్రపత్రిక విభవ సంవత్సరాది సంచికలోని శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యుల వారియొక్క "కవిరాజ సూరి కాల నిర్ణయ" మను వ్యాసమునుంచి గైకొన బడినవి యని వారికి నా కృతజ్ఞతను తెలుపుకొను చున్నాను.

ఆంధ్రత్ర్యర్థి ప్రబంధములలో వంగులూరిబాపరాజు అను కవి "మూర్తిత్రయోపాఖ్యాన" మను గ్రంథమును రచించినట్లు తెలియుచున్నది. అది త్ర్యర్థి కావ్యమో లేక ధరణి దేవుల రామమంత్రికృత దశావతార చరిత్రము నారాయణుని పది యవతారముల కథలను వేరు వేరుగ వర్ణించుటవల్ల హరిహర బ్రహ్మల కథలను వేరువేరుగ వర్ణించునదియో తెలియదు.

ఈ మూర్తిత్రయోపాఖ్యానము పై నుదహరించిన తిరువెంగళదాసు శేషభట్టరు అప్పలాచార్యులు రచించిన రామకృష్ణ విలాసములను రెండు ప్రబంధములను, త్ర్యర్థి ద్వ్యర్థి (శ్లేష) కావ్యములా? వాటిని చూచిన విద్వాంసులు వాటి కెవరు రచించిన టీక లున్నదియు నాకు తెలుపగోరుచున్నాను.

ఆంధ్రములోని రాఘవ పాండవీయము మున్నగు ద్వ్యర్థి ప్రబంధములను రాఘవపాండవ యాదవీయము మున్నగు త్ర్యర్థి ప్రబంధములను సంస్కృతములోని యా పేరుగల ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యముల జూచి వాటి వెనుక జేయబడినవియే యైనను వాటికి అనువాదములు గాక అనుకరణములుగ నుండును. ఇఱు భాషల యందలి ఇట్టి ప్రబంధముల జూచిన చదువరుల కెరుక పడునని తలంచి వ్యాసవిస్తర భీతిచే నిట నుదహరించ నైతి.

# దివ్యదామము

శ్రీ రాయప్రోలు వెంకటరామయ్య

కన్నులఁ గ్రమ్ముకొన్నది అంధకార రేఖ
పరమ కరుణాలయుఁడు భగవాను నెఱుఁగ
లేకపోయితి; నాతఁడు లేఁడటంచు
చాటిచెప్పితి గర్వంపుఁ జదలనిలిచి.

అది పతంగోదయ మనోహరావసరము,
దెసల వ్రాలిన చీఁకటి తెరలు కాల
నాటకపురుషుఁ డెత్తుచున్నాఁడు పైకి;
తనరినది సృష్టి నూత్న చైతన్యగతిని.

గణగణ మ్రోగసాగినవి కాంచన మందిర దివ్యఘంటికా
గణములు; బాలభాస్కరుని కాంతులు గోపురసీమపైఁ బసిం
డిని దిగనాడుచున్నవి; వినిర్మల మారుతశాబకాళి జీ
వనమును బుచ్చుకొన్నది; ప్రపంచము గ్రోలినదార్ద్రభావమున్.

విమల వసనాలు ధరియించి వేఁగిరముగ
ఆలయములోని కెందఱో అరుగఁదొడఁగి
నారు భక్తులు; నవ్వుకొన్నాను మూఢ
భక్తి వీరిది; ఏమిదౌర్భాగ్యమనుచు.

ఒక కోనేటిదరిని అ
ల్లే కూర్చునిపోయినేఁ బరీక్షించితి నా
హా! కలఁడా? దేవుఁడనుచు,
పకాలుమని నవ్వులు వినవచ్చినవంతన్.

ఒకదానివెంట నొక్కటి
చక చక జేరుచును బక్షి సంచయములు మా
లికగా రూపముగైకొని
పక పక నవ్వుచు నెదురుగ వచ్చియిటులనెన్.

"ఈ ప్రపంచము నెవఁడు సృష్టించినాఁడు
అతఁడు దేవుఁడు, లేఁడని యందువా! వి
వేకహీనుఁడా!" సిగ్గుతో వెఱఁగుతోడ
వెను దిరుగకుండ లేచి పర్వెత్తినాను.

అర్ధచంద్రరేఖ ఆకసమ్మున వ్రాలి
యున్న దలసిపోయి యున్న నేను
వనము నొకటిగాంచి చని దానిలోఁ బవ్వ
ళించినాను శాంతిలేదు నాకు.

'దేవుఁ డనునతఁ డెవ్వరు? భువనమునకు
వానికిని మధ్యగలుగు సంబంధమేమి'
అనుచు దలపోసినంత నే వెనుకనుండి
కిలకిలని నవ్వు లేవొ తాఁకినవి చెవుల.

ఆహా! ఎంతటి వింత! ఒక్కపరి స్వప్నావస్థయౌనంచు నం
దేహంబందితి; నా సమక్షమునఁ గాంతి శ్రేణులుత్పన్నమై
ఊహాతీతమనోజ్ఞ విగ్రహ మొకండుద్యద్గతిన్ బుట్టి నా
కై హస్తమ్మును బట్టి యెత్తినది హాసాలంకృతాస్యమ్ముతో!

వింతపడి యేమి సేయంగ వెఱఁగు పొంది
నిలిచిపోయితి నవ్వెడా నిరుపమాన
విగ్రహమునుండి పరిమళ స్ఫీతమగుచు
దివ్యదామ మొక్కటి యుప్పతిలినదంత.

నన్నుఁ డాసినదా దివ్యనలినదామ
మందులోఁగల అందాలు చిందువిరులు
పకపకనినవ్వి 'ఓయమాయికుఁడ! ఏమి
యందువో భగవంతుని యాస్తికతకు?'

అనుచు దరిజేరఁ బోయిన యంతలోనె
కల్లయిది కలయిది యంచుఁ గలవరమ్ము
నొంది ముందుకుఁ బరువెత్తుచుంటి నేను
విడిచిపోలేదు నన్ను ఆ విరులదండ.

అభ్రవీథుల విహరించి అలసిపోయి
అపర వారాశిఁ గ్రుంకినాఁ డరుణమూర్తి:
అంబరంబను నీలాల ప్రాంగణమున
తారలను ముగ్గువిడినాడు తరుణతరుణి.

ఆ రమణీయ శాంత వన మండలి వృక్షములెన్నొ పూవులా
సారముగా ధరిత్రిపయి జల్లెను త్రోసుకువచ్చి మాలగా
జేరినా వా ప్రసూనములు: చెంగట నిల్చిన నన్ను జూచి వి
ప్పారగనవ్వి 'ఈశ్వరుని యందె మనంబును నిల్పవేలనో.'

అనుచు బలికిన విస్మయ మంది ఏమి
చిత్రమనుకొనుచుఁ బరవశించి పోవు
నెడఁదలోఁ గడలిదరికి నేగుదెంచి
నాను; తలపోసితిని భగవాను గూర్చి.

అంబురాశి బొంగునట్టి తరంగమ్ము
లన్ని కలిసి పోయి అద్భుతమగు
దామముగ జలించి, దరిజేరి నన్ను ప
కాలు మనుచు నవ్వి పలికె నిటుల.

'వెఱ్ఱివాఁడ విశ్వవిభుఁడు దేవుఁడులేఁడ
టంచు నెట్లు తెలుప నగును నీకు'
అనివచించినంత అనుమాన భయసంశ
యాస్పదహృదయుండ నగుచు నేను.

శాలికి బుద్ధి చెప్పితిని గాని మనంబున దీర్ఘయోచనా
జాలము లుద్భవిల్లినవి; శాశ్వతహీన నినాద వైభవో
ద్వేలము దివ్యదామము నదే పనిగా గనుపించుచున్న దే
మూలను జూచినన్ ఎచట బొంచిన నెచ్చట దాగబోయినన్

పరువిడి పరువిడి చివఱకు
తిరిగి అదే ఆలయ ప్రదేశములోనన్
శరణమ్మలుంచితిని ఇఁక
దారేదియు లేక చాల తహతహపడితిన్.

ఎచటగాంచిన నీ దామమే ప్రభూ! హ
తోస్మి! దరిజేర్చు కొమ్ము ప్రేమాదరముల;
దేవ! మామకాహంకార కవచమింక
తునియలై పోయినది లొంగినాను నేను.

కోటి సూర్యుల తలదన్ను పాటల ప్ర
భా వితానముల్ జిమ్ముచు భావరూప
మై యెదుట నిల్చినది విగ్రహమ్ము; అభయ
హస్తమెత్తిన యీశ్వరు ననుకరించి.

విగ్రహము నుండి వెంటనే వెలువడినది
దివ్యదామము పరిమళోద్దీప్తమగుచు,
నగుచు దేవుని నెప్పుడు నమ్ముమనుచు
వ్రాలినదివచ్చి మామక గళమునందు.

మేలుకొంటి ప్రభూ! యింక మేలుకొంటి
ఎవరు లేరు నీ కన్న ప్రేమించువారు
శరణు శరణని నీదరి జేరుచుంటి
ఏలుకోవోయి పరమకృపాలవాల!

అస్మదాత్మ విజ్ఞానోదయమునుచాటు
నట్టులప్పుడే ఉదయించినాఁడు భాను
దేవుఁడు మధువాశాద్రి పై; తెలిసికొంటి
ఇది సమస్తము కలయని ఎంత వడికొ!

ఆ మధుర దివ్యదామ పరిమళాలు
మాయబోవునే! ఎన్నిజన్మాలకైన!
ఎంత దివ్యమో కద స్వప్నమిది! మదీయ
హీననాస్తికతా భావమింక పోయె!

# లార్డుకీన్సు ఆర్థికశాస్త్ర విప్లవము

శ్రీ బులుసు వేంకటసుబ్బారావు

పంకొమ్మిది వందల ఇరవైతొమ్మిదవ సంవత్సరంలో ప్రపంచ పరివ్యాప్తంగా సంభవించిన గొప్ప ఆర్థికమాంద్యం వలన పెట్టుబడిదారీ విధానాన్ననుసరించే చాలా దేశాలు నష్టపడ్డాయి. అన్నింటికన్న ఎక్కువ కష్టనష్టాల ననుభవించిన దేశం అమెరికా. ఈ మాంద్య ఫలితమైన విషమసమస్య ఆర్థిక శాస్త్రవేత్తల ఆలోచనాశక్తి వికసింప చెయ్యడానికి చాలా ఉపయోగించిందని చెప్పవచ్చును. ఎవరికి తోచిన పరిష్కారమార్గం వారు ప్రకటింపసాగారు. సమస్య పరిష్కరించడానికి పనికివచ్చే నిర్మాణాత్మకమైన ప్రతిపాదనలకు పెక్కు ప్రతిపత్తులు వచ్చాయి. పరస్పరం విరుద్ధమైన అనేక నూతన సిద్ధాంతాలు వెలువడ్డాయి. త్వరలోనే ఆర్థికశాస్త్ర రంగంలో నవచైతన్యం తొణికిసలాడింది.

ఈ కాలంలో ఆర్థికశాస్త్ర పండితుల దృష్టులు రెండు ముఖ్యవిషయాలమీద కేంద్రీకరింపబడ్డాయి. ఇందులో మొదటిది ద్రవ్యసిద్ధాంతము. (Monetary-Theory). ఆధునిక ఆర్థికరంగంలో ద్రవ్యానికి, ద్రవ్యపరిమాణానికి కల ప్రాముఖ్యాన్ని వ్యక్తపరుస్తుంది ద్రవ్యసిద్ధాంతం. ద్రవ్యోల్బణం (Inflation) ధరల మార్పులు, అంతర్జాతీయ మారకం, అంతర్జాతీయ వర్తక స్వరూపం మున్నగు వానిపై ద్రవ్యానికి గల ప్రభావాన్ని ద్రవ్యసిద్ధాంతం విదితం చెయ్యగలదు. ఇక రెండవ విషయం. ఆర్థికరంగంలో ప్రభుత్వ ప్రమేయానికి సంబంధించినది. నిరుద్యోగ, జాతీయ సమస్యలను ఎదుర్కొనడంలో ప్రభుత్వ పాత్రను పరిశీలించడం నేటియుగంలో అతి ముఖ్యమైన విషయం. ఈ విధంగా ద్వివిధము. ఆర్థికమాంద్య ఫలితము అయిన విషమసమస్య పరిష్కరించడానికి ఆర్థికశాస్త్రవేత్తలందరూ ఎంతో ఆసక్తి చూపెట్టారు. కాని అతి శాస్త్రీయంగాను, ప్రతిభావంతంగాను, వానిని పరిష్కరించగలిగిన మహామేధావి, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాధ్యాపకుడు, మార్షల్ పండితుని ప్రియశిష్యుడు అయిన జాన్ మేనార్డ్ కీన్సు. కీన్సు ప్రతిపాదించిన పరిష్కార మార్గాలు ఆయనకంటె ముందుగా అనేకమంది శాస్త్రజ్ఞుల ఊహాపథంలో మెదులుతున్నవే అనడం నిర్వివాదాంశం. కాని ఆయన ప్రదర్శించినట్టి అత్యద్భుత పాండిత్య ప్రకర్ష, అపురూపమైన తర్క విధానం వెనకటివారి భావాల్లో పూర్తిగా లోపించాయనడం కూడా నిర్వివాదాంశమే. ఒక శతాబ్దం నుండీ అవిచ్ఛిన్నంగా, అజేయంగా వస్తూన్న సంప్రదాయ సిద్ధమైన ఆర్థికశాస్త్ర సిద్ధాంతాల నన్నింటినీ సమూలంగా ఖండించి వేయగలిగిన అద్వితీయ ప్రతిభాసంపన్నుడు కీన్సు. ఈయన రచనలు ఆర్థికశాస్త్ర రంగంలో మహత్తర విప్లవాన్ని జనింపచేసాయి. ఈ తత్త్వపరిశీలన కుపక్రమించే ముందు ఇంతవరకు ఉన్న ఆర్థికశాస్త్ర విషయాలను ఒకసారి మననం చేసుకుందాము. ప్రథమంగా ద్రవ్యసిద్ధాంత సంబంధమైన విజ్ఞాన విషయాలను అవగాహన చేసుకోవడం ఎంతైనా అవసరం.

అసలు, ద్రవ్యసిద్ధాంత విషయపరిజ్ఞానం ఆర్థికశాస్త్రోత్పత్తితోనే బయలుదేరింది. ద్రవ్యానికి అసలేమైనా విలువ ఉన్నదా? లేక కేవలం మారకపు సౌలభ్యాన్నిబట్టేనా దాని ప్రాధాన్యం? బంగారం, వెండి, మున్నగు ప్రశస్త లోహాలు సామాన్యవస్తువుల వంటివేనా? లేక వస్తువులను విలువలను కొలిచే ప్రమాణాలా? ద్రవ్యానికి, పెట్టుబడి ధనానికి కల భేదం ఏమిటి? ఈ విధమైన ప్రశ్నలు అనాదినుండీ ఉదయిస్తున్నవే. ఇటువంటి ప్రశ్నలకు నిర్దిష్టమైన సమాధానాలు లభిస్తేనే తెలుపవచ్చును. అయితే ఒక విధంగా ఆలోచిస్తే, ద్రవ్య విజ్ఞాన పరిణామాన్ని పరిశీలించడం లాభదాయకమే. తొల్లిటి ఆర్థిక శాస్త్ర రచయితలు ప్రశస్త లోహాలను వానితో తయారుగావించబడిన నాణాలను మాత్రమే ద్రవ్యంగా పరిగణించేవారు. ఆనాడు సహితం ఏదో ఒక రూపంలో ప్రామిసరీ నోట్లు, బ్యాంకునోట్లు అరుదుగా ఉండేవి. కాని అందరూ కూడా ప్రశస్తలోహాలనూ, మాత్రమే యదార్థ ద్రవ్యముగా (Real Money) పరిగణించేవారు.

కాని క్రమంగా పరిస్థితులు మార్పుచెందాయి. ప్రశస్త లోహనాణాలకు మారుగా బ్యాంకు నోట్లు

ప్రజాదరణనుంచి విరివిగా ఉపయోగింపబడుతూ వచ్చాయి. "అడిగిన వెంటనే ఇంత విలువగల యదార్థ ద్రవ్యాన్ని ఇవ్వగలము" అన్న ధనాగారపు వాగ్దాన పత్రాలే బ్యాంకునోట్లు. ఇవిఇట్టి వాగ్దానం నెరవేర్చగలవు. ధనాగారాలు అన్న విశ్వాసం ప్రజలందు నెలకొనడం వలన బ్యాంకునోట్లు యదార్థ ద్రవ్యంలాగే చెలామణీ అయ్యేవి. ఇందువలన ధనాగారాలు తమవద్దగల యదార్థ ద్రవ్యంకన్న ఎన్నోరెట్లు ఎక్కువ విలువగల నోట్లను సృజించగల శక్తిని సంపాదించగలిగాయి. ఈ విధంగా అవి చేసినప్పటికీ, వాని ఆస్తి మొత్తం, అప్పు మొత్తం కన్న ఎక్కువ ఉన్నట్లైతే అవి విశ్వాసపాత్రమైనవిగా పరిగణింపబడేవి. క్రమంగా ఈ విధమైన పత్రధనం (Paper Money) యదార్థద్రవ్యంకన్న ఎక్కువగా ఉపయోగింపబడుతూ వచ్చింది. ఆ తరువాత చెక్కులు బహుళ ప్రచారానికి వచ్చాయి.

సాంప్రదాయికార్థిక విజ్ఞాన శాస్త్రవాదులు ద్రవ్యపరిమాణానికి చాల ప్రాధాన్యాన్నిచ్చారు. ఆర్థిక శాస్త్ర పితామహుడనదగిన ఏడమ్‌స్మిత్‌కు ద్రవ్య పరిమాణ సిద్ధాంతంమీద (The quantity Theory of Money) చాల విశ్వాసం ఉంది. పదహారవ శతాబ్ద కాలంలో అమెరికా దేశంనుండి ధనరాసులు స్పెయిన్ దేశానికి రావడంవలననే ఆ దేశమందలి ధరలు తారా పథానికి పోవడం జరుగుతోందని నాటి శాస్త్రజ్ఞులందరూ భావించారు. ఈ సిద్ధాంతం ప్రకారం ద్రవ్య పరిమాణ మెక్కువైనకొద్దీ వస్తువుల ధరలుకూడా పెరుగుతాయి. ఆ విధంగానే దేశంలో ద్రవ్యపరిమాణం తక్కువైతే ధరలు పడిపోతాయి. తరతరాలుగా ఈ సిద్ధాంతం ప్రజలచేత, ఆర్థిక శాస్త్రజ్ఞులచేత ప్రబలంగా విశ్వసింపబడేది. అమెరికా దేశప్రజలు తమకు ద్రవ్యపరిమాణము తగినంతగా లేనందువలన తమ వర్తక వ్యాపారాలు స్తంభించిపోతున్నాయని ఆరోపించేవారు. వారు క్రమంగా పత్రధనాన్ని అధికం చేసేసరికి అది ద్రవ్యోల్బణానికి దారితీయగలదని భయపడి వెంటనే మాన్పించారు. ప్రశస్త లోహాల నాధారంగా చేసుకోవడానికి బదులు భూమి నాధారంగా చేసి ఫ్రెంచివారు ఎక్కువ నోట్లు అచ్చువేయటంతో అది తీవ్రమైన ద్రవ్యోల్బణానికి దారితీసి ఆ నోటుకు అసలు విలువే లేకుండా చేసింది. ఇదేవిధంగా అమెరికా స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో తగినంత యదార్థద్రవ్యం ఆధారం లేకుండా నోట్లనపరిమితంగా అచ్చువేయ నారంభించేసరికి, వాటి విలువ సంపూర్ణంగా తగ్గిపోయింది. పందొమ్మిదవ శతాబ్దమంతా అమెరికా రాజకీయరంగం ఇట్టి ద్రవ్య స్వరూప స్వభావాలపై తీవ్ర చర్చలతో నిండిపోయింది. తగినంత పరిమాణంగల వెండి, లేక బంగారం పత్రధనానికి వెనుక ఆధారంగా లేకపోవడంవలన, పత్రధనానికి మారుగా యదార్థద్రవ్యం లభ్యంకాకపోవడం సంభవించడంవలన పత్రధనానికి విలువ తగ్గిపోతుందన్న విషయం విశ్వజనీనమైన సత్యంగా సర్వత్రా గుర్తింపబడింది.

యేల్ విశ్వవిద్యాలయార్థిక శాస్త్రాచార్యుడైన ఇర్వింగ్ ఫిషర్ ద్రవ్యసమస్యలపై పరిశోధన జరిపి ఆర్థికరంగంలో ఆటుపోట్ల నరికట్టేందుకు ఎంతో కృషిచేశాడు. ఆయన, ఆయన అనుచరులు ఈ క్రింది సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ద్రవ్యం ఎక్కువ కావడమే ధరల ఆధిక్యానికి మూలకారణం. ఆ విధంగానే ద్రవ్యసంకోచమే ధరల పతనానికి మూలకారణం. అతి తీవ్రమైన ద్రవ్యోల్బణాల మూలంగా ఆర్థికరంగంలో అనేక దుష్ఫలితాలు కలుగుతాయి కాబట్టి అట్టివానిని అరికట్టడానికి అందరూ సమ్మతిస్తారు. అంత తీవ్రమైన పరిస్థితులందేకాక సామాన్యపరిస్థితులందుకూడ ఒక మాదిరి ధరల మార్పులవలన అనేక దుష్ఫలితాలు కలుగుతాయి. కొంచెం కొంచెంగా పెరుగుతూన్న ధరలు స్పెక్యులేషన్‌ను వానిని ప్రోత్సహించి, వాణిజ్యరంగంలో కలతలు తీసుకరావడమేకాక నిరుద్యోగాన్నికూడా తీసుకురావచ్చును.

అత్యుపయోగకరమైన ద్రవ్య పరిమాణాన్ని తెలుసుకోవడం ఎలాగ? ఈ పరిమాణాన్ని ధరలపై దాని ప్రభావాన్నిబట్టి తెలుసుకోవచ్చును అన్నారు ఫిషర్. ధరలు అపరిమితంగా పెరిగిపోతూన్నప్పుడు ద్రవ్యపరిమాణాన్ని తగ్గించివేయాలి. అలాగే ధరలు బాగా పడిపోతూన్నట్లయితే ద్రవ్యపరిమాణాన్ని హెచ్చించాలి కాబట్టి హెచ్చుతగ్గులు లేకుండా ధరలను ఒక నిర్ణీతస్థానంలో ఉంచాలని వాదించే ఈ తెగవారు నిరంతరం, ధరలు, వాని హెచ్చు, తగ్గు శ్రేణి పరిశీలిస్తూంటారు. వారి భావాలు ఏవైనప్పటికీ ఫిషర్, ఆయన అనుచరులు ద్రవ్యపరిమాణ సిద్ధాంతాన్ని బాగా సంస్కరించి, వృద్ధిచేశారు. క్రమంగా ద్రవ్యచలనానికిగల ప్రాధాన్యత గుర్తింపబడింది. ఒక ద్రవ్యపరిమాణమేగాక ద్రవ్యసంచలనం (Velocity of circulation of Money) కూడ ధరలను

నిర్ణయిస్తుంది. ఈ చలనము ఎక్కువైతే ధరలు పెరుగుతాయి. తగ్గితే ధరలు పడిపోతాయి. ఈ ద్రవ్య చలనము, ద్రవ్యవ్యవహారాల మొత్తం (Total Money transactions) పైన ఆధారపడి ఉంటుంది. ద్రవ్యచలనము, ఈ వ్యవహారాలకు సమానమైతే ధరలు స్థిరంగా ఉండగలవు.

తన ప్రఖ్యాత ద్రవ్యపరిమాణ సిద్ధాంతాన్నంతా ఫిషర్ సూక్ష్మమైన సమీకరణంలో క్రిందివిధంగా వ్యక్తంచేసినాడు.

$$M.\ V. = P\ T$$

ఇక్కడ M= ద్రవ్యపరిమాణము: V= ద్రవ్య సంచలనం: P=ధరలపట్టీ: T=ద్రవ్యవ్యవహారముల మొత్తం. ఫిషర్ సిద్ధాంతప్రకారము పై సమీకరణంలో ద్రవ్య పరిమాణమును మనము మార్చవచ్చును. ధరలను మనం అదుపులో పెట్టాలి. ఈవిధంగా ధరలను స్థిరంగా ఉంచేందుకు, V T లలోని మార్పులకు అనుగుణంగా M లో మార్పులను తీసుకురావాలి. ఉదాహరణకు V, స్థిరంగా ఉండి, T రెట్టింపై పెరిగితే ధరలను స్థిరంగా ఉంచేందుకు M ని కూడా రెట్టింపు చెయ్యాలి. కాని ఫిషర్ ద్రవ్యపరిమాణ సిద్ధాంతంలో అనేక లోపాలున్నాయి. ఆయన బోధించినంత సులభంగా మార్పులు జరగవు. అయినప్పటికీ ఆయన చెప్పినట్లు ద్రవ్యపరిమాణాన్ని మార్పుచేయుటంవలన ధరలను అదుపులో పెట్టవచ్చునన్న దానిలో సత్యం లేకపోలేదు.

ఇక మనం విదేశీ వర్తకరంగంలో ద్రవ్యప్రాముఖ్యాన్ని పరిశీలిద్దాం. ఈ విషయం పై అర్థశాస్త్ర రచయితలు అనాదినుండీ కృషి చేస్తూవచ్చారు. సాంప్రదాయిక అర్థిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు (Classical Economists) అంతర్జాతీయ వర్తకరంగమందు సహజమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ప్రబలిఉండటం ఎంతో ముఖ్యమని వాదించారు. వీరు అంతర్జాతీయ వర్తకరంగంలో స్వర్ణప్రమాణ పద్ధతిని (Gold Standard System) అభిలషించారు. ఈ స్వర్ణప్రమాణ విధానం ప్రకారం ప్రతిదేశమందు కరెన్సీనోట్లకు, బంగారానికి మారకం ఉంటుంది. ఒకనోటుకు ఇంత బంగారం అని నిర్ణయింపబడి ఉంటుంది. అన్ని దేశాలందు ఇట్టి విధానం ఉండటంవలన ఒక కరెన్సీ విలువ మరోకదేశపు కరెన్సీ రూపంలో ఎంత ఉంటుందో సులభంగా నిర్ణయింపవచ్చును. ప్రస్తుతానికి ఈవిధానం ఆచరణలో ఉందనుకుందాం. ఇప్పుడు ఆంగ్లేయులు అమెరికాదేశస్థులకీ చెల్లవలసిన ద్రవ్యంకన్న, అమెరికావారివద్దనుంచి ఆంగ్లేయులకు చెందవలసిన ద్రవ్యం తక్కువ అనుకొన్నట్లయితే అంతర్జాతీయ మారకరంగంలో డాలర్లకు గిరాకీ పెరిగి స్టెర్లింగుకు తగ్గిపోతుంది అందువలన డాలర్ల ప్రమాణంలో స్టెర్లింగు విలువ తగ్గిపోతుంది ఇప్పుడు అమెరికాకు ఎక్కువ పౌండ్లనిచ్చి డాలర్లను కొనడంకన్న, ఆ పౌండ్లతో లండన్‌లోనే బంగారాన్ని కొని ఆబంగారంతో అమెరికానుంచి డాలర్లను కొనడం ఆంగ్లేయ వర్తకులకు లాభదాయకం ఇందుచేత ఇంగ్లండునుండి అమెరికాకు బంగారం పంపబడుతుంది. ఈ అధిక స్వర్ణంవలన అమెరికాలో ద్రవ్యమెక్కువై, ద్రవ్య పరిమాణసిద్ధాంతం ప్రకారం అమెరికాలో ధరలు పెరుగుతాయి. అదేవిధంగానే ఇంగ్లండులో సువర్ణ సంకోచంవలన ధరలు తగ్గుతాయి. తమదేశంలో కంటె ఇంగ్లండులో ధరలు తగ్గిఉండటంవలన అమెరికను బ్రిటన్ నుంచి ఎక్కువ వస్తుసంచయాన్ని కొంటారు. అట్లాగే ఇంగ్లండువారు అమెరికాలో ధరలు పెరగడంవలన తమ గిరాకీని తగ్గించివేస్తారు. కాబట్టి పూర్వస్థితి తారుమారై, అమెరికావారు బ్రిటిషువారికి చెల్లించవలసిన స్టెర్లింగుద్రవ్యం, వారు బ్రిటిషువారినుంచి పొందవలసిన ద్రవ్యం ఎక్కువౌతుంది. ఈ విధమైన మార్పులవలన స్టెర్లింగు విలువ తిరిగి లేస్తుంది ధరలూ, వర్తకవ్యాపారాలు క్రమంగా సుస్థితిలోనికి వస్తాయి. ఈవిధంగా అన్నీ కూడా వాటంతటవే ఒద్దికొని ఎవరి జోక్యం లేకపోవడంవలన అతిలాభదాయకమైన స్థితిలోనికి సహజంగా వస్తాయి. ఇది సాంప్రదాయిక అర్థశాస్త్రవాదుల సిద్ధాంతం.

ఈసిద్ధాంతంలో అత్యద్భుతమైన తర్కప్రతిభ ఉందనడం నిర్వివాదమైనప్పటికీ ఎంతోమంది దీనిని విమర్శచేశారు. వారిదృష్టిలో ఇది ఆచరణాతీతమైన స్వప్నం. ద్రవ్య పరిమాణానికి బంగారానికీ కల సంబంధం, ద్రవ్యానికీ ధరలకీకల సంబంధం అన్నీ ఊహాసాధ్యాలే కాని ఆచరణసాధ్యాలు కావు అయినప్పటికీ 1920 ప్రాంతాలలో ఈ సిద్ధాంతానికి ఎంతో ప్రాముఖ్యం ఇవ్వబడింది. 1920 మధ్య భాగంలో ప్రపంచమంతటా స్వర్ణప్రమాణ విధా

వావ్యాదరణలో పెట్టడానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. కాని యుద్ధసంబంధమైన అధిక ఋణాల చెల్లింపుల మూలంగా ఈ ప్రయత్నాలు అంతగా ఫలప్రదం కాలేదు. అదీకాక, అమెరికాదేశ ప్రభుత్వం ఈవిధానపు కట్టుబాట్లకు వ్యతిరేకంగా వర్తించి తనకు లభించిన పరదేశీయుల బంగారంతో ఎక్కువ కరెన్సీ నోట్లను ముద్రించక నిలువ చేయసాగింది. స్వర్ణప్రమాణ సిద్ధాంతం చాల ప్రశస్తమైనదే కాని దానికి కావలసిన అంతరాతీయ సహకారం లభించడం అసాధ్యమే అని చెప్పవచ్చును.

ఇక ద్రవ్యపరిణామానికి, వడ్డీరేట్లకి కల సంబంధములను పరిశీలిస్తేకాని మనం పురోగమించడం సాధ్యం కాదు. ఋణం లభ్యం కావడానికి వడ్డీ అవసరం. అంటే ఇదికూడా ఒకవిధమైన ధర అన్నమాట. ఋణముయొక్క ధర వడ్డీ. ధరలమీద పరిశోధన చేసిన సాంప్రదాయిక శాస్త్రజ్ఞులందరు వడ్డీలయొక్క తత్వాన్ని బాగా అవగాహన చేసుకోవడానికి కృషి చేశారు. వడ్డీరేటు, ద్రవ్యముయొక్క సరఫరా, గిరాకీలపై (supply and demand) ఆధారపడి వుంటుంది అని వారు భావించారు. అటుతరువాత ఆరెండుశక్తులను నిర్ణయించే అనేకాంశాలను వారు పరిశీలించారు.

ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్త అయిన జాన్ బాప్టిస్ సే ప్రకారం వడ్డీరేట్లు, ఋణాల నీయడంలో ఋణదాతకువున్న నష్టావకాశం, ఆ ఋణాలను కడతేర్చ కలిగే శక్తి ముఖ్యంగా అనేక విషయాలమీద ఆధారమై ఉన్నవి. కాని తరువాత విజృంభించిన మార్షల్ సిద్ధాంతులు సేతో అంగీకరింపలేదు. ఋణప్రదాత, ఇక ఇద్దామా వద్దా అని సంశయాత్మకంగా ఇచ్చే ఆఖరి ఋణభాగం, ఋణస్థుడు తీసుకుందామా వద్దా అని సంశయాత్మకంగా తీసుకునే ఆఖరి ఋణ విభాగం పైనచెప్పిన వడ్డీరేట్లని నిర్ణయిస్తాయని వీరివాదం. బోహమ్ బేవార్క్ అనే ఆర్థిక శాస్త్రజ్ఞుడు పై రెండు సిద్ధాంతాలను కూడా త్రోసి రాజని తన నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఈయన సిద్ధాంతం ప్రకారం ఋణం ఒసగేవాడు, తన ధనాన్ని ఒరుల కీయడం ద్వారా ఒకవిధమైన త్యాగం చేస్తాడు. తన అవసరాలను కొంతకాలానికి వాయిదా వేస్తాడు. ఈ విధమైన త్యాగానికి ఋణదాతకిచ్చే ప్రతిఫలమే వడ్డీ. ఆయన సిద్ధాంతం అంత శాస్త్రీయమైనది కాకపోయినప్పటికీ ఎంతో ప్రజాదరణని పొందగలిగింది.

ఈ భావాలన్నింటినీ సమకూర్చుకొని సాంప్రదాయిక ఆర్థిక శాస్త్రవేత్తలు తమ సమస్థితి సిద్ధాంతాన్ని (Equilibrium Theory) ప్రతిపాదించారు. ఈ సిద్ధాంతం ప్రకారం స్వేచ్ఛా విధానంలో (Free Enterprise) వడ్డీరేటు నిర్ణయించే అన్నిశక్తులు సహజంగా సమస్థితి పొంది దీర్ఘకాలికమైన వడ్డీరేటు, ఋణధనము యొక్క సరఫరాను (Supply of Loanable funds) దానికి గల గిరాకీని (Demand for Loanable funds) సమస్థితిలోనికి తీసుకువస్తుంది. దీనినే వారు సహజ సిద్ధమైన వడ్డీరేటు (Natural rate of Interest) అని వ్యవహరించారు. వారు, ఇట్టి సహజసిద్ధమైన వడ్డీరేటు దేశ పురోభివృద్ధికి దోహదం చేస్తుందని భావించారు. కాబట్టి ఆవడ్డీరేటు నిర్ణయం అంతా దానంతట అదే సహజంగా జరగాలనీ, దానిలో ప్రభుత్వ ప్రమేయం ఏమాత్రం ఉండరాదనీ వాదించారు. కాని నేటి ప్రభుత్వ విధానం ఈ సిద్ధాంతానికి చాలా భిన్నంగా ఉంది. అవసరాన్ననుసరించి వడ్డీరేటు ప్రభుత్వం యథేచ్ఛగా మార్చివేస్తోంది.

ఇక ఈ మధ్యలో పైకివచ్చిన శ్రేయోరాజ్యాన్నభిలషించి కృషిచేసిన ఆర్థిక శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలను పరిశీలిద్దాం. వీరందరికీ నాయకుడు అత్యధిక మేధా సంపన్నుడు ఆచార్య ఏ. సి. పిగూ. (1877-) ఈయన మార్షల్ తరువాత కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ ఆర్థిక శాస్త్ర ఆచార్య పదవి స్వీకరించారు. ఈయన రచించిన 'శ్రేయోదాయక ఆర్థిక శాస్త్రము' (The Economics of welfare) 1920 లో వెలువడింది. ప్రజా బాహుళ్యానికి శ్రేయస్సు చేకూర్చే ఆర్థికశాస్త్ర సిద్ధాంతాన్వేషణే ఈయన కృషికి పరమావధి.

ఆచార్య ఏ. సి. పిగూ తన నూతన గ్రంథంలో జాతీయ ఆదాయానికి (National Income) అధిక ప్రాముఖ్యం ఇచ్చారు. జాతీయ ఆదాయమంటే దేశస్థుల ఆదాయాల మొత్తం. 1914 వ సంవత్సరానికి పూర్వం జాతీయాదాయ గణనం శాస్త్రీయంగా ఎన్నడూ జరగలేదు. కాని ఈ శ్రేయోదాయక ఆర్థికశాస్త్రజ్ఞుల కృషిఫలితంగా, అతి శాస్త్రీయ విధానాలతో జాతీయాదాయ గణనం ప్రారంభమైంది. జాతీయ ఆదాయాన్ని పెంచడం, దాన్ని ప్రజలలో సమంగా విభజించడం శ్రేయోరాజ్య పరమావధి. జాతీయ ఆదా

యంలో హెచ్చు, తగ్గులకై కారణాలను గురించికూడ ఆచార్య ఏ. సి. పిగూ ఆయన అనుచరులు ఎంతో కృషి జరిపారు. ఆర్థికరంగంలో పోటుపాట్లను పరిశీలించి తదనుగుణంగా ప్రభుత్వం తన వ్యయ విధానాన్ని అనుసరించాలని ఆచార్య పిగూ ఉద్ఘాటించారు. ఈయన తరువాత ఈ రంగంలో కృషి సల్పినవారిలో ప్రధానుడు జాన్. ఏ. హాబ్‌సన్. హాబ్‌సన్‌కు పిగూకు ఒక ముఖ్యమైన వ్యత్యాసం ఉంది. శ్రేయోదాయక సిద్ధాంతాలపై కృషిసల్పినప్పటికీ ఆచార్యపిగూ సాంప్రదాయక ఆర్థిక శాస్త్ర సిద్ధాంతాలను త్రోసిరాజన లేదు. కాని హాబ్‌సన్ వానిని ఖండింప సాగారు. శ్రేయోరాజ్య వ్యవస్థలో సాంప్రదాయక ఆర్థికశాస్త్ర సిద్ధాంతాలకు స్థానం లేదని వాదించారు హాబ్‌సన్.

కీన్సు ప్రతిపాదించిన సిద్ధాంతాలు కీన్సుకు ముందే కృషిచేసిన ఒక ఆర్థిక శాస్త్రజ్ఞుని సిద్ధాంతాల అడుగుజాడల్లో నడిచాయి. ఆ విజ్ఞాని జాన్ గస్తాఫ్ నట్ విక్సెల్ (1851—1926) ఈయన స్వీడన్ దేశంలో ఒక గొప్ప సంస్కర్తగా పేరుపొందారు. ఈయన జే. బి. సే సిద్ధాంతాన్ని ఖండించారు. సే ప్రకారం ప్రతిసమయమందు వస్తువుల సరఫరా, గిరాకీలు సమస్థితిలో ఉంటాయి. అందువలన సరఫరా ఎన్నడూ గిరాకీమించి పొర్లిపోయే పరిస్థితి రాదు. విక్సెల్ దీన్ని వ్యతిరేకించే కొన్ని సమయము లందు సరఫరా, గిరాకీకన్న బాగా పెరిగిపోయే అవకాశాలున్నాయని వాదించారు. జాతీయ ఆదాయమంతా ప్రజలచేత వినియోగింపబడితే సే సిద్ధాంతము సత్యముకావచ్చు. కాని ప్రస్తుత ప్రపంచంలో ఆ విధంగా ఎన్నటికీ జరగలేదు. జాతీయాదాయంలో కొంతభాగం గిరాకీని పెంపుచేయుటకు బదులుగా ప్రజలచేత దాచబడుతోంది. ఈ దాచరిక ధనం వినియోగింపబడని కారణంవలన గిరాకీతగ్గి, సరఫరా హెచ్చయ్యే ప్రమాదం ఉంది. సాంప్రదాయక విజ్ఞానంతో వ్యతిరేకించి నట్ విక్సెల్, దాచరిక ధనానికీ పెట్టుబడి (Investment)కీ సమస్థితి తీసుకురావడానికి ప్రభుత్వం వడ్డీరేటు మార్చవచ్చని వాదించారు. స్వీడిష్ ఆర్థికశాస్త్రరంగంలో నట్ విక్సెల్ అధిక ప్రభావాన్ని కలిగించారు. మిర్డాల్, లండ్‌బర్గ్, ఓహ్లీన్ మొదలైన ప్రఖ్యాత శాస్త్రజ్ఞులు ఆయన అనుచరులు.

ఇంతవరకూ మనం కీన్సు పూర్వం కల ప్రముఖ ఆర్థిక సిద్ధాంతాలను, కొంత సమకాలిక విజ్ఞానాన్ని స్థూలంగా పరిశీలించాము. ఇక కీన్సు సిద్ధాంతాలు పరిశీలింపవచ్చును.

జాన్ మేనార్డ్ కీన్సు (1883-1946) ఆర్థికశాస్త్ర విద్వాంసుడైన జాన్ నెవిల్ కీన్సు తనయుడు. కీన్సు తల్లి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో పట్టభద్రురాలై కేంబ్రిడ్జి నగరానికి మేయర్ అయింది. ప్రథమంనుండి కీన్సు, గణితం, రాజకీయశాస్త్రం, తత్త్వం ఈ మూడు శాఖల్లోను ఘన విజయాన్ని సంపాదించారు. ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించడానికి అర్హత సంపాదించేందుకై కీన్సు ఒక పరీక్షకి కూర్చోవలసి వచ్చింది. ఆ పరీక్షకోసమే ఈయన ప్రథమంగా ఆచార్య మార్షల్ వద్ద అర్థశాస్త్రాన్ని అభ్యసించారు ఆ పరీక్షలో అతి ఘనంగా కృతార్థుడై కీన్సు ఇండియా వ్యవహార కార్యాలయంలో నియమింపబడ్డారు. ఆ ఉద్యోగం లోనే ఉండి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో విద్యార్థి వేతనాన్నాశించి కీన్సు అర్థశాస్త్ర రంగంలో ఎంతో కృషిచేశారు. కాని ఈయన ఆశించిన పదవి మరొకరికి ఒసగివేయబడింది. కాని మార్షల్, కీన్సు ప్రతిభకు సంతోషించి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయార్థిక శాస్త్రాధ్యాపకులుగా కీన్సును నియమించారు. తరువాత మార్షల్ సాహాయ్యంతో ఈయన ఆర్థికశాస్త్ర పత్రికకు (Economic Journal) సంపాదకుడై, తన మేథా సంపద ద్రవ్య సిద్ధాంతిపై కేంద్రీకరించారు.

1913 వ సంవత్సరంలో భారతదేశం ఆర్థిక పరిస్థితిని విచారించి, నివేదిక తయారుచేయడానికి నెలకొల్పబడిన రాయల్ కమిషన్‌లో కీన్సు సభ్యుడుగా నియమింపబడ్డారు. దీనిలో ఈయన పాండిత్య ప్రతిభ అందరికినీ చకితుల్ని చేసింది తరువాత తిరిగి ఈయన ద్రవ్య సిద్ధాంతాన్ని పరిశోధింపసాగారు. ఆ సిద్ధాంత సాహాయ్యంతో ప్రస్తుత సమస్యలను పరిష్కరింపడానికి ఆయన అమితంగా కృషి సల్పారు. ప్రథమ ప్రపంచ సంగ్రామకాలంలో కీన్సు ఆర్థికశాఖలో ఆంగ్లేయ ప్రభుత్వముచే నియమింపబడి, యుద్ధానంతరం సలహాదారుగా పనిచేశారు. ఈయన కృషి ఫలితంగా వెలువడిన, అత్యధిక విజయాన్ని సాధించిన గ్రంథం "సంధి ఆర్థిక ఫలితములు" అన్నది. ఈ గ్రంథంలో

యుద్ధానంతరం జరిగిన సంధిలోని ఆర్థికపు విషయాలు అతి నిశితంగా విమర్శించారు కీన్సు. యుద్ధంలో నాశనం చేయబడ్డ జర్మనీ దేశమును విపరీతమైన కప్పం కట్టమని బలవంతపెట్టడం ఐరోపాఖండానికి పెద్ద ముప్పు తేగలదని కీన్సు ఆ సంధిషరతులు ప్రతిఘటించారు. ద్వితీయ సమరానంతరం అమెరికా దేశం ఈయన సలహాలను ఆచరణలో పెట్టడానికి కృషి చేసింది. ఆ గ్రంథంతో కీన్సు పేరు నలుమూలలా మారుమ్రోగింది. ఆర్థికశాస్త్ర పటుత్వంతో బాటు, ఆయన మధుర శైలి అందరినీ ముగ్ధులను చేసింది.

ఇప్పటికి కీన్సు బహుకార్య నిమగ్నుడు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో అధ్యాపకవృత్తి వదలుకోలేదు. ఆయన ఆర్థికశాస్త్ర పత్రిక అతి సమర్థనీయంగా నడిపిస్తున్నారు. ఒక ప్రఖ్యాత భీమా కంపెనీకి ఇప్పుడాయన అధ్యక్షుడు. అంతేకాకుండా ఆయన ఎన్నో మహత్తర గ్రంథాలు రచించారు. "ది నేషన్" అనే ప్రఖ్యాత ఆంగ్ల పత్రికను ఆయనకొని దానిని "న్యూ స్టేట్స్‌మన్"లో ఐక్యంచేసి నిర్వహిస్తున్నారు. ఒక పెద్ద వ్యాపార సంస్థకు అధిపతిత్వం వహించి ఆదాయాన్ని వృద్ధి చేసుకున్నారు. తన పత్రికలలో ప్రజల సమస్యల చర్చించేవారు. ఇప్పుడాయన గృహస్థుడు. అతిలోక సుందరియైన రష్యన్ నృత్యతార లిడియా లోపకోవ్ ఆయన గృహిణి. ఇంతే కాదు తత్వ శాస్త్రంపై ఆయన కొన్ని గ్రంథాలను రచించారు.

ఇది ఇల్లా ఉండగా 1925వ సంవత్సరంలో విన్‌స్టన్ చర్చిల్ ఆధ్వర్యంక్రింద ఇంగ్లండు స్వర్ణ ప్రమాణ విధానాన్ని తిరిగి అనుసరించింది. విన్‌స్టన్ చర్చిల్ చర్యను కీన్సు నిశితంగా విమర్శించారు ఆర్థిక మాంద్యాన్ని మరింత ప్రమాద పరిస్థితిలోనికి తీసుకవచ్చి, ఎగుమతుల పరిశ్రమలందు నిరుద్యోగాన్ని పెంపొందించి, బాంకింగు వ్యవస్థలో బంగారం తగ్గించి వేస్తుంది ఈ చర్య అని కీన్సు హెచ్చరించారు. కాని చర్చిల్ చర్యవల్ల సాంప్రదాయిక సిద్ధాంత రీత్యా వేతనాలు తగ్గి (wages) ధరలు కూడా తగ్గి క్రమంగా ఆర్థిక మాంద్యం తగ్గుతుందని సాంప్రదాయిక సిద్ధాంతుల వాదం. ఈ విధమైన సంకోచం (Dellation) ఆర్థిక మాంద్యాన్ని (Depression) తగ్గిస్తుంది. ధరలు తగ్గడం వలన ఎగుమతులు హెచ్చుతాయి. జాతీయాదాయం పెరుగుతుంది. వేతనాలు తగ్గడంవలన ఎక్కువ మంది ఉద్యోగంలో వినియోగించడానికి వీలు కలుగుతుంది.

ఈ విధానాన్ని, దాన్ని పురికొల్పిన ఆర్థిక సిద్ధాంతాన్నికూడ కీన్సు ఖండించారు. స్వర్ణ ప్రమాణ పునః ప్రతిష్ఠవలన ఆంగ్లేయ శ్రామికులు వేతనాల తగ్గింపు రీత్యా బాధపడవలసిన అవసరం లేదన్నారాయన. ఈ విధమైన వేతనాల తగ్గింపుకు శ్రామిక వర్గం ఎన్నడు ఒప్పుకోదని ఆయన స్పష్టం చేశారు. ఈ సిద్ధాంత రాద్ధాంతాలవలన వారికి కష్టనష్టాలు కలిగించే కన్నా, స్టెర్లింగు విలువ తగ్గించడం (Devalnation of sterling) మంచిది. అంతర్జాతీయ ఆర్థిక రంగంలో కొన్ని అవకతవకలను తాత్కాలికంగా కలిగించినప్పటికీ జాతీయ ద్రవ్య పరిమాణాన్ని అదుపులో ఉంచడం మంచిది. ఈ వాదోపవాదాలలో కీన్సు వేతన సిద్ధాంతాన్ని, ద్రవ్య పరిమాణ సిద్ధాంతాన్ని పునఃపరిశీలన చేయవలసి వచ్చింది.

పందొమ్మిదివందల ఇరవై సంవత్సరాంతంలో కీన్సు ఆర్థిక శాస్త్ర విజ్ఞానాన్నంతా కూలంకషంగా పరిశోధింప సాగారు. కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయంలో ఈయన అనేక ఉపన్యాసాలను ద్రవ్య సిద్ధాంతంపై ఇచ్చారు. ఎగుమతి పరిశ్రమలలోని మాంద్యతను పరిశీలించి సలహా ఇవ్వడానికి నియమించిన మాక్‌మిలన్ సంఘంలో కీన్సు సభ్యుడుగా ఉన్నారు. ఆ ప్రాంతాలలోనే ద్రవ్య సిద్ధాంతంపై ఒక ఉద్గ్రంథం వ్రాశారు. (Treatise on Money-1930) దానిలో తన సిద్ధాంతాల నన్నింటినీ అతి శాస్త్రీయంగాను, ప్రతిభావంతంగాను పొందుపరచారు. కాని దీనిలో ఆయన భావనలు ఆచరణకు వీలుగా లేవని విమర్శింపబడ్డాయి. ఈ గ్రంథం కీన్సుకే అంత సంతృప్తికరంగా కనబడకపోవడంవలన ఆయన తిరిగి పరిశోధనలో పూర్తిగా నిమగ్నులైపోయారు.

క్రమక్రమంగా ఆర్థికమాంద్యం తీవ్రతరం కావడంతో ప్రపంచపరిస్థితులువిషమింపసాగాయి. ఈవిషమ సమయంలో నే, ఆర్థికశాస్త్ర చరిత్రలో అద్వితీయము, అపూర్వ విజ్ఞానసంపద్విలసితము ఐన గ్రంథం తత్కర్త అయిన కీన్సుకు అజరామరమైన కీర్తి ప్రతిష్ఠలు కలిగించింది. ఈ గ్రంథనామము ఆంగ్లభాషలో "ది జనరల్ థియరీ ఆఫ్ ఎంప్లాయ్‌మెంట్, ఇంటరెస్ట్, అండ్ మనీ" దీనిలో కీన్సు ఉద్యోగ, ద్రవ్య సిద్ధాంతాలు,

ఆత్మపూర్వంగా చర్చించారు. దీనిలోనే కీన్సు ఆర్థిక శాస్త్ర మహావిప్లవం ప్రారంభమైంది. కీన్సు అమెరికాలో పర్యటించి ఆ దేశాధ్యక్షుడైన ఫ్రాంక్లిన్. డి. రూజ్‌వెల్టుతో పునర్నిర్మాణ కార్యక్రమాన్ని గూర్చి చర్చించారు. ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామ కాలంలో ప్రభుత్వానికి పన్నులు—పొదుపువిధానం—ఆదాయవృద్ధి మున్నగు విషమ సమస్యలపై తన అమూల్యమైన సలహాలిస్తూ దేశసేవ చేశారు. ఈసమయమందే ఆంగ్లేయ ప్రభుత్వం ఈయనకు లార్డు అనే బిరుదం ఇచ్చి సత్కరించింది. యుద్ధానంతరం ఈయన తిరిగి అమెరికా వెళ్ళి బ్రిటిషు దేశానికి సహాయం చేయవలసిన ఆవశ్యకతను ఉద్ఘాటించారు. ఈయన అద్భుత కృషి ఫలితంగానే మార్షల్ పథకం కార్యరూపం దాల్చింది. తదనంతరం ఈయన హృద్రోగంతో బాధపడి ప్రపంచమంతా ముక్తకంఠంతో తన మేధాసంపదను శ్లాఘిస్తూండగా పరమపదించారు.

ప్రథమంగా మనం ఈయన ఉద్యోగ సిద్ధాంతాన్ని పరిశీలిద్దాం. అసలు సాంప్రదాయిక సిద్ధాంతాలుండగా తాను వేరే ఒక గ్రంథం, దానిలో ఉద్యోగ సిద్ధాంతం ఏల వ్రాయవలసి వచ్చిందో వివరిస్తూ కీన్సు ఈ విధంగా వ్రాశారు: సాంప్రదాయక ఆర్థిక శాస్త్ర విజ్ఞానులు ప్రతిపాదించిన ఉద్యోగ సిద్ధాంతం సత్యమే అయినప్పటికీ, అది సాధారణ సిద్ధాంతం కాదు. ఏదో ఒక ప్రత్యేక వ్యవస్థలో మాత్రమే వర్తించే సిద్ధాంతమది, ఆ ప్రత్యేక పరిస్థితికూడా ఊహాలోకంలోనిదే కాని మన జగతిలో ఎక్కడా కనబడదు. అంటే ఆ సిద్ధాంతంలో వాస్తవికత, సామాన్య ధర్మం లోపించాయి. ఈ లోటు భర్తీ చేయడానికే సామాన్య సిద్ధాంతాన్ని General Theory రచించవలసి వచ్చిందని ఆయన పేర్కొన్నారు.

సాంప్రదాయిక సిద్ధాంతం, ఉద్యోగంలో ఎందుకు పెద్ద మార్పులు వస్తూంటాయో వివరించలేకపోయింది. వాస్తవికతకు దూరమైన స్వేచ్ఛాయుతమైన ఆర్థికవ్యవస్థలో అన్ని విషయాలందు సరఫరా (Supply) గిరాకీల (Demand) నడుమ నిరంతరం సమస్థితిని ఊహించుకొని ఆ ఊహా జగత్తులో నిరుద్యోగ సమస్య ఎన్నడూ ఉండదని వారు అనుకున్నారు. కాని తమ సిద్ధాంతం ఊహామాత్రమేనని వాస్తవికతకు సంబంధంలేనిదనీ వారు గ్రహించక ప్రస్తుత ప్రపంచ సమస్యలకు ఆ అవాస్తవిక సిద్ధాంతాలు పరిష్కార మార్గాలుగా తలచడం చాల శోచనీయమైన విషయం. అంతేకాక వారు సరఫరా, గిరాకీ సిద్ధాంతాన్ని శ్రామికుల ఉద్యోగ విస్తృతానికికూడ ఉపయోగించారు. శ్రామికుల సరఫరా, గిరాకీకన్న అధికమైతే వేతనములు పడిపోతాయనీ, లేక గిరాకీ సరఫరాకన్న హెచ్చు అయితే వేతనములు ఎక్కువౌతాయనీ వారు అభిప్రాయపడ్డారు. వేతనములు తగ్గినప్పుడు శ్రామికులు ఉద్యోగాన్ని నిరాకరిస్తే తప్ప ఎన్నడు నిరుద్యోగ సమస్యకు స్థానంలేదని వారివాదం.

ఈ విధమైన సిద్ధాంతం తార్కికంగా ఎంత పటిష్ఠమైనదైనప్పటికీ వాస్తవికత శూన్యమవడం వలన అనుసరణయోగ్యం కాదని కీన్సు విమర్శించారు. సామాన్య పరిస్థితులందు వేతనాలు తగ్గిస్తే శ్రామికులు ఉద్యోగాలను వదలుకోవడం వలన, అతి తీవ్రమాంద్య పరిస్థితులందు ఎంత తక్కువైన వేతనానికైనా కూడా అసలు పనే లభించక పోవడంవలన, వాస్తవిక జగత్తులో నిరుద్యోగ సమస్య జనించడానికి కావలసినంత అవకాశం కలదని కీన్సు నిరూపించారు. అంతేకాకుండా సరఫరా—గిరాకీల సిద్ధాంతంలోగల మూల దోషాన్ని క్రిందివిధంగా విశదపరిచారు కీన్సు: ఏ ఒక స్థితిలోనైనా సరఫరా గిరాకీలు సమస్థితిని పొందవచ్చును. అయితే ఆ సమస్థితే సంపూర్ణ ఉద్యోగస్థితి (Full Employment level) అని నిర్వచించడం అసత్యం. ఆ సమస్థితియందు సహితం ఎంతోమంది శ్రామికులు నిరుద్యోగులై ఉండడానికి అవకాశం వుంది. ఎక్కువ వేతనాలు నిరుద్యోగానికి కారణం కాదని ఈయన తెలిపారు. సిద్ధాంతరీత్యా ఆలోచిస్తే వేతనాల తగ్గింపు, వడ్డీరేటుతగ్గింపు ఫలితాలనే ఇస్తుంది అని కీన్సు విశ్వాసం. ఇందువలన వేతనాలను తగ్గించే బదులు వడ్డీరేటునే తగ్గించవచ్చును. కాని ఈ రెండు పద్ధతులుకూడ అంత అభిలషణీయమైనవి కావు.

ద్రవ్య సంచలనం ఒక అనంతమైన ప్రవాహం వంటిది. ఈ ప్రవాహవేగానికి ఒక ప్రదేశంనుండి మరొక ప్రదేశానికి నీరు పోతూంటుందే కాని పూర్తిగా మాయమవదు. అల్లాగే ఒకరు ధనం ఖర్చుచేస్తే ఆ ధనం మాయమవదు. అది ఇంకొకరి చేతులలోనికి పోతుంది. అంటే ఒకరిఖర్చు ఇంకొకరికి ఆదాయమన్నమాట.

ఖర్చు కాని ఆదాయం కాని సంకుచితమైతే ప్రవాహానికి ఏదో అడ్డు తగిలించినట్లన్నమాట. ఇట్టి అడ్డు దాపరికం వలన కలుగుతుంది. డబ్బు దాచుకున్నారంటే అది ఆదాయం కాదు. ఖర్చు కాదు. పెట్టుబడి పెట్టేందుకే ధనాన్ని దాస్తారని సాంప్రదాయక శాస్త్రజ్ఞుల వాదం. కాని నట్ విక్ సెల్ వలెనే కీన్సు కూడ ఈ వాదాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. డబ్బు దాచేవారు వేరు, దాన్ని పెట్టుబడి పెట్టేవారు వేరు. వారి ఆశయాలు వేరు. వీరి ఆశయాలు వేరు అందువలన దాచిన ధనమంతా పెట్టుబడి రూపంలో వినియోగపడుతుందనడం సత్యం కాజాలదు. కీన్సు సిద్ధాంతం ప్రకారం.

$$Y=C+I$$

ఈ సమీకరణంలో Y అంటే మొత్తం ఆదాయం; C అంటే మొత్తం ఖర్చు, I అంటే మొత్తం పెట్టుబడిధనం. అంతేకాకుండా దాపరిక ధనం (S=Saving) మొత్తం ఆదాయంనుండి మొత్తం ఖర్చును తీసివేస్తే లభిస్తుంది.

$$S=Y-C$$

ఈ రెండు సమీకరణాలను బట్టి దాపరిక ధనం పెట్టుబడికి సమానము అన్నమాట. అంటే కీన్సు తన సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తున్నాడా అని అనుమానం కలుగవచ్చు. కాని అది సత్యం కాదు. ఈ సమీకరణం ఊహాలోకంలోనే సత్యం కాని వాస్తవిక ప్రపంచంలో కాదు. ఇంతకుముందు తెలిపినది వాస్తవిక ప్రపంచ దృష్ట్యా సత్యం. కాబట్టి కీన్సు సిద్ధాంతంలో అసత్యం ఏమీ లేదు.

ఇక కీన్సు ప్రతిపాదించిన ద్రవ్య సిద్ధాంతాన్ని పరిశీలిద్దాం. సాంప్రదాయక సిద్ధాంతుల సమస్థితి సిద్ధాంతాన్ని కీన్సు ఖండించారు. ద్రవ్యానికిగల గిరాకీ సరఫరాలు ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉంటవని ఆయన వాదం. దాపరిక ధనాన్ని నిర్ణయించే విషయాలు అనేకం ఉన్నవని అన్నారు. దాపరిక నిర్ణయం ముఖ్యంగా ప్రజల దాపరిక స్వభావంపై (Propensity to Save) ఆధారపడి ఉంటుంది. అల్లాగే, వారిఖర్చు ప్రజల వ్యయస్వభావంపై ఆధారపడి ఉంటుంది. (Propensity to consume) అంతేకాక వ్యయం ప్రజల ఆదాయంపై కూడా ఆధారపడి వుంటుంది. ధనవంతులు ఎక్కువ ధనాన్ని దాచుకోవడానికి పేదలు తక్కువ ధనం దాచుకొని ఎక్కువ నిష్పత్తిలో ధనం ఖర్చు పెట్టడానికి ఇదే మూలకారణం. మొత్తం ఆదాయంలో కాని, సంఘంలో కాని పెద్దమార్పులు లేకపోయినట్లైతే మొత్తం దాపరిక ధనంలో కూడ అట్టే మార్పులుండవు. ఆదాయం స్థిరంగా ఉంటుటవలన ఖర్చుకూడ స్థిరంగానే ఉంటుంది. అందువలన దాపరిక ధన ప్రమాణానికి స్థిరత్వం కలుగుతుంది. కీన్సు ఈవిధంగా ఉద్ఘాటించినప్పటికి ఖర్చు పరిమితిని ఆదాయం తప్ప మరే ముఖ్య కారణం మార్చలేకపోవడం అంత వాస్తవికంగా కనబడదు. తరువాత కీన్సు వ్యయ స్వభావాన్ని గురించి దాపరిక నిర్ణయ కారణాలను గూర్చి చర్చించారు.

వ్యయ స్వభావం సాధారణంగా స్థిరత్వంతో ఉన్నప్పటికి పెట్టుబడి పరిమాణంలో మార్పులు తరచు సంభవిస్తూంటాయి. భావిలో తమ వర్తకానికి మంచి చెల్లుబడి జరుగుతుందని వర్తకులు తలిస్తే పెట్టుబడి ఎక్కువౌతుంది. భవిష్యత్తులో తమ వస్తువులకు గిరాకీ తగ్గిపోతుందని ఏమాత్రం అనుమానం కలిగినా పెట్టుబడి ధనం ఎంత చవుకగా లభించినా వర్తకులు ముందంజ వెయ్యరు. కొన్ని కొన్ని సమయాల్లో అసలు పూర్వం ఉన్న పెట్టుబడికూడ వారు ఉపసంహరించుకొంటారు. ఇదేవిధంగా భవిష్యత్తులో గిరాకీ ఎక్కువౌతుందని ఏమాత్రం తలచినా వర్తకుల పెట్టుబడి పెరిగిపోతుంది. పెట్టుబడి ధనం సంపాదించేందుకు వారు ఎంత ఎక్కువ వడ్డీ అయినా ఇవ్వడానికి సిద్ధపడతారు. కాని దీనికి ఒక పరిమితి ఉంది. వస్తుందనుకున్న లాభంకన్న పెట్టుబడి ధనానికి ఇవ్వవలసిన వడ్డీ ఎక్కువైనట్లైతే పెట్టుబడి ఆగిపోతుంది. తక్కువైతే ఆ రెండు సమస్థితిలోనికి వచ్చేవరకు పెట్టుబడి కొనసాగుతుంది. కీన్సు చివరకు చెప్పినదేమంటే వ్యయం స్థిరంగా ఉంటుంది కాబట్టి పెట్టుబడిలో మార్పులు తీసుకవస్తే జాతీయాదాయంలో ఆ మార్పులు ప్రతిఫలిస్తాయి.

ఈ పై భావాలన్నింటిని సమన్వయపరచి కీన్సు జగత్ప్రసిద్ధమైన గుణక సిద్ధాంతాన్ని (The Multiplier Theory) వెలువరించారు. పెట్టుబడిలో హెచ్చుతగ్గులు తమ ప్రభావాన్ని, జాతీయాదాయంపై ఏవిధంగా ప్రతిఫలింప చేస్తాయో తెలిపే సిద్ధాంతమిది. సంవత్సరం ప్రారంభంలో పెట్టిన కొద్దిపాటి పెట్టుబడి

సంవత్సరాంతంలో జాతీయాదాయంలో అధికమైన మార్పులు తీసుకవస్తుంది. ఉదాహరణకు ఒక ఉత్పత్తిదారుడు ఒక మిలియన్ డాలర్లతో ఫ్యాక్టరీ నిర్మించాడనుకోండి. అంటే అతడు నిర్మాణానికి వెచ్చించిన మిలియన్ డాలర్లు అతనిచే వినియోగింపబడిన శ్రామికులకు, ఇతరులకు ఆదాయమన్నమాట. అదేవిధంగా వారు తమకు లభించిన ఆదాయాన్ని తిరిగి తమ తమ ఖర్చులకు వినియోగిస్తారు. ఆ వ్యయం మరొకరికి ఆదాయం. ఈవిధంగానే కొద్ది పెట్టుబడి అవ్యయంగా ఆదాయాన్ని చేకూరుస్తుంది. వివిధ ప్రజలకు. కాని ఈవిధమైన ఆదాయవృద్ధికి ఆటంకం లేకపోలేదు. ఆదాయంలో కొంతభాగం దాపరికం చెయ్యబడుతుంది. అనగా మరెవరికీ ఆదాయంగా వర్తించదు. కీన్సు సిద్ధాంతం ప్రకారం ఈ గుణకాన్ని (Multiplier) ముందు కనుక్కోవచ్చును. పెట్టుబడిని ఈగుణకంతో పెట్టి గుణిస్తే మొత్తం జాతీయాదాయం వస్తుందన్నమాట. వృద్ధిఅయిన ఆదాయంలో ¼ వ వంతు దాపరికం చేయబడినట్లైతే గుణకం విలువ దాపరిక ధన పరిమాణాము 1 చే విభాగింపబడితే వచ్చే సంఖ్య. అంటే నాలుగు అన్నమాట ($\frac{1}{\frac{1}{4}}=4$). ఈ పెట్టుబడి వలన వృద్ధిఅయిన జాతీయాదాయం 1 × 4 = 4 అన్నమాట. పెట్టుబడి = 1; గుణకపు విలువ - 4; అయినట్లయితే జాతీయాదాయాభివృద్ధి పెట్టుబడిని గుణకముపెట్టి హెచ్చిస్తే వచ్చేవిలువ (4) అన్నమాట. కాని అన్ని దశలందు కూడ పెట్టుబడి ధనం, దాపరిక ధనానికి సమమౌతుంది. మన ఉదాహరణలో 1 పెట్టుబడి వలన వచ్చిన 4 జాతీయాదాయంలో తిరిగి 1 దాపరికం చేయబడుతుంది

తరువాత కీన్సు ప్రభుత్వ ప్రమేయానికి కల ఆవశ్యకతను వక్కాణించారు. నేటి కాలంలో ప్రభుత్వరంగానికి (Public Sector) ప్రాముఖ్యత అంతకంతకు వృద్ధి అవడం విదితమే. ఈవిషయంలో కూడ కీన్సు, సాంప్రదాయక శాస్త్రజ్ఞులతో సంపూర్ణంగా వ్యతిరేకించారు. సాంప్రదాయక శాస్త్రజ్ఞుల ప్రకారం ప్రభుత్వం ఆర్థిక రంగంలో సంపూర్ణ తటస్థ భావాన్ని ప్రదర్శింపడమే

వాంఛనీయము. పెట్టుబడిదారీ విధానంలోని లోపాలన్నింటిని పరిదిద్దగల అతి వాంఛనీయమైన సంస్థ ప్రభుత్వం అని కీన్సు వాదించారు. ఆర్థిక మాంద్యతా కాలంలో లాభాలకోసం ఆశించని ప్రభుత్వం, పెట్టుబడి పెట్టి, జాతీయాదాయం వృద్ధిచేసి తిరిగి ఆర్థిక రంగంలో నవ చైతన్యాన్ని కలిగించవచ్చును. దేశంలో పెట్టుబడికన్న దాపరికం బాగా ఎక్కువైనప్పుడు లోటు వ్యయపద్ధతి (Deficit Spending) అనుసరించి దాపరికపు ధనానికి, పెట్టుబడికి సమస్థితిని రూపొందింపవచ్చును. అల్లాగే ద్రవ్యోల్బణ పరిస్థితిలో మిగులు బడ్జెట్టు (Surplus Budget) విధానాన్ననుసరించి ధరలను అదుపులో పెట్టవచ్చును. ఈవిధంగా లార్డు కీన్సు ప్రభుత్వ ప్రమేయాన్ని సమర్థించారు.

దేశంలో ఆర్థిక సమత కొంతవరకు ఉండాలని కీన్సు అంగీకరించారు. దీనికై ధనవంతులమీద అధికమైన పన్నులను, బీదవారిపై తక్కువ పన్నులను వేయాలని ఆయన చెప్పారు. అంతేకాక ఎల్లప్పుడు పెట్టుబడిని తద్వారా, జాతీయాదాయాన్ని వృద్ధి చేసేందుకు వడ్డీ రేటు తక్కువగా ఉంచాలి.

ఇక అంతర్జాతీయ ఆర్థికరంగంలో కీన్సు కృషిని పరిశీలిస్తాం. అంతర్జాతీయ రంగంలో స్వేచ్ఛా వ్యాపార విధానం (Free Trade) ఏనాడో రూపుమాసిందని, దాని పునరుద్ధరణం, అసంభవమే కాక అవాంఛనీయమని, కీన్సు భావించారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామము, ఆర్థిక మాంద్యాల మూలంగా దేశాలు ప్రాచీన వాణిజ్య మార్గాన్ని (Mercantalism) అనుసరింపసాగాయి. ఈ వైఖరిని కీన్సు ప్రోత్సహిస్తున్నారని కొందరు నిందించారు. కాని కీన్సు అంతర్జాతీయ ఆర్థిక సంఘీభావాన్ని ఎక్కువగా ప్రోత్సహించినవారు. దేశాలు వర్తకరంగంలో పరస్పర వైషమ్యాలతో వర్తించడం కీన్సుకు ఏమాత్రం ఇష్టం లేదు. నిరుద్యోగం దారిద్ర్యం మొదలైన దేశీయ సమస్యల మూలంగా అంతర్జాతీయ రంగంలో అసమస్థితి (Imbalance) ఏర్పడుతుంది. పరస్పర సహకారమే దీనికి మందు. స్వేచ్ఛా వ్యాపార విధానం, ఈ దేశీయ సమస్యలను తాత్కాలికంగా అణచివేయ కలుగుతుందే కాని సంపూర్ణంగా తొలగించి వేయలేదు. అందువలన అది అవాంఛనీయము. దేశీయ సమస్యా పరిష్కారం, అంతర్దేశీయ సహకారం ఈ అసమస్థితిని తొలగించగలవు. ఈ విషయాలని మనస్సులో ఉంచుకొని కీన్సు, అంతర్జాతీయ ద్రవ్యనిధిని (The International Monetary fund) స్థాపించడానికి తీవ్రకృషి సల్పి కృతార్థులయ్యారు. తరువాత ప్రపంచ బ్యాంకు (The world Bank) కూడ సంస్థాపితమైంది. ఈ రెండు సంస్థలు ఆ మహానుభావుని కార్యదీక్షకు, అఖండౌదార్యానికి శాశ్వత చిహ్నాలై సర్వమానవ కల్యాణానికి తోడ్పడుతున్నాయి, నేటికీ.

* *

ఇంతవరకు కీన్సు తత్త్వాన్ని, సిద్ధాంతాలను పరిశీలించాము. కీన్సు కేవలం సిద్ధాంతి మాత్రమే కాదు. ఆయన లోకానికెన్నో మహోపకారాలు విసుగు విరామం, లేక చేసిన పుణ్యపురుషుడు. సాంప్రదాయికమైన, అసంబద్ధమైన మూఢనమ్మకాలతో పతనమైన ఆర్థిక జగతిలో తన నిరుపమానమైన మేధాశక్తితో, అఖండ విప్లవాన్ని కలిగించిన జ్ఞాని అతడు. ఆయనకు పూర్వం ప్రపంచ ఆర్థికశాస్త్రరంగంలో అంధకారం ఆవరించింది. అప్పటికి ఉన్న శాస్త్ర విషయాలు మిణుగురు పురుగుల వంటివి. వానిని చూచి అంధకారమగ్నులైన ప్రజలు మహాజ్యోతులని నమ్మారు. కాని కళ్లకు మిరుమిట్లు గొలిపే శక్తి సహస్రకాంతి కిరణాలతో కీన్సు మహానుభావుడుదయించి అంధకారాన్ని మటుమాయం చేశాడు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఇరవదవ శతాబ్దంలో ఆర్థికశాస్త్ర ప్రపంచంలో కీన్సు సంజనింపచేసిన మహత్తర విప్లవం ఇంతకుముందు, పద్దెనిమిదవ శతాబ్దిలో రాజకీయరంగంలో కలిగిన ఫ్రెంచి విప్లవం ఏమంత ఘనమైనది కాదనడం అతిశయోక్తి కానేరదు.

# కలగూరగంప

## ప్రాచ్యపాశ్చాత్యవిమర్శన విధానములు

శ్రీ మొదలి శివకామయ్య

ఏకళయైనను మానవుని కానందదాయకము. అందును కావ్యకళ భావప్రకటనచే సంతృప్తినిచ్చును సంఘ వ్యక్తులకు పరస్పరానుగాహకమై సహకారానుసరమగు సామాన్య భావానుభూతిచే సంధానములగు సామాన్యాభిప్రాయములను, భావములను, ఆదర్శములను, దృక్పథమును, సంస్కృతిని పెంపొందించును. ప్రతిబింబించును. దృఢపరచును. అట్లు చేయుటచే సామాజిక వికసనమునకు, ఐక్యమునకు, పురోభివృద్ధికి తోడ్పడుచుండును. ఏ నాగరిక చరిత్ర గాంచినను కళలు, ముఖ్యముగా కావ్యకళ, ప్రథమదశయందే ప్రారంభమున కనతిదూరమునందే పొడగట్టును. సాహిత్యమున విమర్శ యనగా కావ్యముల గుణదోష విచారమును, ప్రాశస్త్య వివరణమును, అని మనము స్థూలముగా నిర్వచించుకొనవచ్చును. ఇట్టి విమర్శ కొంత కావ్యసృష్టి జరిగిన పిమ్మటనే సాధ్యమగును. కనుక ఏ సాహిత్యచరిత్రలోనైనా కొంతకాలము గడచినపిమ్మటనే విమర్శన సాహిత్యము వెలువడును.

కావ్యము సామాజిక ప్రయోజనముగల సాంస్కృతిక సాధనమగుటచే, సామాజిక పరిస్థితులకు అవసరములకు అనుగుణముగ విమర్శన సాహిత్యము పెంపొందుట సహజము. కావ్యములు కొంత విరివిగ సృష్టి యాయినపిమ్మట, రసజ్ఞులసంఖ్య పెరిగినపిదప, కవుల నుచితరీతిని గౌరవించుటకును ఉత్తమ కావ్య ప్రచారమునకును, కావ్య గుణదోషవిచారమును, తారతమ్య పరిశీలనమును, ప్రాశస్త్య వివరణమును, అవసరములగును. ముఖ్యముగ కావ్యకళకు సమాజమున సాంస్కృతిక వ్యాపారములందు గౌరవనీయమును అర్హమునగు స్థానము నిరూపింప నావశ్యకత యేర్పడును. కనుక అతిప్రాచీన కాలముననే ప్రాచ్యమునగాని పాశ్చాత్యమునగాని కావ్యప్రయోజనము, కావ్యకళా విశిష్టస్వభావము, కావ్య రచనాక్రియ, తదవలంబన విధానములు, సాధనములు, సహృదయుని పైని తత్కావ్యప్రభావము, సహృదయానంద స్వరూపము మొదలగు తాత్త్విక విషయములు విజ్ఞులు విచారించి వెలుగపరచిరి. విమర్శన సాహిత్యమున ఇట్టి తాత్త్విక విచార రూపకగ్రంథములు ఒక ప్రత్యేక భాగమగును — Philosophy of Aesthetics, or Theory of Poetry, — పాశ్చాత్యమున Aristotles poetics, Treatise on the Sublime by Longinus, ప్రాచ్యమున భరతముని నాట్యశాస్త్రము, ఏతద్రససూత్ర వ్యాఖ్యాన రూపకములగు అలంకార శాస్త్ర గ్రంథ భాగములు, నీ విమర్శన సాహిత్య భాగమునకు చెందినవిగ మన మెన్నవచ్చును.

ఇట్టి విమర్శన గ్రంథములు ప్రామాణ్యమును సంపాదించిన పిమ్మట కావ్యరచన అందలి సూత్రముల కనుగుణముగనే జరుగుట సహజము. సూత్రగ్రంథ ప్రామాణ్య బలమును ఉత్తమకావ్య సంప్రదాయానుసరణమును పురస్కరించుకొని వివిధ కావ్య ప్రయోజనములును, వివిధ విధాన స్వరూపావకాశ సాధనములును, వాని నుపయోగించు కవి ప్రతిభా సామర్థ్య పద్ధతులును, ఇత్యాది విషయములు విమర్శకులు చర్చించి నిర్ణయించుట జరుగును.

ఇట్టిదియే విమర్శయొక్క శాస్త్రమగును. కవులకు రచనా క్రియయందును, సహృదయులకు ఆస్వాదన క్రియయందును, విమర్శకులకు గుణదోష నిర్ణయ కార్యమందును, నిట్టి శాస్త్ర గ్రంథములు కాలక్రమమున నధికాధిక గౌరవమును సంపాదించును. ప్రమాణ సూత్రాధారముగ విమర్శకుని కావ్యగుణదోష తారతమ్య నిర్ణయము, నిరూపణ మాత్రమే యగును. చాల

కాలమువరకు ప్రాచ్యమునగాని పాశ్చాత్యమునగాని ఇట్టి విమర్శన సాహిత్యమే విరివిగా వృద్ధి చెందెను.

కాని, కాలక్రమమున మానవునకు శాస్త్రీయ దృష్టితో నిర్ణయింపబడిన సిద్ధాంతములందును, సాంప్రదాయకాభి ప్రాయములందును గౌరవముతగ్గి హేతువాదమునందును, అనుభవమునందును ప్రామాణ్యబుద్ధి పెరుగజొచ్చినది. కాన, ఆధునిక యుగమున విమర్శన సాహిత్యమునందు గొప్ప మార్పువచ్చెను. ప్రాచీన సూత్రములను స్వానుభవముతో, స్వబుద్ధితో పరిపోల్చి అంగీకార్యములని తోచినవే గ్రాహ్యములుగ స్వీకరించుటయు, అనవసరమైన పరిహరించుటయు, అనంగీకార్యములైన త్రోసిపుచ్చుటయు, న్యాయమనుదృష్టి ఆధునిక యుగమున ప్రబలెను. వివిధ దేశములందును, భావములందును, విభిన్న పరిస్థితులలోను ఆయా ప్రజల యాశయములకు సామాజికావసరానుకూల పద్ధతులు రూపొందించిన సాహిత్య గుణదోష విచారము, తారతమ్య పరిశీలన, ప్రాశస్త్య నిరూపణము, మున్నగు విమర్శనక్రియ యంతయు ఆ కవి యుద్దేశించిన ప్రయోజనమును, ఆ కవి జీవిత పరిస్థితులను, అతని సమాజ పరిస్థితులను, అవసరములను, సమాజ చరిత్రను, సాహిత్య చరిత్రను, మనసున నుంచుకొని విమర్శకులు సమీక్ష జరుపవలెనను దృష్టికి గౌరవము హెచ్చెను. విమర్శకుడు కవికి గౌరవస్థాన విద్యాధికారి గాడనియు, కావ్యావగాహనా ప్రాశస్త్య గ్రహణ ప్రయోజనానుభూతులందించి సహృదయునకు సహాయము చేయుటయే విమర్శకుని కృత్యమనియు ఎన్నబడసాగెను. ఈ సమయముననే ప్రజలలో అధిక సంఖ్యాక విద్యాబోధనకు, విజ్ఞాన సముపార్జనకు నవకాశము లధికములయ్యెను. పాఠశాలలు, గ్రంథాలయములు బహుళముగ స్థాపింపబడుటకు అనుకూల పరిస్థితులేర్పడెను. గ్రంథ ప్రచురణ, పత్రికా ప్రచురణ, వాఙ్మయ విజ్ఞాన సముపార్జన అధికము గాజొచ్చెను. ప్రజలకు, తత్ప్రతినిధులకు ప్రభుత్వమున నధికారము హెచ్చి కళా సాహిత్య ప్రయోజనము ప్రజా బాహుళ్యమునకు చెందవలెనను నభిప్రాయము వ్యాపించెను. అట్లు చెందజేయుట విద్యావేత్తలకు, కవులకు కూడ లాభకరమై, పరిణమించెను.

కనుక నీ పరిస్థితులలో వెలువడిన విమర్శన గ్రంథములు కావ్యగుణదోష నిర్ణయముతో వదలక ప్రాశస్త్య ప్రదర్శనకును గడంగెను. ఇది (Interpretative Criticism) వ్యాఖ్యా సముపేతవిమర్శన రీతి అనదగును. మరియు కొంతకాలము గడచినపిమ్మట, ప్రస్తుతకాలమున, నీ ప్రాశస్త్య ప్రదర్శనముకూడ, హేతుబద్ధములగు వాదములతోను, విచారణతోను సంతృప్తి చెందక, అనుభూతిని సంక్రమింపజేయు కావ్య పద్ధతికూడ జరుగుచున్నది. అనగా కావ్యరసాస్వాదనా ప్రత్యేకానుభూతియు, ప్రతిభా సామర్థ్యములు, గల విమర్శకుడు ఆదర్శ సహృదయుడగు తాను అనుభవించిన కావ్యానందమును, ప్రాశస్త్య ప్రదర్శన సందర్భమున పాఠకునకు సంక్రమింపజేసి, పాఠకునకు కావ్యమునం దభిరుచియును, పఠనాసక్తియు వృద్ధిచేయ ప్రయత్నించుచున్నాడు. ఇది కావ్యగుణముగల విమర్శ (Creative Criticisim) అనదగి కావ్యములకు చెందిన సాహిత్యరూపమే అగును. ఆయా విమర్శనా గ్రంథములు, ఆయా కాలముల ప్రాచ్యమునను, పాశ్చాత్యమునను కూడ గలవు. కాక ఆధునికయుగమున రాజకీయముగను, ఆర్థికముగను, పాశ్చాత్యదేశములకు ప్రాచ్యదేశములు వెనుకబడి యుండుటవలన సాంస్కృతిక రంగమునను, విమర్శన సాహిత్యమునను కూడ ఆధునికతర విమర్శ ప్రాచ్యమున స్వల్పముగ నున్నది. ఇప్పుడిప్పుడే మనము ఆర్థిక రాజకీయాభివృద్ధితో వైజ్ఞానిక సామాజికాభ్యుదయ కార్యక్రమము నుత్సహించుట వలన, మన దేశభాషలందును వ్యాఖ్యా సముపేతమైన (Interpretative criticism and creative criticism) కూడ కొంచెముగ వెలువడుచున్నవి.

కనుక ఈ విమర్శనరీతులను ప్రాచ్యములని, పాశ్చాత్యములని విభజింపక ప్రాచీనములని ఆధునికములని విభజించి మనము ప్రస్తుత పరిస్థితుల కనువగు ఆధునిక పద్ధతుల నవలంబించి, ప్రస్తుతావశ్యకముల నుపయోగించి, ప్రజాబాహుళ్యమునకు కావ్యకళా ప్రయోజనములు సాధ్యమగుటకును, సత్కావ్య ప్రాశస్త్య గ్రహణమునకును, అందువలన కలుగు ఆనందానుభూతికిని, సాంస్కృతికాభివృద్ధికిని, పాటుపడుట మంచిది. ఆధునిక విమర్శనపద్ధతులు పాశ్చాత్యములని, వాని నవలంబించుట, స్వదేశభక్తి లోటని మనము వాని నుపేక్షించుటయు, ప్రాచీనములగు పద్ధతులనే అవలంబించి నేటి కావ్యములను కూడ విమర్శించుటయు కేవలము పొరపాటగును.

# గ్రంథవిమర్శనము

## సంస్కృతకళాపూర్ణోదయః

ఎరమాటి మల్లికార్జునరావు. ఆంధ్ర యువతీ సంస్కృతకళాశాల, రాజమహేంద్రవరము. వెల: మూడు రూపాయలు.

ఆంధ్ర ప్రబంధాలన్నిటిలోను, ఒక్క కళాపూర్ణోదయంలోనే ఉదాత్త కవితతోపాటు కథాకథన చాతుర్యంకూడా ఒక పరమావధికి వెళ్ళిపోయింది.

అసలీ ప్రబంధం కథా ప్రారంభమే ఒక నవలా ప్రారంభంలా అడుగడుగున దవ్వులూరిస్తూ ముమ్మరం దుకు సాగిపోతుంది.

ఇది మిగిలిన భారతీయ భాషలన్నిటిలోనికీ అనువదింపదగిన ఆంధ్ర ప్రబంధం. అయితే కవితానువాదం అంత తేలిక కాదు.

కనకనే అనువాదకులీ ప్రబంధం సంస్కృత గద్య ప్రబంధంగా రూపొందించినట్లు తోస్తుంది.

నేటి కాలంలో సంస్కృత గద్య రచనగాని, పద్యరచనగాని అంత తేలిక కాదు. అందులోను గీర్వాణభాష మడికారం పాలుపోకుండా రచన సాగించడం మరింత కష్టం.

అయితే శ్రీ మల్లికార్జునరావుగారి సంస్కృత గద్యానువాదం ప్రాచీన సంస్కృత గద్య రచయితల శిష్టశైలి స్ఫురింపజేస్తూ ఎంతో హృద్యంగా సాగిపోయింది.



ఆంధ్రకళాపూర్ణోదయానికి సంస్కృత గద్యలో చేసిన ఈ అనువాదంవల్ల సంస్కృత భాషాభిజ్ఞులైన ఆంధ్రేతరులందరికీ మన కళాపూర్ణోదయ ప్రబంధమాధుర్యం ఆస్వాదించే అవకాశం కలుగుతుంది.

అనువాదకులు కేవలం కథమాత్రమే కాక, మూల ప్రబంధంలోని వర్ణనలుకూడా చాలావరకు సంస్కృతంలోనికి అనువదించారు.

కాని గ్రంథవిస్తరభీతివల్ల కొన్ని మూలవర్ణనలు, ఆంధ్రప్రబంధ పీఠిక సంస్కృతంలోనికి అనువదించకుండా విడిచివేశామని అనువాదకులు తమ గ్రంథపీఠికలో తెలియజేశారు.

అన్నివిధాలా హృద్యమయిన ఈ అనువాద రచనకు ఇది ఒక లోపం. ద్వితీయ ముద్రణంలోనైనా వాటిలోటు పూర్తిచేస్తే ఆంధ్రేతరులయిన సంస్కృతవిద్వాంసులకు సంపూర్ణంగా ఆంధ్రకళాపూర్ణోదయ స్వభావం అవగాహన చేసుకునే అవకాశం కలగగలదు.

'శాస్త్రి'

## కవుతరం చరిత్ర

తల్లూరి వంగపతిరావు. కవుతరం కృష్ణాజిల్లా. వెల: రెండురూపాయలు.

ఇది బందరుకు వాయవ్య దిక్కుగా 11 మైళ్ళ దూరంలోనున్న కౌతరం గ్రామ చరిత్ర.

నిజానికిది ఒక ప్రసిద్ధ గ్రామచరిత్ర. అయితే ఈ గ్రామ చరిత్ర పరిశోధనలో కూలంకషంగా కృషి చేశారు గ్రంథకర్త.

క్రీస్తుపూర్వ 1వ శతాబ్దం మొదలుకొని నేటి కాలంవరకు గడిచిన ఈ గ్రామచరిత్ర అంతా ఈ గ్రంథంలో విపులంగా విస్తరించారు.

కవుతరం అనే ఈ గ్రామం సముద్రగుప్తుని శాసనంలోని కొత్తూరకమే అని గ్రంథకర్త ప్రతిపాదిం

చారు. గౌతమపురం కౌతరం అయి ఉండవచ్చునని కూడా వీరింకో ప్రతిపాదన చేశారు. వీరి రెండవ ఊహ నిజమే కావచ్చును. ఇక సముద్రగుప్తుని శాసనంలోని 'కొత్తూరక' మే కవుతరంగా మారిన దన్న విషయం పూర్తిగా తోసివెయ్యడానికి గాని, అంగీకరించడానికి గాని వీలులేదు. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారన్నట్లు ఇది ఇంకా పరిశీలించదగిన విషయం.

గ్రంథకర్త ముఖ్యంగా అతి ప్రాచీన కాలం మొదలు కొని నేటివరకు గల గ్రామచరిత్రాంశాలన్నీ జాగ్రత్తగా పరిశీలించారు. అందులో ఇటీవలి ఈ గ్రామ చరిత్రకు సంబంధించిన విషయాలెన్నో వీరు జాగ్రత్తగా సేకరించి ఈ గ్రంథంలో పొందుపరిచారు.

క్రీస్తుశకం 17, 18 శతాబ్దాలలో ఈ గ్రామ చరిత్రకు సంబంధించిన విషయాలు కొన్ని మన చరిత్రకారులు జాగ్రత్తగా పరిశీలించదగినవి.

ప్రాచీన చరిత్రవిషయంలో వీరి ప్రతిపాదనలు కొన్ని సందేహాస్పదంగా ఉన్నా కవుతరం గ్రామ చరిత్రరచనలో ఈ గ్రంథకర్త చేసినకృషి ప్రశంసార్హం. ఆంధ్రదేశంలో ఎన్నెన్నో పురాతన నగరాలు, పుణ్యస్థలాలు, చారిత్రిక విశేషాలు ఉన్నాయి. వీటిని గురించి, ప్రాచీన కాలంనించీ నేటివరకు గల సమగ్ర చరిత్ర వ్రాయవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉన్నది.

గ్రంథకర్త ఈ రచనతో అటువంటి రచనలకొక పునాది వేశారు. వీరి ఒరవడి అనుసరించి చారిత్రకులు విపులమయిన చరిత్ర రచన కుపక్రమింతురని ఆశిస్తున్నాను.

'శాస్త్రి'

## శ్రీ కృష్ణ కర్ణామృతము
### [ఆంధ్రీకృతి]

బాపట్ల హనుమంతరావు. చిన్న గంజాము. (పి. ఓ.) గుంటూరు జిల్లా. వెల: రూపాయి

శ్రీకృష్ణ కర్ణామృతానికి ఆంధ్రంలో వెలగపూడి వెంగనామాత్యుని ఆంధ్రానువాదం ఒకటి సుప్రసిద్ధంగా ఉన్నది. ఆ అనువాదం అంతా వృత్తాలలో నడిచింది. ప్రస్తుతానువాదకులు అనువాదంలో అంతటా గీతికలే స్వీకరించారు.

కృష్ణ కర్ణామృత కర్త లీలాశుకుడు మూల సంస్కృతంలో పలువిధాలయిన ఛందస్సు లుపయోగించాడు. అనువాదంలో మూలఛందస్సులకు సమానమైన వృత్తాలు, గీతాలు, కందాలు మొదలయిన వేరు వేరు ఛందస్సులు వాడితే కొంతవరకు మూలానికి తెలుగులో న్యాయం జరుగుతుంది. లేకపోతే పెద్ద వృత్తాలు వాడినప్పుడు మూలభావాలు, కొంత పొడిగించడము, గీతాలు మొదలయినవి వాడితే మూలభావాలు, విశేషణాలు కొన్ని వదలివెయ్యడం వల్ల కుదించడము జరుగుతూంటాయి.

అయితే మూలశ్లోకం కొంత చిన్నదయి నప్పుడు ప్రస్తుతానువాదం మూలానికి కొంత సన్నిహితంగా నే నడిచింది.

దీనికి ఈ క్రింది అనువాదం తార్కాణ:

"శైవా వయం, నఖలుతత్ర విచారణీయం పంచాక్షరీ జపపరా నితరాం తథాపి, చేతో మదీయ మతసీ కుసుమావభాసం స్మేరాననం స్మరతి గోపవధూ కిశోరం"

దీనికి వీరి గీతికానువాదం ఇది :

"సతము పంచాక్షరీ మంత్ర జపము సలుపు
శైవులము మేము, అయినగాక స్వాంత మెపుడు

నల్లని నీ పూలతేజము, నవ్వు వెలుగము
పాలందు శ్రీకృష్ణ జింతింపవలదు నారి!"

ఇక్కడ అనువాదంలోని 'శైవాళగాం,' 'పంచాతురీ జరపరి' అనే రెండు విశేషణాలు ఒక వాక్యంలో కుదించడం వల్ల మూలంలో ఈ సందర్భంలో వచ్చిన సొగసు చెడిపోయింది

అయితే వీరి అనువాదం చాలాచోట్ల జిలిబిలి పదాలతో హృద్యంగా సాగింది.

"లీల గేలందమిత్రని మునికోల బూని
రత్న కుండల హేమసూత్రములు గదల
శ్రమజలముదోప వంబున శ్యామమైన
పార్థరథభూషణమ్ము, గాపాడు మమ్ము!
'శాస్త్రి'

## భీమన్న కావ్య కుసుమాలు

[ఖండకావ్య సంపుటి]

శ్రీ బోయి భీమన్న. ప్రతులకు: నవ్య సాహితీ సమితి, 208, బోయగూడ, సికింద్రాబాదు. వెల: తెలియదు.

ఇది 70 ఖండకావ్యాల సంపుటి.

కొంతకాలమునించీ అనుస్యూతంగా కవితారచన సాగిస్తున్న నేటి యువక కవులలో శ్రీ బోయి భీమన్న గారొకరు. వీరింతకు పూర్వము మనుశాల, రాగోదయం, దీపసభి మొదలయిన కృతులు ప్రచురించారు. ఇది కొత్తగా ప్రచురించిన కావ్యసంపుటి.

ఈ ఖండికలలో కొన్ని ప్రకృతివర్ణన పరమైన కావ్యాలు. మరికొన్ని జానపదుల సహజమాధుర్యం చిత్రించే ఖండకృతులు. మరికొన్ని కవి ఆత్మపరంగా రచించిన కావ్యాలు. ఎడనెడ కొన్ని గేయాలు. ఇలాగ వివిధరీతులలో సాగిపోయింది వీరి ఖండకావ్య రచన.

శ్రీ భీమన్న కృతులలో అక్కడక్కడ ఆధునాతనులయిన పెద్ద తరంవారి రచనల ప్రభావం కనిపిస్తుంది. అయినా ఈ కవి దృష్టి సహజమైన భావవ్యక్తీకరణపైనే సాగిపోతుంది. ఇందువల్లనే వీరికవిత కొన్నిపట్ల చక్కని ఉత్తమస్థాయి అందుకుంటుంది. 'రత్నమాల' అన్న ఖండకృతి వీరి కవితాపరిణతికొక ఉదాహరణ: ఆ కృతిలో ఒక వృత్తం ఉదాహరిస్తున్నాను.

"మామిడి పూలవాసనల
మత్తున నూతన పర్ణశాలలో
మైమఱపొంది జీవితపు
మాధురులన్ కలలందు కాంచుమున్
కోమలి ఈ వసంతమును
ఉత్తిక కైకొని యుంటివి: నా హృదా
రమము చాల రమ్యముగ
రమ్మికమా టిటు తొంగిచూడుమా."

ఇలాగే 'నిషా' అన్న వీరి ఖండకావ్యం కూడా ఉత్తమ కవితాస్థాయి అందుకున్నది. ఈ వృత్తం దానికి తార్కాణం.

"అందెల మువ్వలందు, కమ
లాకరమందు, పాలమ్ములందు ఉ
ద్యానములందు, నా యుసురు నం
దగుసుంచుచు ప్రేమకోలయా
చానయ వోలె నిషా నిషా
జాలదు నన్ను నిచేవ మేనియుక్!
దీని చరిత్ర వెన్కగల ధీనిత
కే పరమార్థ మున్నదో!"

'కావ్యకుసుమాలు'లో కొన్నిచోట్ల బోయి భీమన్న గారికవితలో నూతన పరిణతి, ఉదాత్తత గోచరిస్తున్నాయి. ఆధునిక కవితాభిమానులు పరిశీలించదగిన ఖండకావ్య సంపుటమిది.

'శాస్త్రి'



Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.